# త్వరగా నురగను తెచ్చు సన్‌లైట్ బాద కుండ
# తెల్ల మరియు ప్ర వంతం గా ఉతుకును



"చూచారా నా తువ్వాలు ఎంత తెల్లగానుందో, అందుకు కారణమేమంటే అది సన్ లైట్ సబ్బుతో ఉతుకబడుటచేతనే. సన్ లైట్ నుండి త్వరగా వచ్చు నురగలు మలినమును పోగొట్టును. సన్ లైట్ తో ఉతుకుటవలన మీ బట్టలు మిక్కిలి శుభ్రముగాచేయబడుటచే అవి తళతళమని మెరయునంత తెల్లగానగును!"



"ఈదుటవలె మరేదియును నన్ను హాయిగా నుంచదు. రంగు బట్టలను సన్ లైట్ సబ్బు శుభ్రముచేసేటట్లు మరేదియునుచేయదు సన్ లైట్ యొక్క మృదువైన నురగ బట్టలను బాదకుండగనే వాటిలోని మలినమును పోగొట్టును— సన్ లైట్ మీ బట్టలను మృదువుగా ఉతుకుటచే మీ బట్టలు చాలకాలము వచ్చును.









ఇండియాలో తయారుచేయబడిన

# భారతి

సాహిత్య మాసపత్రిక

సంపాదకుడు :

శివలెంక శంభుప్రసాద్

ఆగస్టు **1954**

సంపుటము 31 : : సంచిక 8

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

o :—

## ఆగస్టు 1954



త్రివర్ణ చిత్రము : సహధర్మిణి—యస్. గోపాల్‌గారు

"ఎంతో తెల్లనిది—ఎంతో శుద్ధమైనది—
లక్స్ టాయ్‌లెట్ సబ్బుయొక్క నురగ ఎంతో
మెత్తగాను, సువాసనగాను ఉంటుంది"

అని బి. ఎస్. సరోజా
చెప్పుచున్నది






లక్స్ టాయ్‌లెట్ సబ్బుయొక్క సమృద్ధియైన మెత్తని నురగ మీ చర్మముయొక్క సహజ అందాన్ని వెల్లడిస్తుంది. బి. ఎస్. సరోజా ఇలా చెప్పుచున్నది: "ఈ తెల్లని పరిశుద్ధమైన సబ్బును ఎప్పుడూ వాడుట వల్ల చర్మమునకు అద్భుతమైన మార్పు ఏర్పడుతుంది. చాల లోపలి భాగమునుకూడ శుభ్రపరచు దీని నురగ చర్మ రంధ్రాలలో చొచ్చి చర్మాన్ని పుష్పరేకువలె మృదువుగాను, సొగసుగాను వుంచుతుంది."

"...నే నెల్లప్పుడూ నా చర్మ సౌందర్యానికి సొగసును గలిగించే లక్స్ సబ్బునే వాడుతాను."

గొప్ప వార్త!
శరీరమంతా సౌందర్యముగా నుండుటకు!
క్రొత్త
## పెద్దసైజు సబ్బు
ఇప్పుడు దొరకుచున్నది.
ఇవ్వాళే దానిని వాడి చూడండి!

**సినీమా తారలకు సౌందర్యమునిచ్చు సబ్బు ★**

LTS. 423-X52 TL



సహధర్మిణి

చిత్రకారుడు శ్రీ యస్. గోపాల్



జయ
శ్రావణము

భారతి

సంపుటము 31
సంచిక 8

# * వధువు *

చిరంజీవి

పయనమాయె వధువు పతి ఇంటికి:
ప్రణయ రుచిర మధువు వరునింటికి :

వాకిట మల్లెల మొగ్గలు
వకుళము లందపు ముగ్గులు
పరిచయ వశమున పాడెను
విరహరీతి వీడ్కోలును
పయనమాయె వధువు
పతి ఇంటికి :

విడని మమత లుడుగలేక
తడబడి ముందడుగురాక
తల్లడిలెడి తల్లియొడిని
చల్లెను కన్నీటి జడిని
పయనమాయె వధువు
పతి ఇంటికి :

మరువకు మని చతురులాడి మరల మరల మమతలాడి
నెరపె మేలి లాలితనము ఇరుగు పొరుగు సఖీజనము
పయనమాయె వధువు పతి ఇంటికి :

పదిలము నీ కాపురమని పెద తల్లియు నిడె దీవెన
బిడ్డ నెత్తవలె సుమ్మని పినతల్లి యనె ప్రేముడిని
పయనమాయె వధువు పతి ఇంటికి :

పెద్దది ముత్తయిదువు జత
దిద్దగ పారాణి పూత
తటుకున చెదరెను తలపులు
చిటికాటుక కన్నీళులు
పయనమాయె వధువు
పతి ఇంటికి :

వెండికొండ చందురువలె
బండి బాట మలుపు మరలె
అంత కంత నాయె నెడము
ఆత్మీయత లెసగు గృహము
పయనమాయె వధువు
పతి ఇంటికి :

శుభశోభిత పోయిరమ్మ !
లాభముతో మగిడి రమ్మ !
అనిరి గద్గద భాషిణులు
కనిరి సాశ్రుజల నయనలు
పయనమాయె వధువు
పతి ఇంటికి :

విడచి తటాకతటపథము
కడచె తాళవనాంతరము
క్రమక్రమము స్వగ్రామము
కను మరుగై పోయె దివము
పయనమాయె వధువు
పతి ఇంటికి :

గుడిగంటల గణగణ రుతి
కోడెల మెడ మువ్వలశ్రుతి
శ్రావణ జలధరరీతిని
సాగె బండి మందగతిని
పయనమాయె వధువు
పతి ఇంటికి :

మందానిలములు హసించె
మరల నొడలు పులకరించె
ఎడద గదిసె మగనిరూపు
వెడలె పెదవుల చిరుమెరుపు
పయనమాయె వధువు
పతి ఇంటికి :

పయనమాయె వధువు పతిఇంటికి
వాలుగనుల వధువు వరునింటికి :

# జాతీయ ఋణ సేకరణ

## శ్రీ కె. వి. రమణ

పంచవర్ష ప్రణాళిక క్రింద మూడు సంవత్సరములు తరలినవి. దేశపు ఆర్థికవ్యవస్థలో గమనార్హములైన మార్పులు గలిగినవి ధరల పెరుగుదల అరికట్టబడినది. పారిశ్రామికరంగములో ఉత్పత్తి అధికమైన సూచనలు కనిపించుచున్నవి. ఆహారపదార్థముల కొఱత తగ్గి దేశములో కంట్రోల్లు రేషనింగుల ఆవశ్యకత సన్నగిల్లినది. దేశపు దిగుమతుల ఎగుమతుల విలువలలో ఒకస్థాయి (*Balance in the Balance of Payments*) ఏర్పడినది. కాని నిరుద్యోగసమస్య తీవ్రరూపము దాల్చినది. పంచవర్ష ప్రణాళిక క్రింద ఖర్చు పెట్టుచున్న మొత్తము ఈ సమస్యను అసలు తాకనేలేదు. ఈ పరిస్థితులలో ప్రభుత్వము జాతీయ ఋణమును ప్రకటించిరి. పలు కేంద్రములనుండి విరివిగా విరాళములకై ప్రచారము జరుగుచున్నది. ఈ ఋణముపై వివిధవర్గములవారు వివిధాభిప్రాయములను వెలువరించుచున్నారు. ఈ ఋణముయొక్క ఆవశ్యకత, ఎట్టిది? భారతదేశ ఆర్థికాభివృద్ధికి ఈ ఋణ సేకరణ ఎట్లు అనివార్యమైనది. మొదలగు విషయములు అవగాహన చేసుకొనదగియున్నవి.

యుద్ధముతాకిడిచే చిదికిన ఆర్థిక వ్యవస్థను, కుంటువడిన పారిశ్రామిక వ్యావసాయిక రంగములలోని ఉత్పత్తిని, క్రుంగిపోయిన జీవనప్రమాణములను ఎదుర్కొనుటకు పంచవర్షప్రణాళిక తయారుచేయబడి 1951లో అమలు పరుపబడినది. అసలు ప్రణాళికలో చిత్తుప్రణాళికమీద కొన్నిమార్పులు తీసికొనిరాబడినవి. చిత్తుప్రణాళికను తయారుచేసినప్పుడు దేశమును పీడించుచున్న ముఖ్యసమస్యలు ఆహారధాన్యము కొఱత, ద్రవ్యోల్బణము. ఈ రెండిటిని పరిష్కరించుటే 'చిత్తు ప్రణాళిక' ముఖ్యోద్దేశ్యము. కాని ప్రణాళిక క్రింద జరిగిన రెండుసంవత్సరముల అభివృద్ధిని చూసి దానిలో తగు మార్పులు తెచ్చుట అవసరమని ప్రభుత్వమునకు తోచినది. ఏలయనగా రెండవ సంవత్సరాంతమునకు ధరల ఉధృతము తగ్గినది. ఉత్పత్తిలో పెరుగుదల కనుపించినది. కాని నిరుద్యోగము ప్రబలిపోవుచున్నది. ఒకవైపున ఆర్థిక పునర్నిర్మాణముదృష్ట్యా ప్రభుత్వము పంచవర్ష ప్రణాళికను అమలు జరుపుచుండగా, మరొకవైపున దేశములో నిరుద్యోగము పెరుగుట వింతగా కనుపడినది. కాని ఈ నిరుద్యోగసమస్య యుద్ధాత్ పూర్వమునుండీ ఉన్నది. యుద్ధకాలములో యుద్ధావసరముల మూలముగా ఈ సమస్య అప్పటికి వాయిదా వేయబడినది. యుద్ధావసరములు తీరిన తరువాత తిరిగి ఈ సమస్య తలనెత్తినది. నిరుద్యోగ సమస్యకుగల కారణములు, దానిని నిర్మూలించుటకు తీసికొనవలసిన చర్యలనుగూర్చి చర్చించుట ఈ వ్యాసోద్దేశ్యము కాదు. కాని నిరుద్యోగస్థితికి గల రెండు ముఖ్యకారణములను మాత్రము సూచించెదను. జనాభా దేశములోని ఆదాయములకంటెను, ఉద్యోగ సావకాశములకంటెను ఎక్కువగా పెరుగుచున్నది; వ్యవసాయరంగములో ఒక ప్రత్యేకరకపు "నిరుద్యోగ సమస్య" (*Disguised unemployment*) ఉన్నది. దానికి ముఖ్యకారణము భూమిమీద, వలసినవారికంటే, ఎక్కువమంది బ్రతుకుటయే. తరువాత మధ్యతరగతి చదువుకొన్నవారిలో నిరుద్యోగము యుద్ధాత్ పూర్వముకంటె నాల్గురెట్లు హెచ్చినది. ఈ సమస్యాపరిష్కారమునకు మొదటి పంచవర్ష ప్రణాళికలో తావులేదు. కాని దీని తాత్కాలిక నివారణకై రెండవ సంవత్సరాంతమందు మరియొక 175 కోట్ల రూపాయలు ప్రభుత్వము వెచ్చించుటకు నిర్ణయించినది. అంటే ఐదు సంవత్సరములకు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వములు మొత్తము 2244 కోట్ల రూపాయలను వెచ్చించవలెను. దేశము విస్తీర్ణము, జనాభా, ప్రజల ఆదాయములు, మన ఉత్పత్తి శక్తి, ముఖ్యముగా సహజసంపదల దృష్ట్యా చూచిన

ఈ మొత్తము చాల అల్పముగా కనపడును. కాని ప్రభుత్వము ప్రస్తుత పరిస్థితులలో ఎక్కువ ఖర్చు పెట్టుటకు సిద్ధముగా లేదు. ఒకటి: కొలది కాలములోనే కొందరు భావించుచున్నట్లు, భారీఎత్తున ఖర్చుపెట్టినచో ధరలు మరీ పెరుగగలవు. ధరల పెరుగుదల ప్రణాళికవిజయానికే గొడ్డలిపెట్టు. రెండు: దీనివలన జనాభా మార్పిడి సమస్యలు ఉత్పన్నమై త్వరలో పరిష్కరించుటకు దుర్లభము కాగలవు. జాతీయవృత్తి విధాన విభాగములలో (*Occupational patterns*) అవాంఛనీయమైన మార్పులు కలుగగలవు. వీటని తిరిగి సరియైన పంథాలో పెట్టుటకు వలసిన ధనవ్యయము నే కాకుండా, సమాజమునకు కలుగు నష్టమును కూడ ఊహించవలసియుండును. దేశమును పారిశ్రామికముగా వృద్ధిచేయుట ఒక రాత్రిలో జరుగు పని కాదు. రష్యావంటి దేశములలో అట్టి విధానమును అవలంబించుటవలన ప్రజానీకానికి కలిగిన కష్టనిష్ఠురాలు మనందరకు విదితమే. అప్పటి ప్రత్యేక రాజకీయ సాంఘిక పరిస్థితులలో రష్యావంటి నియంతృత్వ దేశం తక్క మరి ఏ యితర ప్రజాస్వామ్య దేశాలు ఆ కష్టాలను ఆహ్వానించలేవు. దేశాన్ని పారిశ్రామికంగా వృద్ధి చేయుటవలన సత్ఫలితాలు కలుగవలెనంటే జనాభా వివిధ వృత్తులలోనూ వివిధ భాగాలలోనూ ఆర్థిక అస్థిరత్వం, అలజడి కలుగకుండా సర్దుకోవాలి. అందువలననే క్రమంగా పారిశ్రామికాభివృద్ధి చేసుకొంటూ పురోభివృద్ధి పొందటంలో లాభాలు ఎక్కువ వున్నాయి. రెండు: భారీ ఎత్తున పెట్టుబడి పెట్టటానికి "పెట్టుబడి" వచ్చేమార్గాలనుకూడా చూడాలి. తక్కువఆదాయాలు తక్కువ ఉత్పత్తివున్న బడుగుదేశాలలో ఆదాయాన్ని నిలువచేసే శక్తి తక్కువ వుంటుంది. ఈ శక్తిమీదనే దేశంలో "పెట్టుబడి" అభివృద్ధి (*Capital Formation*) ఆధారపడివుంటుంది. విదేశీయ ఆర్థికసహాయం విరివిగా దొరకని పరిస్థితులలో ఆర్థికాభివృద్ధి మందంగా వుండకతప్పదు. దేశంలోనున్న నిల్వల మీదనే ప్రభుత్వము, ప్రయివేటు పెట్టుబడిదార్లు ఆధారపడియుందురు. దీనికి కారణము మనఆర్థికవ్యవస్థ మిశ్రమ ఆర్థికవ్యవస్థ(*Mixed Economy*)యగుటయే.

మొదటి 5 సంవత్సరాలలోనూ కేంద్రము 1240 కోట్ల రూపాయలు, రాష్ట్రము 820 కోట్ల రూపాయలు వివిధ రంగాలలో ఖర్చుపెట్టవలసియున్నది. గత మూడు సంవత్సరాలలోనూ కేంద్రము, A, B, C రాష్ట్రములు ఖర్చుపెట్టిన మొత్తము ఈ దిగువ ఉదహరింపబడినది.

| | 1951-52 | 1952-53 | 1953-54 |
|---|---|---|---|
| కేంద్రం | 133 5 కోట్లు | 166-4 కోట్లు | 236-9 కోట్లు |
| A; B, C రాష్ట్రాలు | 128 కోట్లు | 157.2 కోట్లు | 176.1 కోట్లు |

1953—54 సంవత్సరములో ప్రభుత్వము 413 కోట్ల రూపాయలు వెచ్చించగలదని భావించినా, మిగతా రెండు సంవత్సరములలోను 1244 కోట్ల రూపాయలు ఖర్చుపెట్టగలిగియుండవలెను.

5 సంవత్సరములలోనూ పై మొత్తమును ఈ దిగువ నుదహరించిన మార్గములద్వారా రాబట్ట దలచిరి.

(కేంద్రము రాష్ట్రము కలిపి రూ. కోట్లలో)

| | |
|---|---|
| 1. బడ్జెటు ఆదాయములు | |
| (a) ప్రస్తుత ఆదాయపు నిలువలు (*Current Revenues*) | 738 |
| (b) కాపిటల్ ఎక్కౌంటులో నుంచి | 520 |
| 2. విదేశీయ సహాయం (యింతవరకు వచ్చినది షుమారు) | 200 |
| | 1458 |
| ఇతర మార్గాలద్వారా భర్తీ చేయవలసిన లోటు | 786 |

పంచవర్ష ప్రణాళికలోని అంచనాల ప్రకారము కేంద్రము రాష్ట్రములు పన్నులద్వారా, చిన్న మొత్త

ముల సేవింగ్సు స్కీములనుంచి ప్రజలవద్దనుంచి ఋణములద్వారా, అనుకొన్న పెట్టుబడి ధనమును రాబట్ట గలిగినా, యింకా భర్తీ చేయవలసిన భాగము 800 కోట్ల రూపాయలు సుమారుగా మిగిలిపోతుంది. ఈ ధనము బడ్జెటు లోట్లుద్వారా పూర్తిచేయవలసి వుంటుంది.

అసలు ప్రణాళికలో అంచనాల ప్రకారము, కేంద్రం రాష్ట్రాలు పెట్టుబడి ధనాన్ని ప్రోగు చెయ్య లేకపోయినాయి. కేంద్రం పన్నుల ఆదాయమును కొద్దిగా హెచ్చు చేయగలిగినా, ప్రయివేటు పెట్టుబడిదారులకు ప్రోత్సాహము కలిగించుటకై అధిక ఆదాయములమీద ఆదాయపు పన్ను రేటు తగ్గించుట వలన, ఎగుమతుల పన్నుల రేట్లు మార్చుటవలన రాష్ట్రాలకు ఆదాయపుపన్నులలో భాగము హెచ్చుచేయుట వలన, అనుకొన్నంతగా తన రాబడిని ఎక్కువ చేసుకోలేకపోయినది ఇక రాష్ట్రముల సంగతి చెప్పనవసరమే లేదు. రాజ్యాంగచట్టము ప్రకారము రాష్ట్రాలకు పన్నులు వేయగల అధికారములు తక్కువ; ఉన్న మార్గాలు కూడా అవసరమయినచో ఎక్కువ ఆదాయమును యివ్వగలిగినవి కావు. (*In-elastic Sources*). రాష్ట్రాల ఖర్చులు మితిమీరి పెరుగుచున్నవి. వీటిలో కొంతవరకు వృధా ఖర్చు కనబడుతున్నది. ఎక్కువ రాష్ట్రాలు పరోక్షపు పన్నులమీద, ముఖ్యముగా అమ్మకపుపన్నుమీద ఎక్కువగా ఆధారపడుతున్నాయి. అయినా వీటి ఆదాయములో చెప్పుకోతగ్గ మార్పు కనపడదు. ఉదాహరణగా 1950—51 రాష్ట్రాలకు పన్నులనుండి వచ్చు ఆదాయము 222 కోట్లనుండి 1952—53 లో 230 కోట్లుకు మాత్రమే పెరిగినది.

పోగా చిన్న సేవింగ్సు స్కీములగురించి ఆలోచిస్తే—దీనిలో కూడా కేంద్ర రాష్ట్రాల శ్రమ ఎక్కువగా ఫలించలేదు. ప్రణాళికప్రకారము సంపాదించవలసిన 270 కోట్ల రూపాయలలోనూ మొదటి మూడు సంవత్సరాలలోనూ సగము ధనము మాత్రము పొందగలిగినవి.

ఇంక ప్రభుత్వాలు ఋణములమీద ఆధారపడ వలసి వచ్చినది. ఋణములద్వారా తగినంత ధనము ప్రోగుచేయలేకపోయినచో "లోటు బడ్జెటు విధానము" (*Deficit Finance*) ను అవలంబించవలసి వస్తుంది. ఈ విధానమువలన ప్రమాదములు చాలా వున్నవి. తిరిగి సులువుగా ద్రవ్యోల్బణము వచ్చుటకు అవకాశములు ఎక్కువ. ధరల తగ్గుదల కాలములో తక్క "లోటుబడ్జెటు విధానము"ను ప్రభుత్వము అవలంబించరాదు. అందువలన ప్రభుత్వము ఋణములమీదనే ఆధారపడవలసి వచ్చినది. ఈఋణముల ఆవశ్యకత ప్రణాళిక నిర్వహణలో మరీ కనపడుతుంది. కేంద్రము రాష్ట్రము యింత పెద్ద మొత్తములను ప్రతిసంవత్సరము పెద్దపెద్ద స్కీములమీద వెచ్చించుచున్నప్పుడు ధరలు పెరుగక మానవు. ఎలననగా ప్రభుత్వము ఖర్చుపెట్టిన ధనమే ప్రజలకు ఆదాయములగును. తక్కువ ఆదాయములు గలిగిన దేశములలో ఆదాయమువలన కలిగిన కొనుగోలుశక్తి, ఆదాయములలో గలిగిన మొదటి అభివృద్ధి తప్పనిసరిగా జీవితావసర వస్తువులమీద వెచ్చింపబడగలవు. కాని ధనము వాణిజ్యరంగమునకు వచ్చిన తక్షణమే ఉత్పత్తి పెరుగదు. అందువలన ధరలు పెరుగుటకు ఎక్కువ అవకాశములున్నవి. కాని ప్రణాళిక విజయవంతమగుటకు ధరల పెరుగుదలను అరికట్టి తీరాలి. ప్రజలలోనుంచి తిరిగి కొంత ధనమును ప్రభుత్వము ఋణములద్వారా తీసికొనకపోయినఎడల, ఈ కొనుగోలుశక్తి ధరల పెరుగుదలకు దారితీస్తుంది. అదీకాక వచ్చేసంవత్సరములో ప్రభుత్వము తిరిగి గత సంవత్సరముకంటె ఎక్కువ ఖర్చు చేయవలెనంటే, ఆ యేడాది ప్రజల ఆదాయములలోనుంచి కొంత అయినా తిరిగి పన్నులద్వారా కాని ఋణములద్వారా కాని తీసికోగలిగివుండాలి. లేకపోయిన పెట్టుబడి లబ్ధి తగ్గిపోతుంది. ముఖ్యంగా ప్రభుత్వం పన్నులద్వారా ఎక్కువధనమును రాబట్ట గలిగిన పరిస్థితిలో లేనప్పుడు, ఋణముల ప్రాముఖ్యత హెచ్చుతుంది. ప్రభుత్వము ప్రజలవగ్గర నుంచి ఋణములు చేయగలిగిన శక్తిమీదనే ప్రణాళిక విజయము, ధరల పెరుగుదల సరికట్టి జీవితప్రమాణములను వృద్ధిచేయగల సామర్థ్యత ఆధారపడివుంటుంది. ఈ

దృష్టితోనే ప్రస్తుత జాతీయ ఋణమును పరిశీలించవలసియున్నది.

ఈ ఋణమునకు విరాళనియమితి లేదు. వడ్డీ రేటు $3\frac{1}{2}\%$; ఋణము మొత్తము పేర్కొనబడలేదు. ఈ ఋణమేగాక సామాన్య పెట్టుబడిదారుల సౌలభ్యము నకై 10 సం॥ల వాయిదా గల సర్టిఫికెట్లు మే 10 వ తేదీనుండి విక్రయమునకు కొనిరాబడినది. ఇవి కొన్ని 25 రూ. విలువైనవి మరికొన్ని 50 రూ. విలువ గలవి. ఒక్కొక్కరు 1,000 రూ లు, సమిష్టి కుటుంబములవారు రూ. 2000 వేలు పెట్టుబడి పెట్టవచ్చును. 25 రూపాయల సర్టిఫికెట్ దశాబ్దాంతమందు రూ 36-4-0, 50 రూ. సర్టిఫికెట్లు 72-8-0 విలువ కలిగివుంటాయి. యివేగాక జూలై 1 వ తేదీ నుండి 15 సంవత్సరముల "యాన్యుయిటీ సర్టిఫికెట్లు" (*Anuity certificates*) ప్రచారములోనికి తేబడినవి. ఇవి ముఖ్యముగా మధ్యతరగతి ప్రజలనుండి నిలువలను రాబట్టుటకు సృష్టింపబడినవి. వీటిలో 3500 రూపాయలు పెట్టుబడి పెట్టవచ్చును. దీని నుండి ఆదాయము నెల 1 కి రూ 25/ చొప్పున 15 సంవత్సరములు వచ్చును. నేటివరకు ఈ జాతీయ ఋణములద్వారా, దాదాపు నూరుకోట్ల రూపాయలు ప్రజలదగ్గరనుండి సేకరింపబడినవి.

ఈ జాతీయ ఋణమునకు, యింతకు పూర్వము ప్రభుత్వము చేసిన ఋణములకు గణనీయమైన తేడా కలదు. మునుపటి ఋణములలో చాలభాగము బ్యాంకులు పెద్దపెద్ద వర్తకులు, ధనికులు మాత్రమే పెట్టుబడి పెట్టుచుండిరి. దేశములో ఎక్కువభాగమైన సామాన్య ప్రజలనుండి ధనమును పన్నులరూపములో తప్ప రాబట్ట లేకపోయినది. దానివలన ప్రభుత్వము ఋణము చేయగలశక్తి పరిమితమైనది. తర్వాత ప్రయివేటు పెట్టుబడిదారులు, ప్రభుత్వము ధనసేకరణకు పోటీపడవలసివచ్చినది. ఎందుకనగా దేశములో "పెట్టుబడి మార్కెటు" శక్తి పరిమితమైనది. ఆ మార్కెటుమీదనే ప్రభుత్వమైనా, ప్రయివేటు పెట్టుబడిదారులైనా ధనసేకరణకు ఆధారపడవలసి వస్తున్నది. ఒకవిధముగా చూస్తే, ప్రవేటు పెట్టుబడులలో విస్తారంగా అభివృద్ధి కనబడకపోవుటకు యిది ప్రధాన కారణమని తోచును.

ప్రభుత్వపు పెట్టుబడులద్వారా దేశములో కలుగు కొనుగోలుశక్తిని ప్రభుత్వము పరిమితము చేయవలెనంటే అన్నివర్గాల ప్రజలనుంచి మిగులు ఆదాయమును కూడబెట్టవలెను. ఎక్కువగా ధరల మీద ఒత్తిడి తీసికొనివచ్చే కొనుగోలుశక్తి మధ్యతరగతి, స్వల్పఆదాయములవారి వద్దనుండే వస్తుంది. ధరల పెరుగుదలను అరికట్టుటకు ఈ రకమైన కొనుగోలు శక్తిని ప్రభుత్వము కంట్రోలు చేయవలెను. గతములో ప్రభుత్వముచేసిన ఋణములు ఈ ఫలితాన్ని ఎక్కువగా సాధించలేకపోయినవి. ప్రస్తుతపు జాతీయ ఋణము ఈ ఫలితాన్ని సాధిస్తుందని ఊహించబడుతున్నది. అందుచేతనే, ఈ జాతీయ ఋణఫలితాలు, పంచవర్ష ప్రణాళిక విజయము ఒకవిధముగా ఒకదానిమీద ఒకటి ఆధారపడియున్నవని చెప్పవచ్చును.

ఈ ప్రభుత్వ విధానములో ఒక ముఖ్యమైన లోపము కనపడుచున్నది. ముఖ్యముగా ప్రణాళికలోని అంచనాల ప్రకారము కేంద్ర రాష్ట్ర ప్రభుత్వములు ప్రజలదగ్గరనుంచి ఋణములను రాబట్టగలవు అనుట సందేహాకరమైనది. ఏ పరిస్థితులలోనైనను అధికముగా చేయగలిగిననూ, వ్యవసాయరంగములోను పారిశ్రామిక రంగములోను పెట్టుబడికొరత ఏర్పడక తీరదు. ఇప్పుడే పల్లెటూళ్ళలో ఈకొరత హెచ్చు వడ్డీరేట్ల ద్వారా వెల్లడియగుచున్నది. వడ్డీ వ్యాపారరంగము యొక్క శక్తి పరిమితమై యున్నంతకాలము, పారిశ్రామిక ఆర్థిక వ్యవస్థలలో ప్రభుత్వము ప్రయివేటు పెట్టుబడిదారులతో ధనానికి పోటిపడుట శ్రేయస్కరము కాదు.

అందువలన ప్రభుత్వము తప్పనిసరిగా విదేశముల ఆర్థికసహాయము మీద, "లోటుబడ్జెటు విధానము" మీద ఆధారపడవలసి వుంటుంది. లోటు బడ్జెటు విధానము ధరల పెరుగదలకు దారి తీయునని యిదివరకు చర్చించినాము. కాని ఈ దుష్ఫలితములు

అన్ని పరిస్థితులలోనూ కలుగవు. ముఖ్యముగా జాతీయఋణమును ప్రకటించిన తరువాత ధరలు తగ్గ దలను సూచిస్తున్నవి. ప్రభుత్వ ఆర్థిక సలహాదారుల లెక్కల ప్రకారంయిని 17, ఏప్రియలులో 404.2 నుంచి 24 ఏప్రియలులో 402.4 కు పడిపోయినది. తరువాత మరికొన్ని పాయింట్లు తగ్గినది. అంటే మొత్తంమీద దేశములో ధరలు తగ్గుముఖము పట్టినవి. ఒకవైపున ఉత్పత్తి పెరుగుతున్నది. ప్రభుత్వ పెట్టుబడి ఎక్కువవుతున్నది. జనాభా పెరుగుతోంది. కాని ధరలు పడుతున్నాయి. నిరుద్యోగులసంఖ్య పెరుగుతోంది. ప్రస్తుతము కనుపించే ఈవిచిత్రస్థితికి కారణము— ప్రజలలో విరివిగా కొనుగోలుశక్తి పెరుగకపోవుట అయివుండాలి. లేకపోయినయెడల, ధరలు పడవు. నిరుద్యోగులసంఖ్య తరగకపోయినా, పెరుగకుండానైనా వుండాలి. ముఖ్యముగా దేశములో ఆహార కొరత తగ్గినపుడు, కంట్రోల్లు సడలించబడినప్పుడు, ఆర్థికమాంద్యము రాకుండా ప్రయివేటు పెట్టుబడి దారులకు ప్రోత్సాహము కలిగించాలంటే కొనుగోలు శక్తిని పంచవర్షప్రణాళిక అమలుతోపాటు, పెంచుతూ రావాలి. లేకపోయినట్లయితే, ధరలపెరుగుదల వల్ల కలిగేహానికంటే, ధరల తరుగుదలవల్ల ఉత్పన్నమయ్యే విషమపరిస్థితులు రావచ్చును.

విస్తృతమగుచున్న ఆర్థికవ్యవస్థలో (*Expanding Economy or Economic Growth*) ప్రజలు, ఉత్పత్తులతో బాటు కొనుగోలు శక్తికూడా పెరుగకపోయిన, పై అభివృద్ధిలోని సత్ఫలితాలు ప్రజలకు అందుబాటులోకి రావు. ముఖ్యముగా నిరుద్యోగసమస్య దేశములో వున్నంతకాలము దేశములో ఆర్థికాభివృద్ధి వలన సామాన్యప్రజలు పొందేలాభాలు హాస్యాస్పదమైనవి. లోటుబడ్జెటు విధానము ప్రయివేటు పెట్టుబడి దారుల వస్తువులకు గిరాకీ పెంచి ఆయా పరిశ్రమలలో ఎక్కువ వుద్యోగాలను ప్రజలకు యివ్వగలుగుతుంది. 'లోటు బడ్జెటు'లలో యిది గమనార్హమైనది. కనుక జాతీయ ఋణమువలన నె ప్రణాళికలోని డబ్బు లోటును తీర్చాలని ప్రయత్నంచేయటం వ్యర్థం. "లోటుబడ్జెటు విధానమును" అనుసరించటానికి సమయం ఆసన్నమయింది. విదేశీయ సహాయం అను కొన్న మొత్తముల ద్వారా రాకపోయినా "లోటు బడ్జెటులద్వారా" ప్రణాళికలోని అంచనాలను సాధింపవచ్చును.

కథానిక

# * మనశ్శాంతి

శ్రీ వేమూరి వెంకటరామనాథం

కల్నల్ వస్తూనే తన బిగువైన కోటు గుండీలు ఊడ తీశాడు. ఒడలంతా చెమట క్రమ్ముకు పోయింది. ఆఫీసునుంచి అతను నడిచే రావాలి; అదంతా ఒక ఇసుక ఎడారి. దేవుడిచ్చిన కాళ్లుతప్ప ఏ యంత్ర వాహనమూ పనిచేయదా యిసుకపఱ్ఱమీద. ఆఫీసు సుమారు రెండుమైళ్ళదూరాన ఉంది.

ఉదయం పదిగంటలయింది. ఎండవేడిమి అప్పటికే దుర్భరంగా ఉంది. వేసవి వడగాడ్పు అప్పటికే విజృంభించింది. ఎడారి ఇసుకలు అగ్నిరవ్వల్లాగా ఎగిరి సుళ్లు తిరుగుతున్నాయి.

కల్నల్ ఆవేళప్పుడు రావటం అసాధారణ విషయం. ఇది ఆమెకు తెలుసు. అది ఆఫీసువేళ. ఆనాడు ఆదివారముకూడా కాదు. పోనీ, యుద్ధ కల్లోలాలు తగ్గిన శాంతి సమయమూ కాదు. పైగా శత్రువులు ఇదివఱకు ఎన్నడూలేని అవధిని మరఫిరంగులతో, టాంకుదళాలతో, విమాన బలాలతో పెద్ద ఎత్తున విజృంభణ సాగించారని వార్తలు తెలుస్తున్నాయి. దేశానికి అన్నిప్రక్కలా భయంకర రణకలాపమే. ఇరాకుప్రాంతంలో పరిస్థితి నిప్పురవ్వల చెమ్మచెక్కలాటలా ఉన్నదని ఆ ఉదయమే రేడియోలో వార్త.

కల్నల్ వైఖరి ఆమెకు అర్థంకాలేదు. ఆశ్చర్యంతో కనుబొమలు ప్రశ్నపరంపరగా అతనివైపు త్రిప్పింది. అతడు మాటా పలుకూ లేనట్లుగా కోటు విప్పటంలోనే నిమగ్నుడైఉన్నాడు. కోటు అందుకొని వంకెకు వేసింది. అతని చేతిలోవున్న కాగితాల సంచీ, చిన్నిచిన్ని ఆయుధాలసంచీ, తీసుకుని టేబిల్ మీద పెట్టింది. గబగబా లోపలికి పరుగెత్తి చల్లని పానీయం తెచ్చియిచ్చింది.

కల్నల్ ఆపాత్ర నందుకున్నాడు. ఒక్క నిమిషంలో ఖాళీ చేశాడు, ఎంత దప్పికగొన్నాడో. గ్లాసు బల్లమీదపెట్టి కుర్చీలోకి తూలి దీర్ఘంగా నిట్టూర్పుస్తూ, "డార్లింగ్" అన్నాడు.

ఆమె అతనిప్రక్కనే నిల్చొని "ఇప్పుడు వచ్చారేమి కల్నల్?" అన్నది.

నవ్వుతూ అన్నాడు: "నిన్ను చూసిపోదామని."

"అవును, ఆరు నెలలనుంచీ నన్ను రోజూ చూసి పోతున్నారు, కాని ఇలాటిఎండవేళ ఎన్నడూ వచ్చేవారుకాదే?"

"అయినా వచ్చాను—"

ఆ మాటలలోని అర్థం ఆమెకు తెలియలేదు. "మఱి, ఆఫీసులేదా యీ వేళ?"

"సెలవు పెట్టాను"

"నాకోసమా?"

కల్నల్ ఆమె చేయి పట్టుకుని, "అవును నీ కోసమే. ఇదే ఆఖరు దినం మన చెలిమికి. చివరిదినము దినమంతా నీతో గడపటంకన్న ఆఫీసుపని ముఖ్యం కాదనుకున్నాను. ఆఫీసు పని రేపూ ఉంది, ఎప్పుడూ ఉంటుంది, బహుశా ఎక్కువవుతుందేమో రేపటినుంచి. కాని నీవు నాకు నేడే— రేపు... రేపు..." అంటూ పెదవులెండినట్టు మాటాడలేకపోయినాడు.

ఆమె గ్లాసులో మళ్లా పానీయం పోసింది. వయ్యారంగా పాత్ర నింపే ఆమె వ్రేళ్లు కొద్దిగా వణకినాయి. కల్నల్ అది కనిపెడుతూనే ఉన్నాడు.

పానీయం పుచ్చుకుంటూ, "డార్లింగ్, ఇది ఈవేళ ఎన్నడూ లేనంత మధురంగా ఉంది. ఈ పానీయంలో ఏం కలిపావో కాని" అన్నాడు.

"ఏమీ లేదు. ఇందాక ఇచ్చిందే."

"అవును, కాని యిందులో నీ హృదయం మఱింతగా కరిగిఉంది. నాకోసం నీ ఆరాటం

# ఇంక మనోహరమైనటువంటియునైన చర్మము




రెక్సోనాతో ఈ అద్భుతమైన మార్పును మీరు తెచ్చుకొంటారు



రెక్సోనాయొక్క కేడిల్‌తోగూడుకొన్న నురగను మీ చర్మముమీద మెల్లగా రుద్ది తరువాత కడిగివేయండి. మీ చర్మము దినదినమునకు ఇంక మృదువుగాను. ఇంక మెత్తగాను అగుటను మీరు చూస్తారు. మరియు మీరు క్రొత్త ఆకర్షతను తెచ్చుకొంటారు.



# రెక్సోనా
## ఇది ఒకటే కేడిల్*తో గూడిన సబ్బు




* చర్మమును పోషించేటటువంటియు, చర్మమును మెత్తగాచేయునటువంటియునైన నూనెల ఒక ప్రత్యేక మిశ్రమమునకు రిజిస్టర్డ్ పేరు.

RP. 118-50 TL

రెక్సోనా ప్రొప్రయిటరీ లిమిటెడ్‌వారి తరపున ఇండియాలో తయారుచేయబడినది.

ఇంగులో మిళితమయిఉంది. అందుకనే యింత తీపిగా ఉంది."

ఇదంతా ఆమెకు అయోమయంగావుంది. అతని భుజంమీద చేయివేసి "మీ మాటలు నాకు మొదలూ తుదా తెలియటంలేదు," అన్నది.

"డార్లింగ్, సైనికుడి మాటలు అలాగే ఉంటాయి కటువుగా, త్రిప్పకోరానివిగా. నీకు అర్థం కాకపోవు, కాని నీకు ప్రియంగా ఉండవు. బహుశా రేపే నేను ప్రయాణం—"

"ఎక్కడకు?" అంటూ ఆమె అతనికింకా దగ్గరగా జరిగింది. వేటగాడి గురిలోని కోకిలమ్మకూతలా ఉన్నదా గొంతు.

కల్నల్ నిశ్చలంగా పలికాడు, "ఇరాక్."

"ఇరాక్? మరి నేనో!"

"నీ విచ్చటనే ఉండు డార్లింగ్, సుఖంగా. ఇక్కడ నుండు బెంపెలు మాత్రమే అక్కడ నిప్పుగుండ్లు కురుస్తూఉంటాయి అనుక్షణము......వద్దు, బాధతో పెదవులు కదల్పకు. నీ బాధ నాకు తెలుసు. కాని ఏం చేయగలను? ఇరాక్ ప్రాంతంలో శత్రుభయం దారుణంగా ఉంది. అనుభవంగల సైనికాధిపతులందర్నీ అక్కడకు పంపుతున్నారు. నన్నూ... నేనే కోరుకొన్నాను కూడ..."

"ఆఁ......నన్ను వదలిపోవాలని కోరుకొన్నారా?"

"కాదు, నీకోసం ఇక్కడే ఉండమంటావు; కాని నిన్ను మించి దేశమున్నది; ప్రభుత్వమున్నది. దేశక్షేమంకోసం, ప్రజాక్షేమంకోసం ఇరాకు పో నిశ్చయించుకొన్నాను."

ఆమె తనూలత కంపించిపోయింది. ఇన్నినాళ్ల వలపుతీపులు ఇగిరిపోయినాయి. ఇన్నాళ్ళ ఆనందం ఒక్క త్రుటిలో చితికిపోయింది. తిరిగి తనకు వెనుకటే ఏకాంత ప్రవాస జీవితమే ప్రాప్తి!

"మరి నన్ను ఎవరి రక్షణకు వదలిపోతారు, ఈ ఎడారి ఇసుకలలో?"

ఆ ప్రశ్నతో కల్నల్ చలించలేదు. ప్రణయానురాగంతో కరగిపోయే మెత్తని హృదయం కాదతనిది. సైనికానుభూతితో ఘనీభవించి పోయిన నిబ్బరపు రాతిగుండె. ఆలోచనగా అన్నాడు, "డార్లింగ్, నేను రాకముందు ఎవరి రక్షణలో వదలబడి ఉన్నావో, ఆ రక్షణక్రిందనే వదలిపోతాను."

వెన్నెలకాచి వెలిసిన నీలి ఆకాశంలా అయింది ఆమె ముఖం. కల్నల్ అన్నాడు, "క్షమించు డార్లింగ్, ఒక ప్రశ్న అడుగుతాను. నీయిల్లు ఊరికింత దూరంగా ఈ నిర్జనప్రదేశంలో ఉన్నదేం? నీ వొక్కతెవు ఈ యింట్లో ఎంతకాలంనుంచి నివసిస్తున్నావు? ఒంటరిగా ఎలా గడుపుతున్నావు?"

"మంచి ప్రశ్నలు! అవును, తుదినాడు ఏ ప్రశ్నలు వేస్తేనేం, నన్నెలా బాధిస్తేనేం?" అంటూ కంట నీరు పెట్టుకొన్నది.

కల్నల్ కొంచెం చలించాడు. తన రుమాలుతో ఆమె చెక్కిళ్ళు తుడిచాడు. ఆమెమాత్రం కన్నీటి బిందువులు వాకలయేలా వెక్కి వెక్కి యేడుస్తూ అన్నది, "మీకు కోపం రావటమెందుకు? ఈ దూరస్థలాన మీకోసమే ఉన్నాను. మీవంటి అధికారులు అనుభవించి వదలిపోవటానికే ఉన్నాను. మిమ్ము ఎంతగా నమ్ముకొన్నాను! నా ఆశలన్నీ పటాపంచలుచేసి ఇరాకు పోతున్నారు...ఇరాకట ఇరాకు! ఈ రాతిగుండెల కా యిరాకే—" అంటూ అని అనరాని మాటలేవో ప్రలాపించ సాగింది.

కల్నల్‌కు చిరునవ్వు వచ్చింది. ఆమెకు రోషం ఇనుమడించింది. "అలాగే నవ్వండి, ఒక అబలను ఒంటరిగా వదలిపోయే బలవంతులు మీరు. మీ రాచబాట మీది, నా బ్రతుకు నాది—"

కల్నల్ ఆమె వ్రేళ్లతో ఆడుతూ అన్నాడు, "నీ కోర్కె నాతోకూడా ఇరాకు రావాలని కాదూ?"

మెత్తని ఆమె వ్రేళ్ళు వణకిపోయినాయి, కల్నల్ మొరటువ్రేళ్ళమధ్య. ఆమె ఒడలంతా పులకరించింది చక్కలిగింతలు పెట్టినట్లుగా. ఆమె కన్నులు విశాలంగా వికసించినాయి, ఆశ ఫలించినట్లుగా. మెల్లిగా అతని ప్రక్కకు జరిగి, "పోనీ, మీరే ఇక్కడ ఉండరాదూ?" అన్నది.

కల్నల్ లేస్తూ అన్నాడు, "ఊహుఁ...అది అసంభవం. నా ప్రభుత్వశాసనాన్ని నేను ఉల్లంఘించలేను. కాదు, అది నేను నాపై పెట్టుకున్న భారమే!"

"మరి యిక్కడమాత్రం సైన్యాధ్యక్షుడొకడుండవద్దా? మీరే—"

"నా స్నేహం, చనువూ కారణంగా ప్రశ్నలు వేసే తెలివితేటలబ్బినట్లున్నాయి నీకు." కల్నల్ నవ్వుతూ అన్నాడు, "కాని, సైనికాధికారిముందు నిల్చుని ప్రశ్నలు వేయటం మంచిదిగాదు."

ఆమె నవ్వుతూ అన్నది, "నేను మీ సైనికుడ నైతే యీ తెలివీ, యీ ధైర్యం ఉండేవి కాదు. నేను కేవలం ఒక ఆడుదాన్ని, యౌవనవతిని."

"అందుకే జవాబు ఇస్తున్నాను. నా స్థానే మఱొకరిని నియోగిస్తున్నాను."

"మఱొకరినా? నాకు నవ్వు వస్తోంది. మీ స్థానం మఱొకరు భర్తీ చేయగలరా?

"నేనంత అసామాన్యుణ్నా డార్లింగ్? అయితే అందుకే నాఅంతట నేను ఇరాక్ వెళ్లేది. కాని, వెర్రిదానా నీకు తెలియదుగాని నాలాగా తయారవుతున్న యువకులింకా కొందరున్నారు. ఇక్కడికి రాబోయే మేజర్ మహామేధావి. పదినెలలుగా సైనిక కార్యకలాపంలో మునిగి ఉన్నాడు. ఉక్కు మనిషి, వజ్రహృదయం, నమ్మినబంటు, మెప్పులందిన సైనికుడు"—

"ఎవరా అదృష్ట పురుషుడు?"

"మేజరు క—"

"ఆఁ...?"

"మేజరు క—"

ఆమె తటాలున బంతిలా తూలిపడ్డది మంచం మీదకు. "మేజరు క—" అనుకుంటూ ఆలోచనగా ముఖం వంచుకుంది. కల్నల్ అది కనిపెట్టలేదు. మేజర్ పై గల అభిమానం, తన విశ్వాసం ఉద్ఘాటిస్తూ ఉపన్యసిస్తున్నాడు. వెనకటియుద్ధంలో మేజరు ఒకనాడు తన ప్రాణం ఎలా కాపాడింది వర్ణించాడు. "నాటినుంచీ అతనిని నా దళాలలోనే వేసుకొంటున్నాను. అతడే నా దక్షిణభుజం నా బలగమంతటిలోను."

ఆమె మెల్లగా తెప్పరిల్లుతున్నది, ప్రక్కకు త్రిప్పుకొన్న ముఖం మళ్ళీ అతనివంకకు త్రిప్పింది. కల్నల్ ఉత్సాహంగా తన కాగితాలకట్టలలోఉన్న మేజర్ బొమ్మ ఒకటి పైకి తీశాడు; "చూడు డార్లింగ్, ఎలాటి వీరమూర్తియో!" ఆమె అతని వంక కన్నులు మూసుకుచూసింది, ఆమె కనురెప్పల లోనూ అదే చిత్రం కనపడినట్లు తోచింది. "ఇది నీవద్ద ఉంచుకో డార్లింగ్ —"

"ఈ ఆడుదాని కాపురుషుడి చిత్రం మీ చేతులతో ఎందుకిస్తారు?" అన్నది. ఆ మాటలు ఏర్చి పేర్చినట్లు విచిత్రంగా ధ్వనించాయి కల్నల్ చెవులలో.

"డార్లింగ్, నీవు స్త్రీవి, ఇతడు పురుషుడు, అన్నదృష్టి ఒక్కక్షణం మఱచిపోలేవా? ఇతడు ప్రఖ్యాతవీరుడు. నా మిత్రుడు. ఇతడు రక్షించేది నీదేశాన్ని, నిన్ను—"

చిత్రం తీసికొన్నది. మంచంపైన తలగడదిండు క్రింద దాచింది. చిన్నపోయిన ముఖంలో తిరిగి కరుకుదనం ప్రవేశించింది. ఆరిపోయిన కన్నీటి మచ్చలు చెంగుతో తుడుచుకుంటూ, "అయితే యీ మేజరు ఎప్పుడు వస్తాడు?" అన్నది.

"రేపే తన క్రొత్త పదవిని స్వీకరించాలి. కాని పిచ్చివాడు పదిహేను రోజులు సెలవు కోరాడు—"

"ఎందు కిచ్చారు మీరు?"

"ఇచ్చానన్న సంగతి చెప్పకుండానే ఎలా గ్రహించావో చిత్రంగా వుంది. నిజం డార్లింగ్, సెలవు ఇచ్చాను, దేశం ఇంత ఉపద్రవస్థితిలో ఉన్నా. అతడు విధి విరామం లేకుండా నెలలతరబడి యుద్ధరంగంమీద నాలుగు మెతుకులు కతుకుతూ, యుద్ధరంగంమీదనే అంపశయ్యలమీద పవ్వళిస్తూ గడుపుతున్నాడు. అతని మనస్సుకు కొంత శాంతి అవసరమని నిశ్చయించుకొన్నాడు. ఇంటికి పోయి, తన ప్రేయసితో పది రోజులు గడిపివస్తానని వేడుకొన్నాడు—"

"నిజమా? అతని ప్రేయసితో ప్రశాంతంగా-"

"అవును. ఏమలా ఆగిపోయినావు, మాటలారిపోయినట్లు. పాపం అతని భార్య బంగారు బొమ్మట, ముద్దులు కురిపిస్తుందట...ఛ...అతని భార్యనుగురించి నాకెందుకు...కాని డార్లింగ్, ఆమె ఎంత గాఢంగా ఆరాధిస్తుందో యీ జాతీయనాయకుణ్ణి, ఎంత గాఢంగా అనురాగం వర్షిస్తుందో తన ప్రియుడు ఇన్నాళ్ళకు తిరిగి వచ్చాడని—"

అతని ధోరణికి అడ్డుతగిలి అన్నది. "సరే, అయితే మీరింకా పదిహేనురోజు లుంటా రన్న మాట యీ ప్రాంతాలలో—"

"ఎందుకలా కలత చెందినట్లు అడుగుతావు? ఇందాక చెప్పానుగా రేపే నా ప్రయాణమని—"

గుబురు మబ్బులలో మెఱుపు మెఱసినట్లుగా ఆమె ముఖంలో ఏదో ఆశ లాస్యం చేసింది. "రేపే గదా ప్రయాణం...సరే యీ రాత్రే నేనూ సిద్ధమవుతాను...రా[illegible] ఒకసారి రండి—"

కల్నల్ మారుమాటాడలేదు. గ్లాసులో మిగిలిన పానీయం గుటకలు వేస్తూ త్రావుతున్నాడు.

ఆమె మాత్రం దీర్ఘంగా ఆలోచిస్తున్నట్లు నిల్చుంది కిటికీప్రక్కగా. దూర దూరాలలోకి తొంగిచూసే ఆమె కనుచూపులు హఠాత్తుగా చెదరినాయి. కనురెప్పలు గబగబా అప్రయత్నంగా ఆర్పింది. కల్నల్ దగ్గరకు వచ్చి, అతని కోటు అతనికి అందిస్తూ, "కల్నల్, మీ ఆఫీసువేళ యిప్పటికే మించిపోయింది—" అన్నది.

"డార్లింగ్, మరిచిపోయినావా? ఈరోజు నేను సెలవు తీసికొన్నాను."

"ఆఁ...అవును...నాకోసమన్నారు కాదూ? అవును." అంటూ చతికిలపడ్డది మంచంమీద—

అయిదు నిమిషాలు ఇద్దరూ నిశ్శబ్దంగా కూర్చొన్నారు. కల్నల్ సిగరెట్టు ముట్టించి రకరకాలుగా పొగ వదులుతున్నాడు. ఆ పొగలు రచించే వింత చిత్రాలవంక వెర్రిగా చూస్తూ నిట్టూర్పుతున్నది ఆమె.

ఇంతలో బైట ఏదో చప్పుడయింది. ఎవరో ఆజానుబాహువు కంటపడ్డాడు. "ఎవరు" అంటూ కల్నల్ గడపలు దిగబోతున్నాడు. ఆమె మాత్ర తలవంచుకొని లోనికిపోయింది, "కాఫీ చేస్తా"నని.

కల్నల్ ఆశ్చర్యంతో తెల్లబోయాడు. "ఓహో! నీవా మేజర్" అని కౌగిలించుకొన్నాడు. మేజర్ అంతకన్న ఆశ్చర్యంతో తెల్లబోయాడు. "ఓహో! మీరా కల్నల్, ఇక్కడ" అంటూ కౌగిలి గాఢంగా బిగించుకొన్నారు.

కల్నల్ ఇంటిలోనికి దారితీస్తూ "ఇప్పుడే నీ సంగతి అనుకుంటున్నాము" అన్నాడు.

"ఆఁ... నేను నేడే వస్తానని చెప్పారా? ఉత్తరం వ్రాసే వ్యవధికూడా—"

"ఎవరికి...ఆఁ...మా మేజర్ ఇక ఈ సైన్యాలపై అధికారం స్వీకరిస్తాడని, నేను ఇరాకు వెళ్ళిపోతున్నానని, మా మేజరు వీరుడు, శూరుడు, అని చెపుతున్నాను."

"కల్నల్, నేను అదృష్టవంతుడను" అంటూ కుర్చీమీద కూర్చున్నాడు మేజర్.

"ఏమి?"

"అవును. కల్నల్ అంతటివాడే దయతో నన్ను చూసిపోవచ్చారు. నేనెంతటివాడిని, సామాన్యణ్ణి మేజరును—"

కల్నల్‌కు ఏమీ అర్థంకాలేదు. అతడిని చూసిపోవటానికి కాదు తాను వచ్చింది. అతడిని చూడటానికి అక్కడికే ఎందుకు రావాలో అతనికి తెలియలేదు. "మేజర్, చాలాదూరం నడచి వచ్చినట్లున్నావు. బాగా అలసిపోయినావు. కొంత విశ్రమించు. కాఫీ త్రాగుదుగాని" అంటూ ఉండగానే ఆమె కాఫీ కప్పులు రెండు తెచ్చింది. "డార్లింగ్" అంటూ కల్నల్ లేచి అందుకోనేలోగా మేజర్ అవి పట్టుకొని, ఒకటి వానికిస్తూ, చిరునవ్వుతో, "ఆమె నా డార్లింగ్" అన్నాడు.

కల్నల్ కళ్లు తిరిగినాయి. అతని చేతులు వణికినాయి. కాఫీ కప్పు హఠాత్తుగా క్రింది జారి పగిలింది. కల్నల్ వ్రేళ్లు అంత బలహీనంగా ఎన్నడూ లేవు. నెత్తురుముద్దగా పోరాడే అతని ముఖబింబంలో నెత్తురుబొట్టు లేదా క్షణాన.

మేజర్ "క్షమించండి" అంటూ రెండవ కప్పు కల్నల్ కోసం టేబిల్ మీద పెట్టాడు. చిరపరిచితుడులా లోనికి పోయి తాను మరొక కప్పు తెచ్చుకొన్నాడు. కల్నల్‌కు కాఫీ త్రాగ బుద్ధి వేయలేదు. అతని మనసు మనసంతా ఒకే ఆలోచనమీద కేంద్రీకరింపబడిఉంది. ఇన్నాళ్ళు తాను ప్రేమిస్తున్నది తన మేజర్ భార్యనా!

మేజర్ తన కథ సాగించాడు. "పాపం నెలల తరబడి ఒంటరిగా ఈ ఎడారి యిసుకలలో ఈ నిర్జన ప్రదేశంలో గడుపుతున్నది. నాకోసం ఎంతగా తపించేదో, ఈ ఏకాకి జీవితాన్ని ఎంత ఓర్పుతో భరించేదో, మీకు తెలియదు కల్నల్, మీరు బ్రహ్మచారులనుకుంటాను, సాంసారిక జీవితంలో ఆనందమున్నది. చెదరిపోయిన మనస్సుకు శాంతిని చేకూర్చే ప్రతిభ ఉన్నది. ఇన్నాళ్లుగా నేను యుద్ధం చేస్తున్నాను. నా హృదయం బండబారిపోతున్నది. నా శరీరం ఉక్కులా మారిపోతోంది. నా హృదయానికి ప్రశాంతి, నా దేహంలో మానవత్వం తిరిగి పులకింప చేసికోవచ్చాను...కాఫీ త్రాగండి, చల్లారిపోతుంది. కల్నల్, ఎప్పుడూ ఒకే కల్లోలమయితే నేను తట్టుకోలేను. ఈ పది నెలలు మనుష్యులను చంపటం, చంపినవారిని లాగివేయటం......ఇదేగదా నా దినచర్య. ఈ పదునైదు దినాలైనా హృదయాన్ని పగిల్చే గాథలు దృశ్యాలు లేకుండా శాంతిగా నా ప్రేయసితో గడిపివస్తాను......ఏం కల్నల్, కాఫీ ముట్టుకోనే లేదు. పంచదార ఎక్కువ అయిందా? మా కాఫీ మీ కలవాటు లేదుగా, క్షమించాలి."

మేజర్ పలికే ప్రతి పలుకు తట్టుకోలేని ఫిరంగి గుండులాగా తగులుతున్నది కల్నల్ హృదయానికి. ఇన్నాళ్ళు కల్నల్ ఆమెను తన ప్రేయసిగా నమ్మాడు. ఆమె కన్య అన్న అసత్యాన్ని విశ్వసించాడు. ఆమె ప్రణయ సముద్రంలో నౌకలా తేలిపోతున్నాడు. ఈనాటికి మేజర్ అవతరించాడు తన పాలిటి యమా—బోలుబాగా. తాను వంచింపబడినందుకు ఆమెపై కోపంతో వణకిపోయాడు. కాని మేజరు ముందు తనకు అవమానం అవుతుందన్న భయంతో చిన్నబోయాడు. రెండు కనులూ నిండుగా తెఱచి మేజరువంక చూడలేకపోయాడు. తనకు దక్షిణ హస్తమైన నమ్మినబంటు ఆ మేజరు; తన స్థానే నిలిచే యోగ్యతగల ఏకైక సైన్యాధ్యక్షుడు ఆ మేజరు; ఆరు నెలలుగా తాను ప్రేమించిన ఆ కాముకివినా తన వాత్సల్యానికి ఆ మేజరువలె పాత్రులయిన వారు లేరీ విశాల ప్రపంచంలో. కాని ఆ మేజరు భార్యమీదనే కల్నల్ వలపు లొలికించాడు. ఆ మేజర్ శయ్యనే తాను హరించాడు. ఇన్నాళ్ళ ప్రణయానుభూతీ, ఆనందలహరి ఆక్షణాన దారుణమైన కూపంలా కనుపట్టింది కల్నల్ మనోనేత్రాల ముందు. అతడేమైనా అనుకుంటాడన్న స్నేహధర్మం చేత కాఫీ రుచి చూశాడు.

"కల్నల్, మీరెంత మంచివారో నేను చెప్పలేను."

"నామంచితనం! ఏడిచిందిలే మేజర్."

"కాదు. ఇవి సెలవుదినాలు. ఈ నాలుగు రోజులూ నా మనసులోని కృతజ్ఞతను స్వేచ్ఛగా బైటకు చెప్పుకోవచ్చుగా. మొట్టమొదట ఆఫీసులో పుకారు పుట్టింది, మీరు నా సెలవు చీటీని త్రిప్పి కొట్టారని—"

అప్రయత్నంగా, మెల్లగా "త్రిప్పి కొట్టినా బాగుండేది" అని గొణిగాడు కల్నల్.

"క్షమించండి, నవ్వులాట కంటున్నారు కల్నల్. యుద్ధ కార్యకలాపం నానాటికి హెచ్చుతున్నదన్న మిషమీద నన్ను వదలలేమన్నారని నా స్నేహితులందరు నన్ను భయపెట్టారు."

"మేజర్, వాళ్ళు చెప్పింది నిజమే. దేశక్షేమం కోసం నేను సెలవీయదలచుకోని మాట వాస్తవమే. కాని—"

"మరి తుదకు అనుగ్రహించారు! అదే తమ మంచితనమంటాను! అంటూ నవ్వాడు మేజర్. సిగరెట్టు ఒకటి కల్నల్‌కిచ్చి తానొకటి వెలిగించాడు.

"కాదు, అది నా మంచితనం కాదు మేజర్, కేవలం దేశక్షేమంకోసమే నీకు సెలవు అనుమతింప నిశ్చయించాను. నీకు మనశ్శాంతి కావాలని నాకు తెలుసు. కల్లోలం లేని గృహంలో పువ్వులపాన్పుపై, పూజించే ప్రేయసితో, పదిరోజులు నీవు గడిపివస్తే, నీ ఉత్సాహబలాలు పదిరెట్లు అవుతాయని నీ చెలిమిలోని దగ్గఱితనం చేత నేను గ్రహించాను. వెంటనే నీ సెలవు మహజరుపై సంతకం చేసి పంపాను."

"ఎలాగైతే నేమి — మీకు నేను కృతజ్ఞుణ్ణి. ఎందరు లేరు నాతోడివారు, సెలవు దొరకక చిన్నబుచ్చుకొన్నవారు!...ఏం కల్నల్, దీర్ఘంగా ఆలోచిస్తున్నారు! ఒక కప్పు వేడి కాఫీ తెప్పించనా?... డార్లింగ్!"

కల్నల్ నిశ్చితంగా "వద్దు" అన్నాడు. మేజర్ పిలిచిన "డార్లింగ్" కల్నల్ ప్రాణానికి నిశితమైన శూలంలా గుచ్చుకున్నది. "వద్దు మేజర్, ఆమెకు చెప్పు, కప్పుతీసుకు ఇక్కడికి రావద్ద"ని.

రెండుమూడు నిమిషాలు నిశ్శబ్దం ప్రాకులాడింది ఆ సైనికాధ్యక్షులమధ్య. ఆ క్షణిక నిశ్శబ్దావస్థలో కల్నల్ మనసులో ఆలోచనాతరంగాలు రేగుతూ, మేజర్ జీవితాన్ని ఉయ్యాల లూగింపచేస్తున్నాయి.

మేజర్ పొగవదులుతూ, ఆకాశంవైపు చూస్తూ, "కల్నల్, ఆకాశం చూడండి, రక్తగర్భంలా మండిపోతోంది. పది దినాలనాడు మనం—రంగంలో శత్రుదళాన్ని చావమోదిన అద్భుత దృశ్యం జ్ఞాపకం వస్తోంది...అసలు ఈ వేసవి ఆకాశం తీరే యింత... ఆ సూర్యుడుమాత్రం—" అంటూ ఏదో అనవసర ధోరణి మొదలు పెట్టాడు.

కాని కల్నల్ కా సంభాషణలో కుతూహలం లేదు సరిగదా, అతని మనస్సే ఆ మండిపోతున్న ఆకాశంలా ఉంది. ఈ ఆరు నెలల జ్ఞాపకాలూ భగభగా జ్వాలలు రేగిపోతున్నాయి. మేజర్ చివరకు అన్నాడు. "కల్నల్...ఈ మాటలలో మీకు ఆసక్తి లేదనుకుంటాను—"

"అనంతా వ్యర్థప్రసంగం మేజర్. ఒక్క దినం సెలవుమీద ఉన్న నావంటివాడికి వ్యవధ లేదు అలాంటి సంభాషణలకు," అన్నాడు కల్నల్— అకస్మాత్తుగా కల్నల్ కంఠం కఠోరమయిపోయింది. అలా అతడు ఆఫీసులోనే మాటాడుతాడు. ఆ గొంతు దాల్చడంతో అతనిలో ఏదో మథన జరుగుతున్నట్లు,

అతడేదో నిశ్చయానికి వస్తున్నట్లు—అది ఇక చండశాసనమని మేజర్‌కు బాగా అనుభవం.

"అవును," మేజర్ అన్నాడు. "పదునైదు దినాల విశ్రాంతి గైకొన్న నాబోటివానికి కొంచెం వ్యవధి ఉంటుంది, కాని—"

కల్నల్ సిగరెట్టు పీల్చుతూ, "నీకూ లేదు" అన్నాడు.

మేజర్ కలవరపడ్డాడు! తటాలున లేచి, "కల్నల్, ఇది నా సెలవులో మొదటి దినం. ఇంకా—"

కల్నల్ కూడ లేచాడు, "ఇదే తుది దినం కూడ. తిరిగి ఆర్డరు వేస్తున్నాను, నీ సెలవు ఉపసంహరింపబడినదని."

మేజర్ గుండెలు జారినాయి. "ఆఁ...ఉపసంహరించారా? మఱి నాకు విశ్రాంతి అవసరమని మీరే ఒప్పుకొన్నారే, నాకు మనశ్శాంతి నా గృహంలో నా ప్రేయసివద్ద కలుగుతుందని మీరే అంగీకరించారే—"

"మేజర్ !"—కల్నల్ అంత కఠినంగా యుద్ధరంగంలో మాత్రమే ఉచ్చరిస్తాడు, లేదా ఎదురు తిరిగిన ఉద్యోగిముందు అంటాడు. "మేజర్, అన్నీ నాకు తెలుసు. నీకు సెలవు అనుమతించటం అనుచితమని ఇప్పుడు గ్రహిస్తున్నాను. దేశక్షేమం కోసం నీవు వెంటనే కత్తిబట్టి రంగంమీదకు దూకాలని శాసిస్తున్నాను."

మేజర్ కాళ్లు బలహీనమయినాయి, నిల్చొనలేక కూలబడ్డాడు, మంచంమీద—"కల్నల్, పోనీ ఒక్కవారం పాటు...నా భార్యతో—"

కల్నల్ మళ్లా హుంకరించాడు, "మేజర్, నీ భార్యమాట నాముందెన్నడు ఎత్తకు, నేను రేపే ఇరాక్ ప్రయాణం. నిన్నూ నాతోనే తీసుకుపోతాను."

"ఇరాక్?"

"అవును." కల్నల్ గొంతు తగ్గించాడు; మృదువుగా అన్నాడు, అతని భుజాలు తట్టుతూ, "మేజర్, నీవు నా దక్షిణభుజానివి, నేనే నీకు శాంతి, నీవే నాకు శాంతి."

మేజర్ సెల్యూటు చేశాడు. కల్నల్ కోటు తొడుక్కొంటున్నాడు. మేజర్ భార్య కాఫీ గ్లాసు తెచ్చి కల్నల్ కీయబోయింది. "వద్దు" అన్నాడు నిశితంగా. "పోనీ, ఒక్క ప్రార్థన మన్నిస్తారా?" అన్నది.

"ఏమిటది" అని హుంకరించాడు కల్నల్.

"వారికి ఈ ఒక్క రాత్రి గడువీయండి. రేపు మళ్లా ఉద్యోగము—"

కల్నల్ ఒక్క నిమిషంసేపు ఆలోచించాడు. కనుబొమలు ముడులు పడిపోయినాయి. మెల్లగా నిట్టూర్చుతూ, "సరే" నన్నాడు. ఆనందంతో మేజర్ మంచంపై ఒరిగాడు. కల్నల్ సంతృప్తంగా బైటకు సాగాడు. మేజర్ భార్య వానివెంట నడిచింది.

తలవంచుకొని అడిగింది, "రేపేనా మీ ప్రయాణం?"

"అవును," తల త్రిప్పకే సమాధానమిచ్చాడు.

"ఒక్కసారి రాత్రి దయచేయండి నేనూ—" తటాలున కల్నల్ ఆమెవంక పరిశీలనగా చూశాడు. ఒకనిమిషమాగి, కల్నల్ దీనంగా ఆమెను ప్రతిమాలాడు, "మేజర్‌తోమాత్రం ఈ విషయం పొక్కనీయకు. నీకు పుణ్యముంటుంది నాకు అవమానం—"

"మేజర్ కిది తెలియనే తెలియదులెండి" అంటూ ఆమె సంతోషంతో తల త్రిప్పింది. అతను వెళ్ళిపోయినాడు.

అర్ధరాత్రి పండ్రెండుగంటలయింది. మామూలుగా కల్నల్ నిదురించే సమయమది. కాని ఆనాడు అతని కనులు మూతపడనేలేదు, అతని ఒడలంతా ఏదో తాపం పొందినట్లుంది.

మంచందిగి బైటి చావడిలో పచార్లు చేయసాగాడు. రెండుమూడు నిమిషాలు అటు ఇటు తిరిగాడో లేదో, తనముందు ఒకస్త్రీమూర్తి ప్రత్యక్షమయింది. తటాలున వెనుకంజవేశాడు. ఆమెవంక చూస్తూ, "డార్లింగ్" అనబోయి పెదవి కొరుక్కొన్నాడు.

"కాదు, ఆమె దాసిని"

"ఎందుకిటు వచ్చావు? ఆమె పంపిందా?"

"లేదు."

"మఱి—"

"పని ఉన్నది," అంటూ తల వంచింది.

"ఈ అర్ధరాత్రివేళ నాతో నీకేం పని?" అంటూ కల్నల్ తిరిగి పచార్లు చేయసాగాడు.

దాసి, వెంట నడుస్తూ అన్నది, "నాకు కాదు, మీకే చేతినిండా పని."

కల్నల్ ఏం కాలేదన్నట్లుగా మెవంక తేరి పారచూశాడు. ఆమె అన్నది, "రండి, నావెంట రండి."

"ఎందుకు?" అంటూ కల్నల్ వడి అరుగు మీద కూర్చున్నాడు.

"ఆలసించే వ్యవధి లేదు. ఎదురు ప్రశ్నలు వేయటం సైనికులకు చెల్లదు" అంటూ ధైర్యంగా నవ్వింది.

క్రిందివారి మాటలు కొన్ని వేళలలో క్లిష్టంగా ఉన్నా, అందులో సత్యం ఉండకపోదని కల్నల్‌కు తెలుసు. అతడు అధికారం చెలాయించే ఇనుప యంత్రమే కాదు. ఎదుటివారిని అర్థంచేసికొనే సహృదయుడు కూడ.

దాసీది మళ్లా మొదలు పెట్టింది, "ఇంకా లేవరేమి? ఇదే యుద్ధరంగంలో మీ జెనరల్ గారి ముందు అనుకోండి. ఇలా ఉదాసీనంగా—"

కల్నల్ నవ్వుతూ లేచి, "ఈ క్షణాన నీవు నా జెనరల్‌వు. అంతటి క్లిష్టస్థితి యేదో సంభవించిందని నమ్ముతున్నాను. పద" అంటూ క్షణంలో తయారయినాడు తన బాకు మొదలయినవి అలంకరించుకొని.

దాసీది దారితీస్తూ, "కల్నల్, ఆసువారి పిలుపున వస్తూ ఈ బాకుకూ దేనికండీ మోసుకు రావటం?" అన్నది.

"మంచి ప్రశ్న వేశారు జనరల్" అన్నాడు పెద్దపెట్టున నవ్వుతూ కల్నల్. ఆమెకూడా నవ్వింది. ఈ నవ్వులలో ఒక అరమైలు నడిచారు అప్పుడే. కల్నల్ క్రమంగా గభీరవదనం దాల్చాడు, "ఇంతకు, ఈ నవ్వుల ఉపోద్ఘాతమంతా ఏ విషాద సన్నివేశానికి చెందినదో చెప్పు—" అన్నాడు.

దాసి కల్నల్ దగ్గరకు వచ్చి వాని బుజం తాకీ తాకనట్లు ప్రక్కనే నడువసాగింది. "కల్నల్, వినండి—"

కల్నల్ అడ్డగించాడు, "ఆఁ—ఈ దినమంతా ఎలా గడిపారు మేజర్, అతని డార్లింగ్?"

దాసి నిట్టూర్చుతూ అన్నది, "కలిసి గడిపినట్లే లేదు. మాటాడినట్లు కూడ తోచదు. మధ్యాహ్నం భోజనం కాగానే ఆమె బజారుకు పోయింది, ఏవో మందులు కొనుక్కొని రావాలని—"

"మందులా, ఎవరికోసం?"

"హుఁ... నాకోసమయినా బాసుండును. శ్.. అవేం మందులో కల్నల్, మూతలు తెరిచేసరికి గుప్పున భరించరాని వాసన కొట్టినాయి. నేను నిల్వ లేకపోయినాను అక్కడ. ఆమె మాత్రం పట్టుదలతో అది తెరచింది, కలిపింది, ఏదో... అబ్బ—"

"త్వరగా చెప్పు, ఇల్లు చేరుకుంటున్నాం—"

"ఆఁ... అసలు సంగతి చెప్పనీయండి. తన దుస్తులన్నీ సర్దుకొన్నది. తన దోమతెర కూడ మడత పెట్టుకొన్నది. ఇరాకులో దోమలబాధ జాస్తిటగా—"

"శ్... అదికాదు అసలు విషయం—" అన్నాడు కల్నల్, ఆమె చేయి తన బాకువరతో తట్టుతూ.

"అవునవును. అలసిపోయి వచ్చినట్లున్నారు మేజర్; పైగా నేటితోనే సెలవు ఆఖరుకూడా. నేమో; పెందలకడనే తన గదిలో పండుకొన్నారు" వారు రాత్రి రెండుగంటలవేళ ఒకమారు లేచి, పానీయం పుచ్చుకునే అలవాటు... వారి ప్రక్కనే బల్లపైన పాత్రలో నీరు నింపి, కల్నల్ అందులో తాను కొన్న—"

"నిజంగానా?" అంటూ కల్నల్ మిగతా కథనంతా ఊహించినట్లు తొందర తొందరగా నడువనారంభించాడు.

దాసీది వెనుకపడి ఏదో చెపుతూనే ఉన్నది. అవేమీ అతడు విన్నట్లులేదు. ఉండిఉండి ఒక్కమారు అడిగాడు, "ఆఁ... మేజర్ బ్రతికే ఉన్నారుగా—"

"ఇంతవఱకు హాయిగా నిద్రిస్తూనే ఉన్నారు. ఎంత అయింది?"

కల్నల్ గడియారం చూసుకున్నాడు, ఆనందంతో ముఖం వికసించింది. పరుగుపరుగున మేజర్ ఇంటిలో ప్రవేశించాడు.

క్రింది భాగమంతా చక్కగా సర్దబడిఉన్నది. మేజర్ సామానులుమాత్రం అటు ఇటు పడిఉన్నా, కట్టిన మూటలు కట్టినట్లే ఉన్నాయి. ఆమె సామానులు చాలవఱకు పెట్టెలలో, సంచులలో భద్రపరుపబడి ఉన్నాయి.

కల్నల్ చరచరా పైకి నడిచాడు. మేజర్ పరున్నది మెట్లప్రక్క మొదటి గది. ప్రవేశిస్తూనే టేబిల్ పైని నిండుపాత్ర తిలకించాడు. ఎంతో తృప్తిగా గాఢంగా నిట్టూర్చాడు. నిదురించే మేజర్

ముఖం పై తన ముఖం పెట్టి చూచాడు. అమాయకంగా విశ్రాంతి తీసుకొంటున్న జీవచిహ్నాలు చిందులాడు తున్నాయి. ఆనందంతో ప్రక్కకు తిరిగాడు.

ఇంతలో వెనుకపక్క దాసీది మెట్లుఎక్కి, రొజు కుంటూ గదిలోకి ప్రవేశింపబోతున్నది. కల్నల్ తటాలున తలుపుదగ్గరకు పోయి, "నీవు క్రిందనే ఉండు" అన్నాడు.

దాసి వెక్కి వెక్కి ఏడుస్తూ, "నన్నుకూడ ఇక్కడ ఉండనీయండి" అని బ్రతిమాలుకుంది.

"వద్దు క్రిందకు పో" అని చప్పున తలుపు బిగించాడు.

మళ్లా పానీయపాత్రవద్దకు వచ్చాడు. అది పైకెత్తి వాసన చూశాడు. విషవాయువులకు క్రొత్త వాడుకాని కల్నల్ కు ఆ వక మెంతవిషమయమో, అది త్రాగినవానికి మృత్యుపరిష్వంగ మెంత సన్నిహితమో అర్థమయినాయి. పాత్ర కుడిచేత పట్టుకొని, తన గడియారంవంక చూసుకొన్నాడు. ఒంటిగంట న్నర...హుఁ!...అరగంట దాటితే ఈపాత్ర ఖాళీ అయి ఉండేది, మేజరు ప్రాణాలుకూడ...

మెల్లగా ప్రక్క గదిలో ప్రవేశించాడు. 'డార్లింగ్' తన సిగ్గులేని ముఖం చేతులతో కప్పుకొని నిద్రిస్తున్నది. బహుశా సుఖస్వప్నాలు కంటున్న దేమో, మేజర్ మడిసినట్లు, తాను ఇరాకు పోయి నట్లు, ఇంకా అధికారులను వంచించినట్లు...మెల్లగా దీపం పెద్దది చేశాడు.

ఆమె తనకొనర్చిన అవమానంతో మండిపోతు న్నాడు కల్నల్. తన భర్తను, కాదు ... ఒక మేజ రును, కాదు ... తమదేశాన్ని రక్షించే అసామాన్య సైన్యాధ్యక్షుని, సునాయాసంగా చంపి వేయనెంచిన దన్న భావానికి పిచ్చియెత్తి పళ్లు పటపట కొరికాడు. ఇలాంటి స్త్రీకి పరాయిపురుషులు, కల్నల్లుకాదు జనరల్లుమాత్రం, లెక్క ఏమిటి అన్న ఆలోచనతో వణికిపోయినాడు. ఈ పాపిష్ఠి కథ అంతా వింటే మేజర్ దేశానికి ఇంకా ఉపయోగపడే మనస్థితిలో ఉంటాడా అన్న సందియంతో చిందులు వేశాడు.

ఇలా ఆలోచిస్తూనే క్షణాలు గడిచిపోతు న్నయ్; ఇంతలో ఆమె లేచింది అతన్ని చూసింది. అతనిచేయి అందుకొనబోయింది, "ఆఁ...వచ్చారా," అంటూ.

అతడు ఒక అడుగు వెనుకకు వేశాడు. ఆమె అన్నది, కల్నల్, ఇంకా ఒక్క అరగంట ... దీపం చిన్నది చెయ్యండి. ఈ యింటిలో ఉన్నది మన మిద్దరమే కొద్ది క్షణాల...కల్నల్, ఇంకొక్క అర గంట" అంటూ మెత్తని దిండును తన వక్షస్థలంపైన హత్తుకొన్నది.

కల్నల్ ఏమీ మాటాడలేదు. అతని మౌనం అర్థంకాక, "కల్నల్, దాహం, ఈదినమంతా ఒకటే దాహం' అన్నది.

కల్నల్ ఒక అరనిముషమాగాడు. దీపం చిన్నది చేశాడు. కూజాలోని నీరు కొంత ఆపాత్రలోపోసి ఆపాత్ర ఆమె చేత నుంచాడు. అది అందించే అతని వ్రేళ్లు వణికినాయి.

వలపు కలలు కంటున్న ఆమె ఆప్యాయంగా పానీయం త్రావబోతోంది కల్నల్ అన్నాడు, "దీంలో నీ దాహం తీరుతుంది

ఆమెకు కళ్ళు తిరిగినాయి. గుండెలు కొట్టుకు న్నాయి. నరాలు స్వాధీనం తప్పిపోతున్నట్లున్నది. "కల్నల్...కల్నల్......ఇదెక్కడి పానీయం? అబ్బ...ఏమి ఇదంతా చీకటి? కల్నల్......మీరు న్నారా నాప్రక్క...కల్నల్...డార్లింగ్ అనండి. ఒక్కసారి డా...డా...ఆఁ..." ఇక ఆమె నోట మాట రాలేదు.

ఒక నిముషమాగి కల్నల్ దీపం పెద్దది చేశాడు. ఇక పాపం చేయలేని ఆమె పెదవులు, బుగ్గలు, కన్నులు, ముంగురులు చూసి రెండు అశ్రుకణాలు వదిలాడు. మళ్ళా దీపం తగ్గించాడు. యుద్ధరంగాన్ని గెల్చుకొన్న యోధుడులాగా మేజర్ గదిలో ప్రవే శించాడు.

గడియారం టంగుటంగున రెండు గంటలు కొట్టింది. మేజర్ కళ్ళు నులుముకొంటూ "డార్లింగ్ దాహం. అన్నాడు. సమాధానం లేదు. కనులు నులుపుకొంటూ లేచి కూర్చున్నాడు. తన ఎదురు తన డార్లింగ్ కు బదులు తన కల్నల్ ఉన్నాడు. "మీరా!" అంటూ తొట్రుపాటుగా మంచం దిగాడు.

కల్నల్ గంభీరంగా సంబోధించాడు "మేజర్" అని.

మేజర్ గడియారం చూస్తూ, "అవును, నా సెలవు గడువు అయిపోయింది. పండ్రెండు దాటింది. నిన్న గతించింది నేను మళ్ళా నేను మీ సేవకు డను. ఇక వేకువ గడియలు వస్తాయి నన్ను ఇరాకు తీసికొనిపో వచ్చారు కాదూ కల్నల్?" అన్నాడు.

కల్నల్ నిశ్చలంగా "అవును" అన్నాడు.

"నేనూ సిద్ధమే. తెచ్చిన మాటలు తెచ్చినట్లే ఉన్నాయి. ఒక్క నిముసం ఆగండి. నా డార్లింగ్‌ను చూసివస్తాను" అంటూ అగడిలోకి పోయినాడు. అతని వెంటనే కల్నల్ కూడా నడిచాడు.

"మేజర్ తడబడుతూ, "నన్ను ఏకాంతంగా—"

కల్నల్ అన్నాడు, "ఫరవాలేదు."

మేజర్ మెల్లగా దీపం హెచ్చించాడు. తన డార్లింగ్ వంక చూశాడు. కల్నల్ వైపు చూస్తూ, "కల్నల్, కల్నల్...ఇదేమి, ఆ పెదవులంత చల్లగా నల్లగా ఉన్నాయి?" అన్నాడు.

కల్నల్ మాటాడలేదు. మేజర్ మళ్ళా రెట్టించాడు, పెదవుల దగ్గరగా తన ముఖం వంచుతూ.

మేజర్, ఆ పెదవులు ముద్దు పెట్టుకోవకు. అవి విషంలో తడిసినాయి."

మేజర్ మంచంపైన తూలిపడి, "విషమా? నా డార్లింగ్ విషం త్రాగిందా?" అన్నాడు.

"అవు"నన్నాడు కల్నల్.

"కాని కల్నల్, మీరు అనుభవశాలురు, చెప్పండి, ఎవరైనా విషం తమంత తామే త్రాగుతారా?"

"ఊహుఁ..."

"మరి నా డార్లింగుకు—కల్నల్! విమాన దాడిలో కూడ నేనిలా వ్యథ చెందలేదు కల్నల్! అసలు మీ రిచ్చట ఎలా ఉన్నారీ నడిరేయి' అంటూ లేచాడు మేజర్

కల్నల్ దీపం తగ్గించాడు. గది బైటకు దారి తీశాడు. మేజర్ వెంట నడుస్తూ, "ఏం కల్నల్?" అన్నాడు.

కల్నల్ కల్నల్‌గా నిలిచాడు. బిగ్గరగా "మేజర్"! అని సంబోధించాడు. "నేను కల్నల్‌గా అడుగుతున్నాను. నీవు మేజర్‌గా సమాధానమియ్యి. ఒక సైన్యాధ్యక్షునికి ఘోరమైన వంచన చేసినవారి నేమి చేయాలి?"

"కాల్చి వేయాలి."

"ఒక సైన్యాధ్యక్షునికి విషప్రయోగం చేసి చంపచూచిన వారి నేం చేయాలి?"

"పేల్చి వేయాలి."

కల్నల్ గొంతుచూర్చి, మేజర్ వీపుపై తట్టి, "మేజర్, నేను నీ మిత్రుడను, నిన్ను కాపాడాను," అన్నాడు.

మేజర్ కన్నీరు కారుస్తూ, "కల్నల్, నన్ను క్షమించండి నా భాగ్య దోషాలకు" అన్నాడు. మరుక్షణంలో వాని చేతులు వదల్చుకొని, కల్నల్‌కు సెల్యూట్ చేస్తూ అన్నాడు "మిగతి కథ చెప్పవద్దు. నాకు అశాంతి కూర్చవద్దు...కల్నల్ నేను మీ మేజరును. నాకు శాంతి మీలో, యుద్ధరంగంలో. నా సెలవు త్రుంచివేసి నన్ను బ్రదికించారు. నన్ను ఇరాకు తీసికొనిపొండి."

మేజర్ తలుపుతీసి క్రిందకు దిగబోయినాడు. దాసీది ఏడుస్తూ మెట్లమీదనే నిల్చునియున్నది. "కల్నల్, నన్ను ఈ ఎడారి ఇసుకలలో పూడ్చి పోతారా, ఒంటరిదాన్ని చేసి?"

కల్నల్ ఒక్క క్షణం ఆలోచించాడు. "సరే నీవూ మాతో రావచ్చు. మా దళాలలో నర్సుగా పనిచెయ్యి. కాని—" కల్నల్ గొంతెత్తి బాకుమీద చేయివేసి "మీ యాజమానురాలిలా ప్రవర్తిస్తే నిలువున ప్రాణాలు కోల్పోతావు" అన్నాడు.

మరునాటి తొలిసంజలు ప్రసరించక పూర్వమే వేడి చల్లారిన ఆ యిసుకకుప్పలు దాటిపోయినారు వారు ముగ్గురు.

# ఇండో చైనా శాంతిసంధి

పి. శ్రీరాములు

ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం జరిగిన ఇతర అంతర్జాతీయ సమావేశాలన్నీ ఒక ఎత్తూ, ఇటీవల జెనీవాలో జరిగిన తొమ్మిది రాజ్యాల సమావేశం ఒక్కటే ఒక ఎత్తూ అంటే అందులో అతిశయోక్తి ఏమీ లేదు. అంతర్జాతీయ సమావేశాలంటే, కొన్ని రాజ్యాల ప్రతినిధులు ఒకచోట సమావేశం కావడం, ప్రత్యేక సంఘాలద్వారా, ఉపసంఘాలద్వారా కొన్ని రోజుల పాటు చర్చలు సాగించడం, సమావేశం ఆఖరైన రోజున తమ ఆశయాలను పొందుపరుస్తూ ఒక సంయుక్త ప్రకటన చేయడం పరిపాటి అయిపోయింది. ఆ సంయుక్త ప్రకటనలో విశదీకరించే ఆశయాలు, లక్ష్యాలు అమలులోకి వస్తే వస్తాయి లేకపోతే లేదు. అంతటితో సమావేశంలో పాల్గొన్న నాయకులు, వారి అనుచరవర్గాలవారు ఎవరి దేశానికి వారు ప్రయాణాలు కడతారు. దానితో సమావేశం సమాప్తమవుతుంది.

జెనీవా సమావేశం మాత్రం ఆవిధంగా జరగలేదు. అక్కడ సమావేశమైన తొమ్మిది రాజ్యాల ప్రతినిధులు ఉత్తమ రాజనీతిజ్ఞతను, ఉదాత్తమైన కార్యదక్షతను ప్రదర్శించి చివరకు సమావేశాన్ని జయప్రదం చేశారు. అసలు ఈ సమావేశం ప్రాచ్యఖండ శాంతి సుస్థిరత్వాలకు ప్రబల ప్రతిబంధకాలుగా పరిణమించిన ఇండో చైనా, కొరియా సమస్యల పరిష్కార మార్గాలను అన్వేషించడానికి బ్రిటన్, అమెరికా, ఫ్రాన్సు, రష్యా, కమ్యూనిస్టు చైనాలమధ్య ప్రారంభమైంది. కొరియా భవిష్యత్తుపై జరిగిన చర్చలలో అడుగులోనే హంసపాదు ఏర్పడడం, అందుచేత ఇండో చైనా సమస్యాపరిష్కారానికే సమావేశంలో అత్యధిక ప్రాధాన్యం లభ్యం కావడం జరిగింది

ఇండో చైనా సమస్యపై జరిగే చర్చలలో సామ్రాజ్యాధిపత్యం వహిస్తున్న ఫ్రాన్సు మాత్రమే పాల్గొనడం న్యాయసమ్మతం కాదు కాబట్టి, అక్కడ జరుగుతున్న యుద్ధంలో ప్రముఖపాత్రను నిర్వహిస్తున్న వియత్ మిన్, వియత్ నామ్, లావోస్, కాంబోడియా రాజ్యాల ప్రతినిధులనుకూడా జెనీవా సభకు ఆహ్వానించారు. బ్రిటన్, అమెరికా, ఫ్రాన్సు, రష్యా, చైనాలతోపాటు పై నాలుగు రాజ్యాల ప్రతినిధులు పాల్గొనడమే ఈ సభను తొమ్మిదిరాజ్యాల సమావేశమనడానికి కారణం. గత జనవరి నెలలో బెర్లిన్‌లో జరిగిన పాశ్చాత్య అగ్రరాజ్యాల విదేశాంగమంత్రుల సమావేశ నిర్ణయానుసారం ఏర్పాటైనదే ఈ జెనీవా సమావేశం.

దాదాపు 75 రోజులపాటు జరిగిన ఈ చరిత్రాత్మక సమావేశం చివరకు జయప్రదంగా సమాప్తమై, ఇండో చైనా యుద్ధవిరమణసమస్యమీదా, దాని రాజకీయభవిష్యత్తుమీదా వివిధ ప్రతినిధివర్గాల మధ్య సామరస్యపూర్వకమైన ఒప్పందాలు కుదిరినందుకు సమస్త సభ్యతా ప్రపంచం ఐక్యకంఠంతో హర్షిస్తున్నది.

ఇండో చైనాయుద్ధం ప్రారంభమై ఇప్పటికి ఏడున్నర సంవత్సరాలు దాటిపోయింది. ఈ ఏడున్నర సంవత్సరాలలో అక్కడ ఫ్రెంచి సామ్రాజ్య సైనికబలాలకూ, వారిని సాహసోపేతంగా ప్రతిఘటించిన వియత్ మిన్ సేనలకూ జరిగిన యుద్ధంలో ఉభయపక్షాలా సంభవించిన ఘోరమైన రక్తపాత వివరాలను, ధన ప్రాణ నష్టాలనూ అవగాహన చేసుకుంటే, యుద్ధవిరమణ ఒప్పందంపట్ల ప్రపంచ ప్రజలు—ముఖ్యంగా ఆసియా ప్రజలు—ఇంతగా ఎందుకు హర్షాన్ని వెల్లడిస్తున్నారో బోధపడుతుంది.

ఈ మారణ హోమంలో ఒక లక్ష మందికి పైగా ఫ్రెంచియూనియన్ సైనికులు హతులైనారని అంచనా. తమ సైన్యంలో 92 వేల మందిని కోల్పోయినట్లు ఫ్రెంచి అధికారప్రకటనలే తెలియజేసినవి. వీరిలో దాదాపు 42 వేల మంది ఇండో చైనా నివాసులనీ, ఇతర వలసప్రాంతాలనుంచి వచ్చినవారు వేలవరకు వుంటారనీకూడా ఇదే అంచనా వ్యక్తపరుస్తున్నది.

ఫ్రాన్సు ముఖ్యంగా తన సైనికోద్యోగులను అసంఖ్యాకంగా ఈ యుద్ధంలో బలి పెట్టింది. ఫ్రాన్సులో సుప్రసిద్ధ మిలిటరీ కళాశాల అని పేరు పొందిన 'సెయింట్ సిర్' కాలేజిలో సాలీనా ఎంత

మంది మిలిటరీ ఆఫీసర్లు శిక్షణపొంది తయారవుతున్నారో, దాదాపు అంతమందినీ ఫ్రెంచి ప్రభుత్వం ఇండోచైనా యుద్ధభూమికి గత ఏడేళ్లలో ప్రతి ఏడాదీ ధారపోసిందన్నది ఫ్రెంచి సైనికశాఖాధిపతులు సైతం అంగీకరిస్తున్న విషయమే.

ఇక పోతే, ఈ యుద్ధంలో ఫ్రాన్సుకు, దాని అండనవున్న అమెరికాకు కలిగిన ఆర్థిక నష్టం ఎంత అపారమైనదో ఈ క్రింది వివరాలనుబట్టి గ్రహించవచ్చు:

ప్రత్యేకించి ఇండోచైనా యుద్ధ నిర్వహణ నిమిత్తమే ఫ్రాన్సు 2,85,330 కోట్ల ఫ్రాంకులు ఖర్చు పెట్టిందని ఒక అంచనా. అంటే బ్రిటిష్ ధనమానంలో ఈ మొత్తం దాదాపు 285.33 కోట్ల పౌనులన్నమాట. ఈ మొత్తంలో ఫ్రెంచి ప్రజలవద్ద పన్నులక్రింద వసూలుచేసిన మొత్తం దాదాపు 167 కోట్ల పౌనులు. అమెరికా చేసిన ఆర్థిక సహాయం 105 కోట్ల పౌనులవరకూ వున్నట్లు తెలుస్తున్నది. మిగతా ధనం ఇండోచైనాలోని వియత్‌నామ్ లావోస్, కాంబోడియా ప్రజలమీద వసూలు చేసింది.

ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో పూర్తిగా చితికిపోయి నేటికీకోలుకోని ఫ్రాన్సు ఆర్థికవ్యవస్థ, ఇండోచైనాలో సాగిన ఏడేళ్ల యుద్ధం ఫలితంగా ఎంత వుంటుందో వేరే చెప్పవలసిన పని లేదు.

ఇండో చైనా యుద్ధం 1946 డిసెంబరు నెలలో హైఫాంగ్ రేవులో ఫ్రెంచివారికీ, వియత్‌మిన్ సేనలకూ మధ్య ఒక స్వల్ప సంఘర్షణగా ప్రారంభమై, చిలికి చిలికి గాలివాన అయినట్లు రానురాను అదే సంకులసమరంగా పరిణమించింది. వాస్తవానికి, ఇండోచైనాయుద్ధానికి అంకురారోపణ ద్వితీయ ప్రపంచసంగ్రామంలో జపాన్‌వారి ఆక్రమణతోనే జరిగిందని అంగీకరించవలసి వుంటుంది. పధ్నాలుగు సంవత్సరాలక్రితం 1940 లో యూరప్‌లో నాజీసేనల విజృంభణను తట్టుకోలేక, ఫ్రాన్సు దాసోహమన్నప్పుడు, ఇక్కడ ఆసియాలో తన వలసరాజ్యమైన ఇండో చైనావిషయంలో జపాన్‌తో ఫ్రెంచి పాలకులు విధిగా ఒక ఒప్పందం చేసుకోవలసి వచ్చింది. ఆ ఒప్పందంఫలితంగానే ఉత్తర ఇండోచైనాలోని టోంకింగ్ రాష్ట్రాన్ని జపాన్‌కు ధారాదత్తం చేశారు. అప్పటిలో చైనాపై సాగిస్తున్న దండయాత్రలో జపాన్ ఆ రాష్ట్రాన్ని ప్రధాన యుద్ధస్థావరంగా ఉపయోగించుకున్నది. క్రమక్రమంగా ఆనాటి జపాన్ ఇండోచైనాఅంతటిపై తన ఆధిపత్యాన్ని స్థాపించుకోగలిగింది. అదే జపాన్ 1945 మార్చి 9న ఫ్రెంచిపాలనను పూర్తిగాత్రోసిరాజని బావ్‌దాయ్‌ని ఇండోచైనాకు కీలుబొమ్మరాజ్యాధిపతిగా ప్రతిష్ఠాపన చేసింది. నాటికీ, నేటికీ కూడా ఇండోచైనాలో బావ్‌దాయ్‌ది కేవలం "కీలుబొమ్మపాత్ర"గానే మిగిలిపోయింది.

ద్వితీయ ప్రపంచయుద్ధం సాగుతున్న రోజులలోనే జపాన్‌వారిపై ఇండోచైనాలో రహస్య ప్రతిఘటనోద్యమాన్ని 'వియత్‌నామ్ స్వతంత్ర సమితి' ప్రారంభించడం ఆ 'స్వతంత్ర సమితే' వియత్‌మిన్‌గా రూపొందడం జరిగింది. ఆ స్వతంత్ర సమితిలో బ్రిటిష్, అమెరికన్, ఫ్రెంచి ఉద్యోగులు కూడా చేరి జపానును ప్రతిఘటించకపోలేదు.

ఈ 'వియత్‌మిన్' తిరుగుబాటుదళానికి అమెరికన్ వైమానిక దళాధిపతి జనరల్ క్లెయిర్ చెన్నాల్ట్ విమానాలద్వారా ఆరోజులలో ఆయుధసామగ్రి సరఫరా అవుతుండేది. ద్వితీయ ప్రపంచయుద్ధం అంత్యదినాలలో—అంటే 1945 ఆగస్టు 8 ప్రాంతాన—డాక్టర్ హోషిమిన్ నాయకత్వాన వియత్‌మిన్ సేనలు విజృంభించి హానోయ్ నగరాన్ని స్వాధీనపరుచుకోవడం, ప్రపంచయుద్ధం సమాప్తమైన వారం రోజులకే హోషిమిన్ అధ్యక్షుడుగా వియత్‌నామ్ రిపబ్లిక్ అవతరించడం కూడా జరిగింది. ఉత్తర ఇండోచైనాలో వున్న అన్నాం, టోంకింగ్ రాష్ట్రాలు, దక్షిణ దిశనవున్న కొచిన్ చైనారాష్ట్రం ఈ రిపబ్లిక్‌లో చేరిపోయినవి. బావ్‌దాయ్ దానితో పదవీభ్రష్టుడైనాడు.

డాక్టర్ హోషిమిన్ వయస్సు 62. విప్లవవాది. ఉత్తరరాష్ట్రమైన అన్నాం ఇతడి జన్మస్థానం. తండ్రి ఫ్రెంచిప్రభుత్వంకింద ఏదో ఉద్యోగం చేస్తుండేవాడనీ, ఒకానొక సందర్భంలో జాతీయోద్యమాన్ని బలపరిచినకారణంగా అతణ్ని ఫ్రెంచిపాలకులు బర్తరఫ్ చేశారనీ ప్రతీతి. జాతీయభావాలలో హోషిమిన్ తండ్రిని మించినవాడైనాడు. 1930 లో ఇండోచైనా కమ్యూనిస్టు పార్టీని స్థాపించడం, ఆ కారణంగా అతడికి పరోక్ష మరణశిక్ష విధించడం కూడా జరిగింది. తర్వాత హాంకాంగ్‌లో బ్రిటిష్ శాసనాలను ధిక్కరించినకారణంగా 18 నెలలు కారాగారశిక్ష సైతం అనుభవించాడు. 'హోషిమిన్' అంటే అన్నాంభాషలో 'విజ్ఞానదాయకుడు' అని అర్థం.

1945 లో హోషిమిన్ వియత్‌నామ్ రిపబ్లిక్ అధ్యక్షుడైనప్పుడు ఇండోచైనాలో ఫ్రెంచివారికి

3 వేలమంది సైనికబలగం మాత్రమే వున్న కారణం చేత, వాటికి హోషిమిన్‌బలాలను ప్రతిఘటించే శక్తి లేకపోయింది. 1946 మార్చిలో ఫ్రెంచియూనియన్‌లోనూ, ఇండో చైనా ఫెడరేషన్‌లోనూ యత్ నామ్ స్వతంత్ర ప్రతిపత్తిని ఫ్రాన్సు గుర్తించింది. ఉత్తర ఇండోచైనానుంచి జనరలిసిమో చాంగ్ కైషేక్ సేనలను స్వదేశానికి పంపించివేసే షరతుమీద తన దేశంలో ఫ్రెంచిసేనల ఉనికికి హోషిమిన్ సమ్మతించాడు. ఆ పిమ్మట డాక్టర్ హోషిమిన్ ఒప్పందం షరతుల ధృవీకరణకై ఫ్రాన్సుకు వెళ్ళడం, ఫ్రెంచి ప్రభుత్వం సైనిక మర్యాదలతో ఆయనకు స్వాగతం ఇవ్వడం సంభవించింది. ఆనాడు ఫ్రెంచి ప్రభుత్వంతో జరిగిన చర్చలలోనే డాక్టర్ హోషిమిన్ ఇండోచైనా సంపూర్ణ స్వాతంత్ర్య వాంఛను వ్యక్తపరిచాడు. దాన్ని ఫ్రాన్సు నిరాకరించింది.

ఈవిధంగా డాక్టర్ హో ఫ్రెంచివారికి ఒక అతిక్లిష్టసమస్యగా తయారైనాడు. ఈ ప

ఈ విధంగా వుండగా, ఇండోచైనాలోని అప్పటి ఫ్రెంచి రెసిడెంట్ జనరల్ అడ్మిరల్ థియరీ డాగెన్‌ల్యూ కొచిన్‌చైనాలో కమ్యూనిస్టేతర ప్రభుత్వాన్ని ప్రత్యేకంగా ఏర్పాటు చేయడంతో వియత్‌నాం, వియత్‌మిన్‌ల మధ్య యుద్ధచర్యలు ప్రారంభమైనవి. హోషిమిన్ తన సేనలతో ఉ

దశనవున్న పర్వతప్రాంతాలకు పోవలసివచ్చింది. మూడేళ్ళపాటు అవిచ్ఛిన్నంగా గెరిల్లాయుద్ధం సాగింది. 1948 మార్చిలో ఫ్రెంచి పాలకులు తిరిగి బావ్‌దాయ్‌ని గద్దెయెక్కించి, రాజ్యాధిపతిగా చేశారు. ఇండోచైనా ప్రజల అండకోసం బావ్‌దాయ్ ప్రభుత్వానికి ఫ్రెంచిసమాఖ్యలో 'స్వతంత్ర' ప్రతి

1949 డిసెంబరులో చైనా అంతర్యుద్ధంలో మావ్‌సీటుంగ్‌కు సంక్రమించిన విజయంకారణంగా ఇండోచైనా యుద్ధస్వరూపమే పూర్తిగా మారిపోయింది. హోషిమిన్‌సేనలకు సహాయ సహకారాలు లభ్యమైనవి. 1950 లో ఫ్రెంచివారు వియత్‌మిన్ బలాల చేతులలో పరాజయ పరంపరను ఎదుర్కోవలసి వచ్చింది. అప్పుడే ఫ్రాన్సు తన అతి ప్రముఖసేనానులలో ఒకడైన జనరల్ జీన్ - డీ - టాసినీని ఇండోచైనా యుద్ధనిర్వహణకు పంపించింది. వియత్‌నామ్ సైనికబలాల పునర్నిర్మాణంద్వారా ఇతడు అనేకమార్పులు చేసినా, వియత్‌మిన్ విజృంభణాన్ని అరికటలేకపోయాడు.

తర్వాత గత ఏడాది ఏదో ఒకరంగంలో పెద్ద పెట్టున యుద్ధంచేసి వియత్‌మిన్‌బలాల నడుములు విరగగొట్టాలనే నిర్ణయంతో మరొక ప్రముఖ ఫ్రెంచి సేనాని జనరల్ హెన్రీ నవారీ రావడం, అతడిపథకం కూడా విఫలం కావడం, అది జరిగిన కొన్ని మాసాలకే ఎర్రనది డెల్టాలో అతిప్రధానమైన ఫ్రెంచిదుర్గం దీన్ బీన్ ఫూ వియత్‌మిన్ సేనల వశంకావడం ఇటీవలే జరిగిన సంఘటనలు.

దీన్ బీన్ ఫూ దుర్గం పతనమైన మరుసటిరోజే — మే 8 న — జెనీవాలో చరిత్రాత్మకమైన ఇండోచైనా శాంతి సమావేశం ప్రారంభమైంది. దీన్‌బీన్‌ఫూ విజయదర్పంతోనే వియత్‌మిన్‌ప్రతినిధులు ఈ చర్చలలో పాల్గొన్నారు.

ఇండోచైనా యుద్ధవిరమణ సమస్యపై జెనీవా సమావేశంలో మొదట బ్రిటిష్ విదేశాంగమంత్రి అంథొనీ ఈడెన్, అమెరి విదేశాంగమంత్రి జాన్ ఫాస్టర్ డల్లెస్, అప్పటి విదేశాంగమంత్రి జార్జి బిడాల్ట్, సోవియెట్ విదేశాంగ మంత్రి మాలటోవ్, చైనా ప్రధాని, విదేశాంగమంత్రీ అయిన చౌ ఎన్ లై ల పాల్గొన్నారు. మొదటి ఐదువారాలపాటు సమావేశం ఉభయపక్షాల వాదనలతో ఎదురువాదనలతో, ప్రతిపాదనలతో, ఎదురు ప్రతిపాదనలతో అతినీరసంగా, నిరుత్సాహకరంగా, నానుడుగా సాగింది. సమావేశం ఫలిస్తుందా అనే అనుమానం సైతం కలుగకపోలేదు. జెనీవా సభ చర్చలు మొదటిదశలో ఈ విధంగా సాగినవంటే అందుకు సమావేశంలో పాల్గొన్న ఏ ఒకపక్షాన్నీ తప్పుపట్టడానికి వీల్లేదు. వియత్‌మిన్‌వర్గం ప్రదర్శించిన మొండిపట్టుదల, అమెరికా అండచూసుకుని ఫ్రెంచిప్రతినిధివర్గం ఆడిన నాటకమూ ఇందుకు కారణం. జెనీవాసభ జయప్రదం కావాలనే ఉద్దేశంతోగాని, అభిలాషతోగాని అమెరికా ఈ సమావేశానికి రాలేదనే తోస్తుంది.

“ఎక్కడో ఒకచోట నిలిచి కమ్యూనిజం వ్యాప్తిని అరికట్టడానికి పెద్దపెట్టున యుద్ధం చేయవలసిందేకదా, ఇండోచైనాలోనే ఆపని ఎందుకు చేయకూడదు?” అనే ధోరణిలోనే అమెరికా ప్రవర్తిస్తూ వచ్చింది. డీన్‌బీన్‌ఫూ దుర్గంకోసం జరిగిన యుద్ధంలో చావుతప్పి కన్నులొట్టబోయిన ఫ్రాన్సు, ఏవిధంగానైనా అమెరికా ఆర్థిక సైనిక బలాన్ని కూడా ప్రత్యక్షంగా ముగ్గులోకి దింపి, తన వలస రాజ్యమైన ఇండోచైనాను దక్కించుకుందామన్న తాపత్రయంలో పడిపోయింది. అంతేగాని, ఏడు

న్నర సంవత్సరాలనుంచీ సాగుతూ దేశానికి సర్వానర్థకాలు తెచ్చిపెడుతున్న ఇండోచైనా యుద్ధంపట్ల ఫ్రెంచిప్రజలలో ఆనాటి కానాడు ప్ర వ్యతిరేకభావం ఏర్పడుతున్నదనే విషయాన్ని అప్పటి లానియల్ ప్రభుత్వం దృష్టిలో పెట్టుకోలేకపోయింది.

జెనీవాలో చర్చలు సాగుతూండగానే ఇండోచైనా సమస్యమీదనే ఫ్రెంచి పార్లమెంటులో లానియల్ ప్రభుత్వంపై అవిశ్వాసతీర్మానం నెగ్గడం అంతటితో ఆ ప్రభుత్వం పతనం కావడం, అతడి స్థానే జూన్ 20న మెండిస్ ఫ్రాన్సు ప్రధానామాత్య పదవిని స్వీకరించి, "సరిగా నెలరోజులలో ఇండోచైనాలో శాంతిని సాధించనైనా సాధిస్తాను - లేదా, పదవినుంచి తప్పుకోనైనా తప్పుకుంటాను." అని ప్రతిజ్ఞ చేయడం సంభవించింది. ఫ్రాన్సులో జరిగిన ఈ ఆకస్మిక సంఘటన జెనీవా సభాస్థలినుంచి ఫ్రెంచి విదేశాంగమంత్రి బిడాల్ట్ నిష్క్రమణకు దోహదం చేసింది.

జెనీవాచర్చలలో స్వయంగా పాల్గొన్న ఫ్రెంచి ప్రధాని తన ప్రతిజ్ఞను నెగ్గించుకున్నాడు. మెండిస్ సరిగ్గా తాను పెట్టిన గడువుగాజుకు జులై 20 నాటికి ఇండోచైనాయుద్ధవిరమణను సాధించగలిగారు. జెనీవాసమావేశం సఫలీకృతమైందంటే మెండిస్ ఫ్రాన్సు ప్రదర్శించిన స్థిరసంకల్పం, వాస్తవిక దృక్పథం, ఆంథొనీ ఈడెన్ చూపిన రాయబార చాకచక్యం, చౌ ఎన్ లే మాలటోవ్ ల బృందం కనబరిచిన సామరస్యధోరణి వీటినే ముఖ్యకారణాలుగా చెప్పవలసివుంటుంది. అనధికార భారత ప్రతినిధిగా వి. కె. కృష్ణమీనన్ ఉభయపక్షాల క్షేమమునూ కోరిన మధ్యవర్తిగా నిర్వహించిన సామరస్య సంధాన కార్యక్రమంకూడా ఈ సమావేశ విజయానికి ప్రధాన సోపానమైంది.

జెనీవా ఒప్పందాలలో ప్రధాన నిర్ణయాలు ఈవిధంగా వున్నవి: (1) లావోస్, కాంబోడియా, వియత్ నామ్ లలో సత్వర యుద్ధ విరమణ. (2) 1956 జులైనాటికి ఈ మూడు ప్రాంతాలలోవున్న రాజ్యాంగ విధానాల ననుసరించి రహస్య వోటింగుపద్ధతిని ఎన్నికలు జరపడం తద్వారా ఇండో చైనా సర్వస్వతంత్ర ప్రతిపత్తిని నిర్ణయించడం. (3) స్థూలంగా 17-వ అక్షాంశరేఖను సరిహద్దుగా పెట్టుకొని ఆహద్దుకు ఆవల, ఈవలవున్న సేనలను వేటికి వాటిని వర్గీకరించి వారివారి ప్రాంతాలకు చేర్చడం (4) లావోస్, కాంబోడియా, వియత్ నామ్ లు సంపూర్ణ స్వతంత్ర రాజ్యప్రతిపత్తిని కలిగివుండి, రెండేళ్లలో జరుగనున్న ఎన్నికలలో ప్రజలుయథేచ్ఛగా పాల్గొనే అవకాశాలు కలిగించడం. (5) విదేశీ సైనిక స్థావరాలు ఏర్పడకుండా చూడడం. (6) ఈ యుద్ధవిరమణ కార్యకలాపాన్నీ, తదితర భవిష్యత్ కార్యక్రమాన్నీ భారత దేశం, కెనడా, పోలెండు దేశాలతో ఏర్పడే అంతర్జాతీయపర్యవేక్షణ సంఘం అజ్మాయిషీక్రింద సాగించడం. స్థానిక సభ్యులతో ఏర్పడే ప్రాంతీయసంఘాలు ఈ అంతర్జాతీయసంఘంతో సహకరించి పనిచేయాలి. ఈ ఒప్పందంమీద అమెరికా సంతకం చేయకపోయినప్పటికీ. ఒప్పందసాఫల్యతకు కృషిచేస్తామని ప్రెసిడెంట్ ఐసెన్ హోవర్ హామీఇచ్చారు.

భారతదేశం ఈ అంతర్జాతీయ సంఘానికి అధ్యక్షతవహించి పనిచేస్తుంది. జెనీవాసభలో ప్రత్యక్షంగా పాల్గొనకపోయినప్పటికీ ఇండో చైనా శాంతిస్థాపన కార్యక్రమంలో ఈవిధంగా గురుతరమైన బాధ్యత వహించే అవకాశం భారతదేశానికి లభ్యమైంది. ప్రధాని నెహ్రూ అన్నట్లు భారతదేశ విధానాలపట్ల ప్రపంచరాజ్యాలకు గల పరమవిశ్వాసమే ఈబాధ్యతను మనదేశంపై వేయడానికి కారణం కావచ్చు.

కొరియా తటస్థరాజ్య సంఘంలోకంటే ప్రధానమైన పాత్రను భారతదేశం ఇండోచైనా విషయంలో నిర్వహించవలసి వుంటుందన్నది నిర్వివాదమైన విషయం.

కేవలం ఒప్పందాలు జరిగినంత మాత్రాన ప్రయోజనం లేదు. వాటిని సక్రమంగా అమలుజరపడంమీదే వాటి సార్థక్యం ఆధారపడివుంటుంది.

ఏది ఏమైనప్పటికీ, జెనీవా ఒప్పందంవల్ల ఒక సత్వర ఫలితం లభ్యమైంది. రెండవ ప్రపంచయుద్ధం సమాప్తమై ఇప్పటికి తొమ్మిది సంవత్సరాలు పూర్తి అవుతున్నా, శాంతికి నోచుకోనని ఆసియాకు అట్టి శాంతి లభ్యమవుతున్నది. ఫ్రాన్సుఇచ్చిన హామీవల్ల ఇండోచైనా ఎట్టకేలకు ఒక స్వతంత్రరాజ్యం కాబోతున్నది. సంకల్పశుద్ధి వుంటే, ఎంతటి క్లిష్ట సమస్యనైనా, ముఖాముఖిచర్చలద్వారా పరిష్కరించడం సులభసాధ్యమేననే ప్రధానాంశాన్ని జెనీవాసభ, అక్కడ జరిగిన ఒప్పందాలు ప్రస్ఫుటం చేస్తున్నవి. ఇదే చిత్తశుద్ధితో, సంకల్పబలంతో వ్యవహరిస్తే, సమితిలో చైనా సభ్యత్వసమస్యను, కొరియా ఏకీకరణ సమస్యను, జర్మనీ ఏకీకరణ సమస్యనుకూడా అచిరకాలంలోనే పరిష్కరించుకొని సకల ప్రపంచానికీ సంపూర్ణ శాంతిభిక్ష పెట్టగలమన్న విశ్వాసం లేకపోలేదని జెనీవాసభ రుజువుచేస్తున్నది.

# * అశ్వఘోషుడు *

శ్రీ పి. యస్. ప్రకాశదీక్షితులు

## పాత్రలు

| | |
|---|---|
| అశ్వఘోషుడు | సువర్ణాక్షి |
| చంద్రచూడుడు | ప్రభాదేవి |
| ధర్మసేనుడు | మనోరమ |
| గౌతముడు | రాగిణి |

## : ప్రథమం :

అశ్వఘోషుడు : (వీణ వాయిస్తూ)

మత్తకోకిల సన్నాదై
ర్నర్తయన్నివ పాదపాన్
శైల కందర నిష్క్రాన్తః
ప్రగీత ఇవ చానిలః—

పుష్పితాగ్రాంస్తు పశ్యేమాన్
కర్ణికారాన్ సమన్తతః
హాటక ప్రతి సంఛన్నాన్
నరాన్ పీతాంబరా నివ॥

అయం వసంత సౌమిత్రే
నానా విహాగనాదితః
సీతయా విప్రహీనస్య
శోక సందీపనోమమ—

చంద్రచూడుడు : సువర్ణాక్షీ పుత్రుడు అశ్వఘోషునికి అభివాదాలు.

: ఎవరది? చంద్రచూడా! నువ్వా!

చంద్ర : ఔను, నేనే! సరేకాని, ఆ సున్న మావిసుబుగుల్లోంచి కోకిల కుహూకుహూ రావం చేస్తుంటే, ఈ మల్లిపందిరిమీద గండు తుమ్మెదలు, ఝుంకారం చేస్తుంటేకూడా నీలోని కవితాశక్తి నిద్రిస్తూన్నదా! 'సీతయా విప్ర హీనస్య' అని వాల్మీకం పఠిస్తున్నావ్ ?

అశ్వ : (నవ్వి) వాల్మీకిని అనుకరించగల భావుకత విశాల విశ్వానికేలేదు. ప్రకృతికూడా ఆమహాకవి కన్నులఎదుట అంజలించి నిలబడింది.

మత్తకోకిలసన్నాదై
ర్నర్తయన్నివ పాదపాన్
శైలకందర నిష్క్రాన్తః
ప్రగీత ఇవ చానిలః—

చంద్ర : పీయూషలహరులై ప్రవహించే నీ కవితావాహినిముందు వాల్మీకి గంటం వట్టి ఇసప ముక్క.

అశ్వ : అభిమానం అతిశయోక్తికి మాతృస్థానం. కానీ,.......

అయం వసంత సౌమిత్రే
నానావిహాగనాదితః

సీతయా విప్రహీనస్య
శోక సందీపనో మమ॥

ఇంత ఉదాత్తంగా ఎవరు పలికారు. భాస, సౌమిల్లకులు కూడా ఆమహాకవి పదచ్ఛాయలలోనే...

చంద్ర: చాలు, చాలు.

ఈ మన సాకేత నగరంలో రేపటిరోజు మహోత్సవం జరుగుతుంది, తెలుసా?

అశ్వ: ఔనౌను, ఈ ఉపవనంలోని మల్లివాసనలు నాహృదయాన్ని కదిపిననాడే, 'సరయూతరణోత్సవం' వస్తున్నదనుకున్నాను. అయితే, ఔనౌను-ఈఉదయ సంధ్యావందనములో అష్టమి సంకల్పం చెప్పాను. రేపు నవమి — చైత్రశుద్ధనవమి సరయూతరణోత్సవం.

చంద్ర: బహుశా, ఈ వసంతంలో విజయశ్రీ నిన్నే వరిస్తుంది.

అశ్వ: కాని వసంతశ్రీ ఎవరో?

చంద్ర: గ్రీకులున్నారుగా. ఈతలో భారతీయులను యవన యువతులు చిత్తు చేసేస్తారు.

అశ్వ: యవనస్త్రీలు ఈత పోటీలలో పాల్గొంటారా

చంద్ర: ప్రపంచాన్ని గురించి నీ కంతగా తెలీదు. ఎంతసేపూ కవిత్వం, కవులు, దార్శనికులూ ఇదే పిచ్చి నీకు.

అశ్వ: జీవితంలో సాధించాల్సినది శాశ్వతమైన యశస్సు. ఈ ఈతపోటీలు, మల్లయుద్ధాలు తాత్కాలికమయిన ఖ్యాతినే తెస్తాయి. రెండేళ్ల క్రితం 'విజయశ్రీ' సాధించినవాడి పేరు చెప్పు.

చంద్ర: చూడూ, ఆవైపు చెట్లచాటునుంచి ఎవరో వస్తున్నట్టున్నారు? ఎవరదీ? ఓహో! గౌతముడా!

గౌత: మహాకవి అశ్వఘోషులకు శిష్యుడు గౌతముడు ప్రణామాలు.

అశ్వ: గౌతమా! నిన్ను చూసి నేను ఎంత జాలిపడి అభిమానిస్తానో అంతా అసహ్యించుకుంటాను. కారణం తెలుసా? ఏవో రెండు మందాక్రాంతాలు, నాలుగు అనుష్టుప్పులు వ్రాసిన అశ్వఘోషుడే మహాకవి అయితే ఈదేశంలో కవిసామ్రాట్ కానివాడెవడు?

చంద్ర: అది గౌతముడికి నీమీద ఉండే అభిమానం.

అశ్వ: అభిమానం అంతరంగవ్యాపారమే కాని...

గౌత: గురుపూజ్య! మీరేమన్నా సరే! తప్పదు, ఈ యుగానికి మీరు మహాకవి. ఆ విషయాన్ని భావి భారత సాహిత్యేతిహాసికుడు విస్మరించడు.

అశ్వ: పిచ్చివాడా! చూశావా, చంద్రా! అతని అభిమానం ఎంత పతనదశకు తీసికొని పోతున్నదో.

గౌత: అయినా సరే! సువర్ణాక్షీ సూనులు అశ్వఘోషులు ఈ వసంత సరయూతరణోత్సవ జయశ్రీ పతాక చేబట్టుతారు.

అశ్వ: (నవ్వి) అభివృద్ధిలోకి రావలిసిన వాడివి ఆరాధనలో పడిపోతున్నావ్. చూచావా, ఆదికవి వాల్మీకి ఏమన్నారో......

పుష్పితాగ్రాంస్తు పశ్యేమాన్
కర్ణికారాన్ సమన్తతః—

(సంగీతం సన్నగా సన్నగిల్లుతుంది)

## : ద్వితీయం :

[సరయూ ప్రవాహం—జన కోలాహలం—ఒడ్డునుండి ఈతకు దూకుతూన్న ధ్వనులు—ఈత—కలకలం—కోలాహలం.]

జనం: "అదిగో, అదే, దాటేశాడు వివస్వంతుడు రెండుబారలు ముందుకుపోయాడు. అదో మదయంతి అతన్ని దాటుకుపోయింది. జయంతుడు మరీ తీవ్రంగా పోతున్నాడు."

రాగిణి: మనోరమా! ఇలా దగ్గరగా రా! అదిగో అదిగో కదంబ కుసుమాలంకృత శిరోజాలపై జలకణాలు పడకుండా పోయే ప్రభను చూశావా?

మనో: సందేహం లేదు రాగిణీ! ఈసారి ప్రభ విజయధ్వజం చేపట్టుతుంది. అదిగో ముందు విసురుగా పోయిన వివస్వంతి, జయంతి, మదయంతులు అప్పుడే అలసిపోయినావ లెక్కే స్తున్నారు.

రాగిణి: మనోరమా! అదిగో ప్రభ అవ్వలి ఒడ్డును స్పృశించి సుడిలా ఎలా తిరిగి వస్తున్నదో! ఓహ్! ఆ ప్రక్క నెవరే!

మనో : రాగిణీ! ప్రథ ప్రథమ స్థానాన్ని పొందలేదేమో! చూస్తుంటే అతనే ముందుగా వచ్చేట్టున్నాడు. ఎవరే ఆ సౌందర్యమూర్తి! చూడూ, ఉదయసూర్యప్రభా భాసమానమయిన ఆ ముఖం వసివాడనైనా లేదు.

రాగిణి : చూడు, చూడు. ఇద్దరూ సమంగా వస్తున్నారు. ఒక్క గోటివాసికూడా ఎడం లేదు. ఒకరినొకరు చూసుకొంటూ లక్ష్యానుసంధానం చేస్తున్నారు. ఏమీ సంకోచం లేదు. ఇద్దరూ ఒకేసారి సరయూతటాన్ని అధిరోహిస్తారు.

[ జై! జై! అశ్వఘోషులకూ జై! జై! ప్రభాదేవికీ జై! జై! అశ్వఘోష—ప్రభాదేవులకూ జై! జై!! ప్రభాదేవికీ జై! జై! అశ్వఘోష కవికీ జై! జై! జై! జై!! కోలాహలం నెమ్మదిగా తగ్గుతూంటుంది ]

రాగిణి : మనోరమా! ఈ అశ్వఘోషు లెవరే?

మనోరమ : అదిగో, ముందు పోతున్నారుగా చూడు.

రాగిణి : మనిషిని చూశానే. పుష్యమిత్ర సేనాపతి నిర్మించిన వల్లరీవనంలో అప్పుడప్పుడు కనుపించేవారు. ఎప్పుడూ ఏదో పాడుతూ, అపరసంధ్యా రమ్యరోచిస్సుల నవలోకిస్తూ ...(జనకోలాహలం)

* * * *

ఒకడు: ఇంతకాలంనుంచి సాకేతంలో ఉంటూ అశ్వఘోషుల పేరే వినలేదూ?

మరియొకడు : వింటే మళ్లీ అడుగుతానా?

ఒకడు : గ్రీకులు ప్రపంచజ్ఞానాన్వేషణలో భారతీయులకంటె.........

మ. ఒ : మీరలా అంటే నేనొప్పుకోను. మా గ్రీకులు ఆవిషయంలో మీరు చెప్పినట్టు భారతీయులకంటె కృషిచేస్తారు. నేను ఇప్పుడిప్పుడే ప్రపంచంలో ప్రవేశిస్తున్నాను. అందుచేతనే నాకు తెలీనివిషయం అడిగి తెలుసుకుంటున్నాను. ఈ జేజేలుకొట్టే భారతీయులందరికీ ఇంతకుముందు ఆయన పేరే తెలీదు.

ఒకడు : ఓహో గ్రుడ్డువచ్చి పిల్లను వెక్కిరిస్తున్నదే సాకేతనగరంలో నేకాక పరిసరదేశాలలో కూడా అశ్వఘోషుని కవితారసాస్వాదన చేయనివారు లేరే.

మ. ఒ : ఓహో! ఈయన కవి అశ్వఘోషులా! మా యవనస్త్రీలందరూ ఈయనగీతాలు సంధ్యాసమయాల్లో ఆలపిస్తూంటారు. అహో! శిరీషకుసుమపేశలసుధామహోక్తులలో ఉదాత్త భావనిక్షేపం చేయటం ఆయనకే అలవడింది:

ఒకడు: ఏమనుకొన్నావ్, భారతీయులంటే...

మ. ఒ: మీరు చాలా అమాయకుల్లా ఉన్నారు.

ఒకడు: సరే కాని, అశ్వఘోషులతో విజయశ్రీని సముపార్జించిన ఆ అమ్మాయి ఎవరో చెప్పావు కాదు.

మ. ఒ : ఆవిడెవరగరా? సాకేతంలో ఉన్న గ్రీకుదేశస్థులలో ఆయన ఎంతటి సంపన్నుడో అంతటి ఉదారుడు. ధర్మదత్తుడు సాకేతనివాసులయిన గ్రీసు దేశీయులకు మకుటంలేని మహారాజు. ఆయన వ్యాపారరంగంలో ఎంతటి నిపుణుడో, కళావిషయంలో కూడా......

ఒకడు : అవకాశం దొరికిందిగదా అని అదే పనిగా పొగిడేస్తున్నావేమిటి? ఆ ధర్మదత్తుడి ఘనత మాకెందుకోయ్? ప్రభాదేవి విషయం...

మ. ఒ: అంతేనా మీకు కావలసింది. మీ సంప్రదాయంప్రకారం ప్రవరచెప్తేకాని కుదరదేమో అనుకున్నాను. అందుచేత అధిక ప్రసంగం అయింది. ప్రభాదేవి ధర్మదత్తుల ఏకైక పుత్రిక.

* * * *

రాగిణి: హమ్మో! సువర్ణాక్షీ పుత్రుడా?

ప్రభా: ఏమే, అంత బెదురుతున్నావ్?

మనో: అడిగావా! సువర్ణాక్షి పేరు సాకేత విప్రజనానికే భయోత్పాదిని.

ప్రభా: అదేమిటి? ఎంత బావుంది ఆవిడ పేరు? సువర్ణాక్షి.

రాగిణి: ఆవిడ్ని ఎప్పుడూ చూడలేదా? పోనీలే. ఈయన్ని చూశావుగా. అమ్మ తల్లిపోలిక. ఆ కన్నులు...ఆ నేత్రాలు...చూశావా! ఆ కన్నులలో బంగారు కాంతులు.

ప్రభా : ఔను. ఆ సువర్ణ రోచులతోనే నన్ను ప్రోత్సహించారు. మీకు తెలీదు. ఆయన ముందుగా ఒడ్డు చేరగలిగిఉండీకూడా స్మితశ్రీ రోచులతో నన్ను నడిపించారు.

మనో : ఆ!

ప్రభా : ఔను రమా! మధ్య దేశాన్ని అతిక్రమించాం. అక్కడ అలసిపోయాను. అంతక్రితమే

మిగిలినవారంతా నావ లెక్కేశారుగా, ఇంక నేనూ ఆగిపోదామనుకుంటుండగా ఆయనే ఉత్సాహాన్ని రేకెత్తించి అలసటను మరపించారు.

రాగిణి: ప్రమాదమే! సువర్ణాక్షి ఆభిజాత్యాహంకారం సాకేతానికి తెలుసు!

## : తృతీయం :

అశ్వ: ఆశ్చర్యంగా ఉందే. ఇన్ని సంవత్సరాలుగా ఈ నగరంలో ఉంటున్నా నాకు తెలీదే.

గ్రీక్ పౌరుడు: బహుశా మీరు దాన్ని కళగా భావించి ఉండరు. కాని మా దేశంలో అది ఉత్తమమైన లలిత కళ.

గౌతముడు: మీ దేశంలో అది ఎంత ఉత్తమమో మా కది అంత అధమం.

అశ్వ: మా గౌతముడు విషయాన్ని కటువుగా చెప్తాడు. మీరేమీ అనుకోకండి. మాకు సాహిత్యం ఉత్తమ కళ.

గ్రీ. పౌ: అది మా గ్రీకులూ అంగీకరిస్తారు. కాని నాటకం సర్వప్రజానీకానికీ అందుబాటులో ఉంటుందిగా

అశ్వ: ఔను. కాని మాకు శ్రవ్యంమీద ఉన్న అభిప్రాయం దృశ్యంమీద......

గ్రీ. పౌ: మీరు ఒక్కసారి...అః! ఈరోజు వసంతపూర్ణిమ కాదూ! ఈ రోజునే మా నాటక ప్రదర్శనం ఉంది. మీరు తప్పకుండా రావాలి. (కోలాహలం) అదేమిటి, జనమంతా ఇటే వస్తున్నారు:

అశ్వ: ఏమిటి చంద్రమూడా ఈ కలకలం?

చంద్ర: (నెమ్మదిగా) అదిగో నీ హృదయేశ్వరి ఊర్వశి

గ్రీ. పౌ: ఊర్వశి అంటే?

గౌత: అదే తెలీదూ?

అశ్వ: మీకు ఇతిహాసా లున్నాయి కాదూ!

గ్రీ. పౌ: ఆహా!

అశ్వ: అలానే మాకూ ఉన్నాయి. ఇతిహాసాల్లో అప్సరసలని ఒక జాతిఉన్నది.

గ్రీ. పౌ: ఓహో!

గౌత: అంతా తెలిసిపోయినట్టే...

జనకోలాహలం. అశ్వఘోష - ప్రభాదేవులకు జై! జై! జై! జై!

అశ్వ: ఏమిటిది?

చంద్ర: సరయూ తరణోత్సవ విజేతలకు అభినందన సభ.

అశ్వ: ఓహో!

ప్రభా: మహాకవులకు నమస్సులు!

గౌత: అలా అనండి. నేను అయిదు సంవత్సరాలనుంచి ఆమాటే అంటుంటే వీడు వినటంలేదు.

అశ్వ: గౌతమా! మర్యాద...ప్రభాదేవీ అభినందనలు. భారత ధరామరులు అభివాదా లందుకొని ఆశీర్వాదా లనుగ్రహిస్తారు. అన్యథా భావించకండి.

ప్రభా: మీ ఆశీర్వాదం నాకు...

ప్రయోక్త: కూర్చోండి! కూర్చోండి! మహాకవి అశ్వఘోషులు ఈ విజయోత్సవసందర్భంలో తమ నూతనకృతులు వినిపిస్తారు. సాకేతనగర వసంతశ్రీని వర్ణిస్తూ ముందుగా వీణావాదం చేస్తారు. అనంతరం ఆయన వ్రాస్తున్న ఊర్వశి కావ్యం ప్రాకృత భాగం వినిపిస్తారు.

అశ్వ: సదస్య జనతాపరిషత్తుకు నమశ్శిరస్సను. సాకేతనగర విద్వజ్జనమండలికి ప్రణామాలు. ఆచార్యులకు అభివాదాలు. వసంతసరయూతరణోత్సవ జయశ్రీ ఇరువురిని వరించింది. ఆభిజాత్యం, ప్రాంతీయాభిమానం వీడి మీరుచేసే సన్మానం ఇరువురికీ సమంగా జరగాలి. అశ్వఘోషమహాకవీ! అని నన్ను సంబోధించినప్పుడల్లా నేను ప్రళయ ఝంఝులోని అశ్వత్థ పత్రంలా చలించిపోతాను. నేను సర్వసామాన్యుణ్ణి. సాకేతనగర వసంతశ్రీ వర్ణనాత్పూర్వం ఆదికవి, మహాకవి బిరుదార్హుడు అయిన వాల్మీకిమునీంద్రుని వసంతంఆలపిస్తాను...(వీణానాదం)

మత్తకోకిలసన్నాదై
ర్నర్తయన్నివ పాదపాన్
శైలకందర నిష్క్రాన్తః
ప్రగీత ఇవ చానిలః॥

పుష్పితాగ్రాంస్తు పశ్యేమాన్
కర్ణికారాన్ సమన్తతః
హాటకప్రతిసంఛన్నాన్
నరాన్ పీతాంబరానివ॥

అయం వసంత స్స్వామిత్రే
నానావిహగనాదితః
సీతయా విప్రహీనస్య
శోకసందీపనో మమ॥

ఓహో! అమర గానం సుధామధులహరి!
నందనవన మందార మరంద నిష్యందం!!
మహాభారత సంగీత కళాతపస్వికీ జై! జై!!

ప్రయోక్త: అశ్వఘోషుల వీణావాదాన్ని, ఆయన మధురస్వనాన్నీ విన్న సదస్యులు త్వరలో ఆయన కావ్యం కూడా వింటారు.

## : చతుర్థం :

ప్రభా: మహాకవులేదో ఆలోచిస్తున్నట్టున్నారు.

ప్రభాదేవీ! రండి, కాని ఇంత కాలంగా ఈనగరంలో యిటువంటి ప్రయోగం జరుగుతున్నదని తెలిసికోకపోవడం నాఅజ్ఞానం.

ప్రభా: కాని మీరు వసంతపూర్ణిమనాడు ప్రదర్శనానికి రావడం మాకందరికీ ఉత్సాహాన్ని కలిగించింది. మీకు చిత్రలేఖనం కూడా వచ్చునే.

అశ్వ: వచ్చునన్నాను. మీవాళ్లు నమ్మారు. నేను వ్రాస్తున్న నాటకానికి యవనికలు కూడా నన్నే తయారుచేయమన్నారు.

ప్రభా: మీరు నిజం చెప్తా

అశ్వ: నేను సువర్ణాక్షీ పుత్ర

ప్రభా: (బెదురుగా) సు-వ-ర్ణా-క్షి

అశ్వ: అదేమిటి? అలా చలించావేం?

ప్రభా: (నవ్వి) అహాఁ! ఏంలేదు. కాని మీరు ఇప్పుడు ఏమిటాలోచిస్తున్నారు?

అశ్వ: ఊర్వశిని గురించి?

ప్రభా: అది తెలుసు. అభినందనసభలో మీరు ప్రాకృతంలో గానంచేసిననాడే నా హృదయం ద్రవించింది. అందుచేతనే ఆ రాత్రి రంగస్థలంమీద పాడించుకున్నాం. దానినే నాటకంగా పరివర్తించదమన్నాం.

నన్ను పురూరవుడుగా అభినయించమన్నారు. కాని ఊర్వశిగా ప్రభాదేవి నటించగలదని వి[illegible]సున్నానని చెప్పాను.

ప్రభా: నాలో అంత

అశ్వ: అది నాకు తెలుసు.

ప్రభా: నిజంగా మిమ్మల్ని పౌరాణికగాథ కదిపిందా?

అశ్వ: అంటే?

ప్రభా: మీ పురాణాల్లో ఉన్న ఊర్వశి మీ హృదయాన్ని కదలించి ఈ జీవప్రచన చేయించిందా?

అశ్వ: నీభావం నా కర్థమవటంలేదు!

ప్రభా: మీరు పరిహాసం చేస్తున్నారు.

అశ్వ: సువర్ణాక్షీసూనుడి పరిహాసంలో కూడా అసత్యం ఉండదు.

ప్రభా: (బెదురుగా) సు-వ-ర్ణా-క్షి.

అశ్వ: ఏం, మాతృదేవి ఎంత దయార్ద్రహృదయమో తెలియక నువ్విలా భయపడుతున్నావ్. ఓసారి చూద్దువుగాని...

ప్రభా: వద్దు...వద్దు.. కాదు, వస్తా. మాతృశ్రీ పదపద్మాలకు అభివాదంచేసి ఆశీర్వాదం పొందుతా.. కాని మీరు నిజం చెప్పటంలేదు. ఈ ఊర్వశి...

అశ్వ: ఊర్వసు లెందరోలేరు.

ప్రభా: సరయూతరణోత్సవంలో అశ్వఘోషులు కనికరించి గెలిపించిన ఊర్వశి...

అశ్వ: ప్రభా! పక్షంలోగా నా ఊర్వశి కనిపించక ఎంత విలపించాను, నువ్వు నా సముక్షంలో ఉంటే...

ప్రభా: మహాకవీ!

అశ్వ: నువ్వు నాప్రక్క నిలబడితే నేను మహాకవినే!

ప్రభా: మీరు పొరబడుతున్నారు.

అశ్వ: ప్రభా! అది జరగదు.

ప్రభా: జరుపుతున్నారు. సాకేతనగర మర్యాదల నధఃకరించి మీ కావ్యాలు దేశంలో వ్యాపించినై. ఆ రోజు రాత్రి మీతో వాదించిన మా నాన్నగారి స్నేహితులు మీ కావ్యాలను మా దేశభాషలోనికి అనువదించి తీసికొనివెళ్లి ఈజిప్టుచక్రవర్తికి కానుకగా పంపారు.

అశ్వ: ప్రభా! నాకోసం ఇంత శ్రమించే నీ హృదయంలో నన్ను బంధించవూ?

ప్రభా: విశాల విశ్వంలో శాశ్వతకీర్తి నార్జించవలసిన అశ్వఘోషుడు సామాన్యయవనస్త్రీ నఖిలషించే స్వార్థానికి లొంగకూడదు.

అశ్వ: నువ్వులేని ప్రపంచం గ్రహణం నాటి రాత్రి.

ప్రభా: మహాకవీ!

అశ్వ: ప్రభా! నీ అరుణాధరాలు! నీ స్వర్ణ కేశ జాలం నన్ను బంధించి ఆదరిస్తున్నాయి.

ప్రభా: మహాకవీ!

అశ్వ: ప్రభా!

ప్రభా: మీరు ధరామరులు.

అశ్వ: త్రిలోకైకసుందరియందు ధరామరత్వం...

ప్రభా: సువర్ణాక్షీ సూనులు...

అశ్వ: అందుకా నువ్వు జంకుతున్నావ్. రా! ఇప్పుడేం చెపదాం? సువర్ణాక్షికి తన బిడ్డపై ఎంత మమకారమున్నదో అంతా నీమీదకూడా ఉంటుంది.

ప్రభా: మహాకవీ! నేను యవనస్త్రీని.

అశ్వ: సౌందర్యం, కళ జాతి మర్యాదలలో నిలబడవు.

ప్రభా: కాని మనకోసం తరతరాలుగా వచ్చే సంప్రదాయం విచ్ఛిన్నంకాదు.

అశ్వ: రా! ఇలా దగ్గరగా రా! నీ మృణాల బాహువల్లరిలో నన్ను బంధించు. రా! ప్రభా! ఏదీ! ఒక్కసారి ... ఒక్కసారి మధురమనోజ్ఞ హాసశ్రీ రోచులు నామీద ప్రసరించనీ......ఇంక ఈ బంధం నుండి మృత్యువుకూడా మనల్ని......

ప్రభా: అలా అనకండి. మహాకవీ! మీరు కూడా సామాన్యమయిన దౌర్బల్యాలకు లొంగిపోతున్నారు.

అశ్వ: ప్రభా! నువ్వు నా ఊర్వశివి. నువ్వు లేని క్షణాలలో నేను ఉన్మత్తపురూరవుణ్ణి. రా! ఈమర్యాదలూ, సమయాలు మనల్నేం చెయ్యవు.

ప్రభా: ప్రభూ!

అశ్వ: దేవీ!

ప్రభా: మహాకవీ!

అశ్వ: ఊర్వశీ!

(వీణానాదం)

## : పంచమం :

ధర్మసేనుడు:

ధర్మం శరణం గచ్ఛామి
బుద్ధం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి

శిష్యులు:

ధర్మం శరణం గచ్ఛామి,
బుద్ధం శరణం గచ్ఛామి,
సంఘం శరణం గచ్ఛామి.

ప్రభా: ధర్మసేన ధర్మాచార్యులకు ప్రణామాలు.

ధర్మ: చిరంజీవికి బుద్ధభగవానుని కరుణ లభిసుంది.

ప్రభా: ధన్యురాలను. అశ్వఘోషమహాకవి ఆచార్యుల దర్శనార్థం...

ధర్మ: చిరంజీవినీ, వచ్చారు. వారాని కొక పర్యాయం ఈ విహారంలో నన్ను కలుస్తూనే ఉన్నారు. కాని ఆయన యింకా సౌందర్యాన్వేషణ చేస్తూనే ఉన్నారు. వసంతాలు, అప్సరసలు ఈ బాధితజనతకు ఎందుకూ పనికిరావు. కాని ఆయన వసంత వన త్రసదృశ అయిన అప్సరః కన్యనే చూస్తున్నారు. కాని నాకొక ఆశ ఉన్నది. ఆయనకవితలో కూడా దార్శనికదృష్టి, తాత్విక చింతన ఉన్నవి. అవే ఆయనకు భారతమహేతిహాసంలో శాశ్వత స్థానాన్ని కూరుస్తవి.

ప్రభా: ధన్యురాలను! ఆచార్యా! ధన్యురాలను. సదా నేను వాంఛించేది అదే! ఆయన శాశ్వతంగా ఉండాలి. తరతరాలవరకూ, దేశ, దేశాల వారూ ఆయనను స్మరిస్తూ ఉండాలి. ఆయన కావ్యాలను గానంచేస్తూ ఆనందోన్మత్తులు కావాలి. అదే నేను కోరుతున్నాను.

ధర్మ: చిరంజీవినీ! నాకు తెలుసు. కాని అతనింకా, పాంచభౌతిక సౌందర్యాన్వేషణ చేస్తూనే ఉన్నారు. వైదికవాఙ్మయం మీద ఆయనకున్న అభిమానం పరంపరాగతం. అయినా అందుకు మన అభ్యంతరం లేదు. ఋగ్యజుస్సామాధ్యయనంచేసి అందులోని పరమార్థాన్ని గ్రహించిన విద్వాంసుడు. కాని చూశావ్! భారత

సాహిత్యానికి శ్రీకారంచుట్టిన ఆదికవి వాల్మీకి ఆయన లక్ష్యం. రామాయణం ఆయనలక్షణం.

అశ్వ: ధర్మసేనాచార్యులకు అభివాదం. ఓహో, ప్రభాదేవికూడా ఇక్కడికే వచ్చిందే. నీకోసం సరయూసైకతసీమలో ఏకాంతపు పాడాను!

ప్రభా: మహాకవీ! ఇది బౌద్ధవిహారం. ఇక్కడ ధర్మచింతన వినా అన్యప్రసంగం.

అశ్వ: ప్రభా! నీ సముఖంలో—అఖిలలోకాశ్చర్యకర సౌందర్యలీలావిలాసంగా అవతరించిన అప్సరఃకన్యవు. నువ్వు వసంతానివి. శరత్పూర్ణిమవు.

ప్రభా: మహాకవీ!

అశ్వ: ప్రభా! నువ్వు నాజీవిత తమోవిహాయసంలో ఉదయించిన చంద్రప్రభవు. ఈజీవిత శిశిరానికి వసంతశ్రీవి.

ప్రభా: మహాకవీ! ధర్మసేనాచార్యుల సమ్ముఖంలో, బౌద్ధ విహారంలో...

ధర్మ: అశ్వఘోషమహాకవీ!

అశ్వ: ఆచార్యా! మీరుకూడ నన్ను మహాకవీ! అంటున్నారు. ఈ విశాలవిశ్వంలో వాల్మీకిమునీంద్రులే మహాకవిబిరుదధారణార్హులు. రామాయణమే మహాకావ్యం. అన్యాలు అల్పాలు. అన్యములు స్వల్పములు.

ధర్మ: నాయనా, అలా అనకు. మానవబుద్ధికి అతీతమయినది లేదు. భరతజాతికి వైదికమతమే శిరోధార్యమనీ, అది భారతదేశాభ్యుదయానికేకైకాధారమనీ భావనచేశారు. బుద్ధభగవాను డవతరించినాడు. దేశంలో పరిణామం వచ్చింది. వైదేశికులుకూడా ఆకర్షింపబడ్డారు. యవనులు చూడు, వ్యాపారదృష్ట్యా వైదికమతాన్ని పోషిస్తున్నారే కాని వారి హృదయాలు బుద్ధభగవానునిమీదనే లగ్నమయిఉన్నవి. బౌద్ధం ఎటువంటి పరిణామాలను తీసికొనివచ్చిందో చూశావా? వేదమతాని......

అశ్వ: ఆచార్యా, మీరు అభిమానంతో పలికే సిద్ధాంతానికి సార్వజనీనత, సార్వకాలికత ఉండదు. అవ్యాప్తి దోషాతీతమయిన సిద్ధాంతం అభిమానంనుండి రాదు. ఆలోచించండి. వేదమతం నాటిదీ, నేటిదీ నా? వైదికమతంలోని కొన్ని మర్యాదలను ఛిన్నాభిన్నంచేసి బౌద్ధం అవతరించింది. సువ్యవస్థితంగా సాగే దేశాన్ని అవ్యవస్థితం చేసింది బౌద్ధం. ఏవో అవకాశాలు కల్పించామంటారు. అవి మతప్రచారానికీ, వ్యాప్తికీ మాత్రమే.

ధర్మ: నాయనా! ఆవేశపడకు. ప్రతిమతం ఆదిలో అటువంటి కార్యక్రమాలు కొన్ని సాగిస్తుంది. ఈ నిఖిలపురాణ రచన ఏమిటి? నువ్వు ఆరాధించే రామాయణం

అశ్వ: ఆచార్యా, రామాయణం సౌందర్య సంశోభితమయిన మహాకావ్యం. జడ, చేతన ప్రకృతి మహాకవి లేఖిని ముందర ప్రాంజలిబద్ధయై నిలబడది. అది మహాకావ్యం.

ప్రభా: మహాకవీ! ఆచార్యుల అభిప్రాయాన్ని అవగతం చేసికోవటానికి యత్నించండి.

అశ్వ: ప్రభా! ఈ విహారంలో ఇంకెంతసేపో ఉండలేను. నాలో నిద్రాణమైఉన్న దార్శనిక శక్తులు జాగృతమవుతున్నవి. వద్దు. ఈ హేతువాదంతో సౌందర్యమయమయిన ప్రకృతిని పరిశీలించి విహ్వలభావాన్ని ప్రబోధించలేను. నడు.

ధర్మ: సంఘం శరణం గచ్ఛామి. నాయనా! మనం నివసించే ఈ ప్రపంచంలోని మానవుల వేదనలనూ, పరిదేవనలనూ వింటూ విననట్లు నటించి సర్వప్రకృతి సమ్రాట్టుల, కవిసమ్రాట్టుల విలాసంకోసం విహరిస్తున్నదనుకోవటం క్షంతవ్యంకాదు. చూడు......

అశ్వ: వద్దు ఆచార్యా, మీ ధర్మబోధ నాకు వద్దు. ఇప్పటికే నాలోని కావ్యదృష్టి పోతున్నది. ఔపనిషదమయిన తాత్త్వికదృష్టి నాకు తెలీకుండా నన్ను వెన్నాడుతూనే ఉంది. చెప్పకండి ఈ చరాచరజగత్తు ఏ మహామహుడి, ఏ విరాణ్మూర్తి లీలావిలాసంగానో ఊహ చేసిన ఆర్షసిద్ధాంతాన్ని విచ్ఛిన్నం చేయకండి. మానవజీవితంలో సుఖ, సంతోషాలను శాంతినీ మనం ప్రవేశపెట్టలేం. వదిలేయండి. రా! ప్రభా! పోదాం. అదిగో, సరయూసైకతసీమ నీ మృదుపదపద్మాలను ముద్దుగొనాలని ఉవ్విళ్ళూరుతోంది. లే.

ప్రభా: మహాకవీ! ధర్మసేన ధర్మాచార్యా ప్రణామాలు.

ధర్మ: వెళ్ళిరా అమ్మా! మహాకవి తిరిగివస్తారు. తప్పదు ఆయన దార్శనికుడవుతాడు.

ప్రభా: మహాకవీ!

అశ్వ: ప్రభా!

ప్రభా: అదిగో చంద్రోదయ మవుతున్నది. సరయూసైకతతలాలు నన్నాహ్వానిస్తున్నాయి. ఆనందోద్వేగసముల్లసితములయిన నదీతరంగాలు నన్ను కౌగిలించుకోనేందుకు ఎదురుచూస్తున్నాయి.

అశ్వ: నా అదృష్టలోకేశ్వరీ! ఊర్వశీ...

ప్రభా: ప్రభూ! మీరు ప్రాపంచికతుచ్ఛ సుఖాలలో...

అశ్వ: ప్రభా! సుఖ, దుఃఖ ద్వంద్వాత్మక మయిన ఈ ప్రపంచంలో ఉన్నంతకాలం మనం అనుభవించగలిగిన సుఖాన్ని అనుభూతం చేసికోవాలి. పునర్జన్మలోకూడా ఈస్మృతులు మనలను వెన్నాడి సంతృప్తి కలిగించాలి. ఈ మధురయామినీసుషమా సుధాపూర్ణజ్యోత్స్నలలో, ఈ ప్రశాంతనదీపులిన సీమలలో......

ప్రభా: మహాకవీ! మీరు ఒక్కవిషయాన్ని గురించి ఎప్పుడూ ఆలోచించటంలేదు.

అశ్వ: స్వర్ణసుందరీ! నేనెప్పుడూ ఒక్క విషయమే ఆలోచిస్తాను, నీసమక్షంలో.

ప్రభా: మీరెప్పుడూ నా సమక్షంలో నే ఉండరు.

అశ్వ: అసంభవం ప్రభా!

ప్రభా: మహాకవి సమ్ముఖంలో ఊర్వశి అసంభవాలను సంభావించలేదు ప్రభూ!

అశ్వ: ప్రభా! చతుర్దశ భువనాలూ ఏకమై వచ్చినా నిన్ను నానుండి వేరుచెయ్యలేవు. ఏదీ నీసుందర మందహాస రస నిష్యంద...

ప్రభా: ప్రభూ! ఇక్కడికి రాబోయేముందే అమ్మగారు కబురుచేస్తే...

ప్రభా: సాకేతనగర విప్రపురంధ్రీ చూడామణి సువర్ణాక్షికి అభివాదాలు.

సువర్ణాక్షి: కోడలా ఆశీర్వాదాలు. ఇలా

ప్రభా: ధన్యాహం.

సువర్ణాక్షి: సంబోధనలూ, సమ్మానాలూ కార్యసాధనకేకాని యథార్థసూచకాలు కావమ్మా!

ప్రభా: ఆఁ!

సువర్ణాక్షి: నీ కిదివరకే తెలిసిఉంటుంది. సాకేతనగరశిక్షాస్మృతిని పరివర్తించగల శక్తిశీల ఒక్క సువర్ణాక్షిమాత్రమేనని......

ప్రభా: రాగిణీ! నాకేమిటో భయంగాఉంది. అమ్మగారికి సమాధానం చెప్పు.

రాగిణి: మాతృశ్రీ సువర్ణాక్షిసముఖంలో యావద్భారతం నతశీర్షంతో...

సువర్ణాక్షి: కాదు రాగిణీ! ఈరోజున భూదేవసామ్రాజ్ఞి సువర్ణాక్షి ఒక యవనకన్యముందు తన చేతులు జోడించి, శిరసువంచి...

ప్రభా: మాతృశ్రీ! (బెదురు)

రాగిణి: అమ్మగారూ! (చలించి)

సువ: ఔను రాగిణీ! సువర్ణాక్షి నేత్రాలలోని దివ్యదీప్తి యథాపూర్వం ఉండగా, ఆ రోచిఃపుంజ ప్రాంగణంలో ధర్మచ్యుతి కావటంకన్న...

రాగిణి: అమ్మా! మీ అంతరంగంలో అంకురించబోయే ఆజ్ఞను కూడా ఆచరించటానికి సిద్ధంగా ఉన్నాం.

సువ: ఆజ్ఞకాదిది రాగిణీ! అభ్యర్థన. అరవై శరత్పూర్ణిమలను ఆహరించిన ఈ సువర్ణచేలాంచలం నీముందు చీకటిని క్రమ్ముతూ ముందుకు వస్తున్నది.

ప్రభా: రాగిణీ! మాతృశ్రీ భావం...

సువ: ప్రభా! సువర్ణాక్షి జీవితంలో ధర్మచ్యుతిని తన తీక్ష్ణనయనద్యుతులతో, అరుణారుణ రేఖలతో అపవారించింది. కాని...

ప్రభా: మాతా! ఇప్పుడూ మీరు...

సువ: అమ్మాయ్, కన్నకొడుకుకోసం కొంగు చాచుతున్నాను. ఆ ప్రతిభాసంపన్నుము న్మేషం మలిన విలాస విహారాలలో...

ప్రభా: అమ్మా, అర్థమయింది.

సువ: రాగిణీ, ధర్మచ్యుతి కిక్కడ ప్రసంగం లేదు. నాకు తెలుసు—దేశం కాలానుగామియై, బౌద్ధప్రబోధిత మవుతుంది. అందుకు నేను చింతించను. కాని అశ్వఘోషుడు అమరకీర్తిని సాధించాలి. ప్రభా! సువర్ణాక్షిసూనుడి అంతేవాసివై భరతశాస్త్రాన్ని అభ్యసించిన నీకు కర్తవ్యం తెలిసిఉంటుంది.

ప్రభా: అమ్మా! అశ్వఘోషమహాకవి రస తరంగిణిలో నేనొక బిందువునైపోతానని వాగ్దానం చేస్తున్నాను.

రాగి: ప్రభా! (బెదురు)

*　　*　　*　　*

అశ్వ: ప్రభా! ప్రభా! ఎక్కడికా పరుగు. వెళ్ళకు. వెళ్ళకు. పరుగెత్తకు ప్రభా! ఆవైపు మొసళ్లు ...మొసళ్లు...ప్రభా! ప్రభా!

(నీటిలో ధ్వనులు)

ధర్మ: అశ్వఘోషమహాకవీ!

అశ్వ: ప్రభా! ప్రభా! ఎవరిది! బౌద్ధభిక్షువులా స్వామీ......మీరంతా నన్నూ, నా ప్రభనూ వేరు చేశారా స్వామీ!

ధర్మ: మహాకవీ! క్షణికమయిన ఈ ప్రపంచంలో ఒకరినొకరు ఏమీ చెయ్యరు.

అశ్వ: స్వామీ! మీరు ధర్మబోధ చేస్తున్నారు. ప్రయోజనం లేదు.

ధర్మ: ప్రభాదేవి అంతిమసందేశం...

అశ్వ: ఆఁ! నా ప్రభ అంతిమసందేశమా!!

ధర్మ: ఔను నాయనా!

"బుద్ధం శరణం గచ్ఛామి"

ఇదే ఆమె అంతిమసందేశం.

అశ్వ: అంతేనా, స్వామీ! అంతేనా. నాకు తెలుసు. ఎప్పుడూ అంటూనే ఉండేది. ప్రభా! నీ అంతిమసందేశాన్ని అక్షరాలా ఆచరించి ఈ విశ్వ మానవప్రపంచాన్ని నా కవితావాహినిలో ఓలలాడిస్తాను. నాదార్శనిక నౌకపై తరింపజేస్తాను. ధర్మ సేనాచార్యా, ఇప్పించండి ధర్మదీక్ష.

ః: బుద్ధం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి.

# * వాఘీర *

## శ్రీ బొడ్డు బాపిరాజు

★ ★ అటుకొండా, యిటుకొండా — మధ్య చక్కని లోయా — లోయలో తీయని పాటలు పాడుకొంటూ కదలిపోయే అందాల సెలయేరు — దానిపేరు వాఘీర ★ ★

శ్రీరిమురి జాల్వారెడి నీ
యరవిరి కెరటాల నిగ్గుటద్దములోనఁ
జెరగిన పూర్వపు టందము
లరసి యజంతా తపించునటె వాఘీరా?

పచ్చని కొండలోయ బడివచ్చిన వెన్నెలవెల్లువేమొ! నీ
యచ్చపు సోయగమ్ము హృదయమ్ములకున్ గిలిగింత పెట్టగా
గ్రుచ్చి కవుంగలించెదవొకో, మముబోటి కళాప్రవాసులన్
ముచ్చట దేల్చు క్రొత్తరగ ముత్తెపు పయ్యెద పూలగాలులన్!

అమృతపు జల్లు లీయలల యున్నవకిన్నెర లాలపించు గా
నము లవి, మాచరిత్రలకు నందని కాలపుకంచుకోట ద్వా
రములను వ్రేల్ శతాబ్దపు తెరల్ తొలగించుచు ఏమహాద్భుతా
ర్థములు కథానిధానము లుదారత మాకయి వెల్లడించునో!

ఇది తథ్యంబటె? ఇట్టి కారడవిలో నీకొండ కే భాగ్యమో!
పది నూరేడులు - శాతవాహన నృపుల్ ప్రారంభకుల్‌గా - కళా
విదు లిందెందరొ జీవితమ్ములు సమర్పింపన్, జగత్కీర్తికిం
గుదురై వెల్గినదంట; ఎవ్వరిక సాక్షుల్ నీవు గాకున్నచో?

అనుపమ బుద్ధగాథలు గుహాంతర భిత్తికలందు చిత్రలే
ఖనముల తీర్చు పట్టున నిగారపు కుంచెలరంగు లీ తటో
ర్విని విదలించియుండెదరు లే; అటుగాక, విచిత్రవర్ణధా
రణ హృదయంగమమ్ము లెటులయ్యెడి నిచ్చటి గడ్డి పువ్వులున్ !

ఈ తీరమ్ముల ధ్యానముద్ర గొనిరో, ఏ భిక్షువుల్ నిర్మల
ప్రాతస్సంధ్యల; ఏకళావ్రతులు సంభావించిరో యీధరా
జాతచ్ఛాయల గోష్ఠు; లే కులపతుల్ శ్రద్ధాళులౌ శిష్య సం
వ్రాతంబున్ చదివించిరో, సుగతధర్మం బీశిలాపాళి; సం
పూతం బిందు వెలుంగు ప్రత్యణువు చెప్పున్ పూర్వభోగస్మృతుల్!

స్వాంతము లేలు దివ్యరసభావసమన్విత నూత్నశైలి వె
స్సంతర భూవర ప్రముఖ జాతకగాథలు తీర్చు తద్గుహా
భ్యంతర శిల్పిలోకము, శ్రమాపనయ ప్రియవృత్తివై సమ
ర్చింతువె శీతలానిల పరీమళకోమల చాలనమ్ములన్ ?

వెలుగుల్ దూరని యా గుహాంతరములన్ విన్నాణముల్ దేల మేల్
జిలుగుం గ్రొన్నగిషీపనుల్ సలిపినా; రేధాతు సంపాదితం
బులొ తద్వర్ణ సముచ్చయంబులు! శతాబ్దుల్ దాటినన్ నేటికిన్
తళుకుల్ మాయవు, నీ వెరుంగుదువు గాదా తల్లి! తత్ప్రక్రియల్

కలగు నెడంద, చెమ్మగిలు కన్నుల, చెన్నరియున్న యీ గుహా
వళుల నపూర్వ చిత్రవిభవమ్మును - అక్షయ శిల్పసంపదన్
పులకలు దేర గన్గొనుచు పొంగిన తీవ్రవిషాదభావనల్
నిలుపగ దర్శకావళికి నిల్తువొ నీవొక సాంత్వనమ్ముగా !

శరదిందుద్యుతులందు స్నిగ్ధసికతాశయ్యాసుఖాసీనులై
గురువుల్ శిష్యుల కద్భుత ప్రభుకథా గూఢార్థముల్ దెల్పుచో
నురువీచీకలనాదమంజులముగా నూకొట్టుటల్, లేవు నే
డరమోడ్పుం గనుదమ్ములన్ వినెడుభాగ్యంబుల్ - నదీసుందరీ !

అలనా డీగిరిరాడ్గుహాంగణములం దాచార్యులున్ ఛాత్రులుం
బలుకన్ ముక్తగళమ్మునన్ త్రిశరణధ్యానంబు లాశాంచలం
బుల మార్మ్రోగిసిన వార్తలెల్ల కలలైపోవన్, నిరాశాసమా
ధుల నిద్రించెడి యద్రిరాజు గని, నీ దుఃఖమ్ము నూహించెదన్.

కరుణామూర్తి తథాగతుం డరయడో గర్భాలయం బందు సు
స్థిర పద్మాసనయోగ నిద్రగొని; సందేహింతురో, మేలుఁకొ
ల్పరుపో స్వామిని పద్మపాణి ముఖు లాద్వారస్థితుల్; నీవదే
గురిగా గొంతు పెకల్చి దుర్విధికి నాక్రోశింతువా రేబవల్ !

అలిగిన శిల్పి తిట్టుకొనెనా - నరపాలుర భావశుద్ధియే
తొలగెన - ధూర్తభిక్షువుల దోషము కొట్టెన - ధర్మదేవతా
నిలయము లివ్వి పాడుపడ నేటికి? శాపవిమోచనమ్మునుం
గలుగదె? సర్వముం దెలియగా వినిపింపు మజాంతవృత్తముల్.

అచ్చట కృష్ణవేణి; మధురాకృతి నిచ్చట నీవు, లోకముల్
మెచ్చగ శిల్పలక్ష్మికిని మేడలుకట్టిరి, మీ ఋణమ్ములే
మచ్చున తీరు? కస్తురి ఘుమంఘుమ లార్చు కళాచరిత్రలో
జెచ్చెర తమ్మి పుప్పొడి రచింతురు నిన్నల యొజ్జబంతిగన్ !

బ్రదికిచెడినట్టి సౌగతాశ్రమపదమ్ము
లివి యజంతాద్రు; లిచటి సాహిత్యమునను
విడిచి చనలేవు, చిరతపస్వినివి నీవు,
దేవి వాఘీర! మా స్ఫూర్తిదీపశిఖవు !

పెద్ద కథ

# * శిశిరవసంతాలు *

## శ్రీ పంతుల శ్రీరామశాస్త్రి

### :వసంతం:

అది ఇరవయ్యో శతాబ్దపు మొదటి దశాబ్దపు చివరి సంవత్సరాది. గోదావరీ కృష్ణలంత గొప్పనది కాకపోయినా, వేసవికాలంలో కూడా నీటికి లోటులేని ఒక చిన్న నది. దాని సమీపంలో ఒక తోట—సపోటా జామి మొదలయిన ఇతర జాతుల చెట్లు కూడా లేకపోలేదు గాని, ఎక్కువగా ఉన్నవి మామిడిచెట్లు కాబట్టి మామిడితోట అనవచ్చును. చుట్టూ జీడిమామిడి చెట్లున్నాయి; వాటికి వెలుపలగా కంచె ఉంది. కాని, దానిగుండా దారులు కూడా చాలానే ఉన్నాయి.

తోటలో ఒకమూలగా పెద్దమామిడి చెట్టొకటుంది. అది పళ్ళకంటె పిల్లలు కోతికొమ్మచ్చి ఆడుకోందికే ఎక్కువగా ఉపయోగపడుతూంది. ఆ చెట్టుకి భూమికి సమాంతరంగా చాలాదూరం సాగిపోయే కొమ్మ ఒకటి ఉంది. ఆ కొమ్మమీద నేలను పరుగెత్తినంత జోరుగానూ పరుగెత్తగలరు ఆటలాడుకొనే కుర్రవాళ్లు—తోటంతా నిర్మానుష్యంగా ఉంది, ఆ కొమ్మమీద కూర్చొని ఏమిటో తీవ్రంగా చర్చిస్తున్న ఇద్దరు కుర్రవాళ్ళను తప్పిస్తే.

"ఏమిరా కృష్ణా! ఇవాళ పండుగరోజు కూడా కదా, ఎందుకు సరదాగా లేవు?"

"ఏమిటో రా యాజులూ! నాకేమిటో చాలా చికాగ్గా ఉందిరా!"

"నువ్వే ఇలా అంటే మరి మా మాటేమిటంటావురా కృష్ణా! మీ అమ్మ నిన్నేమీ అనదు; మీ మామయ్యయినా ఎప్పుడేనా కేకలు వేస్తాడుతప్ప నిన్ను కొట్టడు. మాకయితే ఎప్పుడో ఒకనాడు తప్ప రోజూ తాళాధ్యాయం అవుతూనే ఉంటుంది; ఇక మన కుర్రజట్టంతా నీమాట కాదనరు."

"అదికాదురా యాజులూ! నాకసలు ఈ ఊళ్లో ఉండడమే ఇష్టంలేదురా!"

"నాకూ ఇష్టంలేదు రోజూ పెద్దవాళ్ల చేత దెబ్బలూ తిట్లూ తింటూఉండడం. కాని మరేం చెయ్యగలం? తప్పదు."

"ఏం, ఎందుకు తప్పదు? ఎక్కడికయినా పారిపోతాము. ఆ తరవాత...

"అసలు ఎలా పారిపోతాముగా! పారిపోతే మటుకు మనవాళ్లు వెతికించి పట్టుకోరా? అసలు రైలెక్కడానికి టిక్కట్టుండాలి, దానికి ఎంతో డబ్బవుతుందిట."

"అదంతా నాకు తెలుసునురా! మనకి ధైర్యం అంటూ ఉండాలిగాని డబ్బులేకపోయినా బాధ లేదు."

"నీమాట కాదనను గాని కృష్ణా! చూడు, మనం ఎలాగోలాగు పారిపోతామనుకో! ఆ తరవాత చేసేదేమిటి? అక్కడ మనకు అన్నం ఎవడు పెడతాడు? ఇక్కడ మనవాళ్లు ఎంత తిట్టినా మూడుపూటలా అన్నం పెడతారు."

"ఎప్పుడో పెళ్ళిళ్ళకి తప్ప పైఊరు వెళ్ళలేదు గనక నీకు ఊళ్ళో తప్ప మరెక్కడా ఎవ్వరూ బ్రతకడం లేదనిపిస్తుంది. అక్కడ పట్నంలో, మా నాన్నగారు బ్రతికిఉన్నప్పుడు మా యింటికి ప్రతి ఆదివారం సుబ్రహ్మణ్యం అని ఒక కుర్రవాడు భోజనానికి వచ్చేవాడు. వాడికి అప్పుడు పన్నెండు పదమూడేళ్ళకంటె ఎక్కువ ఉండవు. వాళ్ళమ్మ నాన్నా చిన్నప్పుడే చచ్చిపోయేరట! మరెవళ్ళు బంధువులుకూడా లేరట. ఒక్కడూ పట్నంలో ఉండి వారాలుచేసుకొంటూ చదువుకొనేవాడు. ఈపాటికి చాలా పెద్ద చదువులోకి వెళ్ళిఉంటాడు."

"అయితే మరి పట్నంలో పెద్దవాళ్ళ పూచీ లేకుండా మనం ఇంగ్లీషుచదువు చదువుకోవచ్చునన్నమాట! ఏమో నాకు భయంగా ఉందిసుమా! ఇక్కడ మనం ఏదో చదువుకొంటున్నాముకదూ?"

"ఈ సంస్కృతంచదువు నాకేమీ ఇష్టం లేదుసుమా! అందులో మా మామయ్య మూడునాలుగు రోజులు ఏ చదువూ లేవన్నే తన పనులమీద తోను తిరుగుతాడు. ఏవో ఒకనాడు తనకేపనీ లేనినాడు పట్టుకొని పాతశ్లోకాలన్నీ అప్పజెప్పమంటాడు. ఎంత బాగా చెప్పినా ఇంకా ఏవో తప్పులున్నాయనే అంటాడు. చెప్పినప్పుడు తనకి ఎక్కడలేని తొందరాగాని ప్రశ్నలడిగినప్పుడుమాత్రం తప్పులు పట్టడానికే చూస్తాడు."

"ఇంకా నయం, నువ్వు తెలివయినవాడివి. నీకు ఒక్కమారు చదివితే వచ్చేస్తుంది. నీమీద ఎప్పుడయినా కేకలు వేస్తాడుగాని కొట్టడు; మాకయితే ఇంట్లోనూ దెబ్బలే, పాఠశాలలోనూ దెబ్బలే."

"అన్ని దెబ్బలూ తిట్లూ తింటూనంటావుగాని ఇక్కడనుంచి మరెక్కడికయినా పోయి హాయిగా ఇంగ్లీషు చదువుకుందామంటే నీకిష్టంలేదుకదా!"

"ఇష్టంలేక కాదురా కృష్ణా! భయం! మనవాళ్ళూరుకుంటారా? దొరికిపోయేమంటే ఆ తరవాత ఇప్పటిలాగ తిరగనివ్వరుకూడా. ఎప్పుడూ మనమీద ఒకకన్ను వేసేఉంచుతారు."

"నీ యిష్టం. నేనుమటుకు ఇక్కడ మరి ఉండదలుచుకోలేదు. అప్పుడు మా నాన్నగారు పోయాక మా మామయ్య మాటలు విని మా అమ్మ ఇక్కడికి వచ్చేసిందిగాని నాకేమీ ఇష్టంలేదు. మా అమ్మ ఇక్కడి మామిడితోటలగురించి పొలాలగురించీ ఎంతో ఇదిగా చెప్తే, సరదాగానే ఉండేది కాని, ఆ ఊరు విడిచిరావాలని లేకపోయింది. మొన్న మా మామయ్య మా అమ్మతో అంటూంటే విన్నాను. అక్కడ మా యిల్లు అమ్మేసి, ఇక్కడ భూమి కొనేస్తాడట."

"అవున్రా, నేనూ విన్నాను, మీ మామయ్య సుబ్బారాయుడుగారి భూమి కొనడానికి బేరం చేస్తున్నాడట."

"ఈ ఊరు రాగానే కృష్ణమూర్తిఅని చక్కగా ఉన్న పేరుని మార్చి కృష్ణశాస్త్రి అని పెడతానన్నాడు మా మామయ్య. మా అమ్మ కాదంటే కృష్ణమూర్తిశాస్త్రి అని మార్చేడు. చొక్కాలు లాగూలు తొడుక్కుంటే బాగుండదట. గావంచాలు కట్టుకోమంటాడు. వచ్చే ఏడు వాళ్ళ కామాక్షికి నాకూ పెళ్ళి చేస్తాడట. నాకు కామాక్షంటే అసహ్యం, పెద్ద పళ్లూ అదీని, ప్రతిదానికీ బోరుమని ఏడుస్తూ ఉంటుంది. అంతకంటె చిన్నదయినా మీ సరస్వతి ఎంతో బావుంటుంది. చక్కగా మాట్లాడుతుంది. ఏదయినా చెప్తే వింటుంది. అంతేగాని ఎవరి చేతిలో ఏది కనిపించినా తనకే కావాలనడమూ, అమ్మా చూడే అని ఫిర్యాదు చెయ్యడమూ అదేమీ లేదు కామాక్షిలాగ!"

"మా సరస్వతికీ అప్పుడే పెళ్ళిమాట లవుతున్నాయి. మొన్నను ఆమధ్యను అంతా నిశ్చయమయిపోయిందనుకొన్నారు. మళ్ళీ ఎంచేతో, వాళ్ళు మొదట ఒప్పుకొన్నకంటె తక్కువ డబ్బిస్తామన్నారు కాబోలు, తప్పిపోయింది అసలు మా పెద్దనాన్న ఉద్దేశం మా సరస్వతి పెళ్ళితోటే నా పెళ్ళి కూడా చేసెయ్యాలని."

"అంతేన్రా, ఇక్కడిలా ఉంటే, మనకి దెబ్బల పెళ్ళి తప్పదు; నిజం పెళ్ళి తప్పదు."

"దెబ్బల పెళ్ళంటే భయం గాని, అసలు పెళ్ళికేవిఁరా బాజాభజంత్రీలు వస్తాయి; పల్లకీలో ఊరేగిస్తారు; కొత్త బట్టలు వస్తాయి; ఇంట్లో పెళ్ళి అవుతుందంటే ముందు నెల్లాళ్ళూ తరవాత కొన్నాళ్ళపాటూ పెద్దవాళ్ళు మన చదువు ఊసు ఎత్తరు. హాయిగా తిరగొచ్చును."

"నీ మొహం పెళ్ళంటే అంతే అనుకొన్నావేమిటి?"

"అంతే కాదురా, పెళ్ళాం వస్తుంది. పెళ్ళికూతురంటారే, అదే పెళ్ళాం. పెళ్ళాన్ని మొగుడు తిట్టినా, కొట్టినా ఏంచేసినా ఎవ్వళ్ళూ ఏమీ అనరు; అసలు పెళ్ళామే మొగుడు ఏం చేసినా మారుమాటాడకూడదట. ఇంకా పెద్దపండుగలకి అత్తారింటికి వెళ్ళొచ్చును. అత్తారింట్లో అల్లుడికి ఎంతో మర్యాద చేస్తారు; మా చిన్నబావ వచ్చేడంటే పట్నంనించి ప్లీడరుగారు వచ్చినప్పుడు చేసినంత మర్యాదా చేస్తారు."

"అది కాదురా, చిన్నతనంలో పెళ్లి చేసుకోడం మంచిది కాదుట, మా నాన్న మా అమ్మతో అంటూఉండేవారు. చిన్నప్పుడే పెళ్ళి చేసుకొంటే చదువు బాగా రాదట!"

"నామటుకు ఈ చదువు మానేస్తేనే బాగుండేట్టుంది సుమా!"

"మరయితే ఇంగ్లీషు చదువుకోవాలని లేదూ?"

"ఉంది కాని, ఎలాగ? మా వాళ్లు పంపరు. దొంగతనంగా పారిపోయి, దొరికిపోయేమంటే చంపేస్తారు."

"అసలు నీకు నిజంగా రావాలని లేదు. ఉంటే ఇన్ని అనుమానాలెందుకు? తరవాత సంగతి అటు నించి నరుక్కురమ్మన్నాడు. ఈ రాత్రే మనం బయలుదేరిపోవాలి. నేను మీయింటిదగ్గర పడుకొందికని చెప్పివస్తాను. ఇద్దరం వీధి అరుగుమీద పడుకొన్నట్టే పడుకొని, అందరూ నిద్రపోగానే బయలుదేరేమంటే రెండుగంటల్లో స్టేషను వెళ్ళిపోగలము. రాత్రి బండీ ఎక్కిపోయి, మీద బల్లమీదికి ఎక్కి పడుకొన్నామంటే తెల్లవారేదాకా అడిగేవాడుండ:"

"రైల్లో టిక్కట్లుమానే ఇనస్పెక్టరుండడురా"

"ఉంటాళ్లేగాని రాత్రంతా వాడికిదేపనా? అయినా కావాలంటే మనం ఈ పక్కస్టేషనుకే టిక్కట్టు కొనుక్కొంటాము. అదంతా నీకెందుకు? నీకే భయంలేకుండా మానే పూచీ నాది. ఏం, ఇష్టమేనా? ఏమంటావు?"

"రాత్రి భోజనమయ్యాక నువ్వు మాయింటికి వస్తావుకదూ!"

వస్తాన్లేగాని, నువ్వు వచ్చేమాటైతే, నీపక్కలోనే మరొకచొక్కా లాగూ గావంచా ఉంచుకో. చొక్కా లాగూమీదే మరొకజత తొడిగేసుకొన్నామంటే ఇవి ఉతుక్కుంటే అవి కట్టుకొందికి అవి ఉతుక్కొంటే ఇవి కట్టుకొందికి పనికొస్తాయి. గావంచాఉంటే ఎక్కడపడితే అక్కడ హాయిగా స్నానం చెయ్యొచ్చును.

"మరయితే చీకటి పడుతున్నట్టున్నాది; ఇళ్లకు పోదామా?"

"సరే, పద, కాని, జ్ఞాపకం ఉందికదూ!"

*   *   *   *

ఒక నిమిషంకంటె ఎక్కువగా రైలాగని చిన్న స్టేషను: ఆ ఆగిన ఒక్క నిమిషంకూడా అనవసరమే అనిపిస్తుందప్పుడప్పుడు. ఎక్కేవారుగాని దిగేవారుగాని పగటిబండికే క్వాచిత్కంగా ఉంటారు. రాత్రి బండిలో మనుష్యులు దిగడమన్నా, టిక్కట్లు చెల్లడమన్నా పెద్ద విశేషమే. నాటిరాత్రి సర్వసన్నాహాలూ చేసుకొని వచ్చిన ఇద్దరు బాల ప్రయాణికులు లేకపోలేదు. కాని, స్టేషనులెక్కల్లో వారు ప్రయాణికులు కారు. అంతేకాదు, ఆ ఉన్నపాటి స్టేషను ఆవరణాన్ని వారు వినియోగించుకోలేదు. స్టేషనుకి దగ్గరలో ఎవరిదో పాడుబడిన ఇల్లొకటి ఉంది. ఆ యింటి అరుగే వారి వెయిటింగు రూము.

రైలు, చాలాదూరంలో ఉండగానే వెలుగు కనిపించింది. "లేరాకృష్ణా! నిద్దరపోతున్నావేమిటి?" అన్నాడు సోమయాజులు.

"నిద్దరలేదురా, ఇంకా ఎక్కడ అది వచ్చేసరికి చాలాసేపు పడుతుందిలే. నువ్వేమీ గాభరా పడకు."

స్టేషనుకి అవతలి తట్టునుండి వెతకడం ప్రారంభించారు. ఒక పెట్టెకి గడియవచ్చింది కాదు. ఇంకొకదానికీ రాలేదు. కృష్ణమూర్తి తలుపుకి ప్రక్కనుండే గజం పట్టుకొని ఎక్కి కిటికీలోనుంచి లోపలికి దూకి, "ఎక్కురా గబగబ-రైలు కదిలిపోతుంది" అన్నాడు.

కిందనుండి యాజులు "నాకేమో భయంగా ఉందిరా" అన్నాడు.

"ఏం భయంలేదు. నే నెక్కినట్టే ఎక్కురా నా చెయ్యి అందిస్తాను"

"అదికాదురా; అసలు ఇంట్లో ఏమంటారో అని"

"మరయితే ఇంటిదగ్గరే ఉండక ఇక్కడిదాకా ఎందుకొచ్చావు?"

"తోటలోంచీ గోడ్డిలోంచీ నీకొక్కడికీ రావడానికి భయంకదా అని, ఇంద. ఈ దుప్పటీ గావంచా, ఈ చొక్కా లాగూ కూడా తీసుకో, భయంలేదు. మా చాకలిది పారేసిం దనుకొంటారు. రైలుకూసింది. ఇంద. మా చెల్లి సరస్వతికి మా పెద్దత్తయ్య ఎవ్వళ్లకీ తెలియకుండా ఇచ్చిందిట. మనకని ఇచ్చింది, రెండు రూపాయలు. మరి నేనుంటాను. మళ్ళీ నువ్వెప్పుడొస్తావో? మరిచిపోకు——"

*   *   *

ఎనిమిదిమార్లు ఋతుచక్రం పరిభ్రమించింది. వైశాఖమాసం, లెక్కకు వసంతర్తువయినా గ్రీష్మపు ప్రభావమే ఎక్కువగా కనిపిస్తూంది.

ఏరు సన్ననిపాయగా ప్రవహిస్తూంది——

తోట ఎప్పటిలాగే ఉంది. కాకపోతే కొన్ని మరీ ముసలిచెట్లు కర్రలకుగాను కొట్టివేయబడ్డాయి.

అక్కడక్కడ కొన్ని అంటుమామిడిచెట్లు తల లెత్తేయి. కాని, మూలగా ఉన్న పెద్ద మామిడిచెట్టు, భూమికి సమాంతరంగా సాగిన దాని కొమ్మ అలాగే ఉన్నాయి. ఆ చెట్టు అలా ఉండడమే, తోటలో ఏ మార్పూ లేదనిపించేలా చేస్తుందేమో.

సూర్యుడి వాలు కిరణాలుకూడా వేడిగానే ఉన్నాయి. అయితే చెట్టునీడని మాత్రం చాలా హాయిగా ఉంది. ఎండలో నడిచివచ్చిన శ్రమ నంతటినీ మరిపించేలా వీస్తుంది చల్లని గాలి.

ఆనాటి ఇద్దరు మిత్రులే ఈనాడూ మళ్ళీ కూర్చున్నారు. అయితే వాళ్ళతోపాటు దగ్గరలో ఒక పదహారేళ్ళ కుర్రవాడొకడున్నాడు, తాటి కాయలు కొట్టి అందిస్తూ—

కట్టుకొన్న పొట్టిచేతుల చొక్కా, సన్నని పంచా—ఆ రెండేకాదు—పాపిడి తీసి దువ్విన క్రాపింగు, కొత్తగా వస్తూన్న మీసమూ ఇవన్నీ కృష్ణమూర్తిలో పట్నవాసపు వాసనని సూచిస్తున్నాయి.

నేడు కాకపోయినా మరి పదేళ్లనాటికయినా యజ్ఞంచేసి పుట్టు సోమయాజులు కాడు, పెట్టు సోమయాజులు కావడానికి తగినట్టుగానే ఉన్నాది సోమయాజులు వేషం.

సోమయాజులు రెండే కాయలు తినేసరికి ఒక్కొక్క కాయకూడా తినలేకపోతున్నాడు కృష్ణమూర్తి. సోమయాజులన్నాడు. "ఇంతేరా, మీ పట్నంవాళ్ళు తక్కినవాట్లో మమ్మల్ని వెనక్కి నెట్టేస్తారుగాని తిండికిమాత్రం మాతో పనికిరారు" అన్నా

కృష్ణమూర్తి అన్నాడు: ఈ తాటికాయలు తినడానికి నేర్పుకావాలి; దానికీ అలవాటుండాలి; మరి పదిరోజులు పోయాక చూడు నువ్వు నాతో సమానంగా తినగలవేమో? అంతెందుకు, నీకనుమానంగా ఉంటే పందెంవెయ్యి, మనిద్దరిలో ఎవళ్ళెక్కువ లడ్డూలు—ఇక్కడ మనవాళ్లు సరిగా చెయ్యాలేరు కాబోలు—బూరెలయినా సరే, ఎవళ్ళెక్కువ తింటారో?"

"నువ్వా ఒకమాదిరిగా తింటావేమోగాని నాతో సమానంగా తినగలవా?"

"అదే గమ్మత్తు, ఒకమారిలాగే ఇరవై లడ్డులు తినడానికి పందెంవేసి అయిదురూపాయిలు గెల్చేను. మామూలుగా ఎక్కువగా తినాలని ఉండదు. కాని, మొండికెత్తి కూర్చున్నాక ఎన్నయినా తినొచ్చును."

"తినడమంటే జ్ఞాపకం వచ్చింది. మా సరస్వతి వాళ్ళ అత్తారింట్లో వెంకన్నగారని ఒకతను ఉన్నాడు. మనిషికూడా మంచి ఆజానుబాహువే. సంతర్పణ భోజనం అంటే అతనికి అధమం ఒక వంద బూరెలు కేటాయించవలసిందే. తద్దినానికి పిలిచినా అంతే, వంద గారెలకి లోటులేదు. కాని, మనిషి మంచివాడు, ఎవళ్ళో దగ్గర కూర్చొని తినాలని బలవంతంచేస్తే తప్ప, ఒకమారు వడ్డించినవాటితోనే చాలినట్టు లేచిపోతాడు. ఇక, ఊళ్లో ఎవరికి ఏ సాయం కావలసివచ్చినా కాదనడు. వాళ్ల ఊరుకీ స్టేషనుకీ పదిమైళ్ల పైగా ఉంటుంది. దారి కూడా అంత మంచిది కాదు. రాత్రి పూన్చినబండి తెల్లవారు జాముకిగాని చేరుకోదు. ఉదయానే రైలు. అయితే, బండి వెనకాతల కర్రపట్టుకొని వెంకన్నగారు నడుస్తున్నాడంటే మరి దొంగభయం లేదన్నమాటే...

"అయితే అప్పుడు నేను వెళ్ళిపోయిన తర్వాత ఎన్నాళ్లకయేయి మీ పెళ్ళిళ్ళు?"

"నువెళ్లిపోయేక మరొక పదినెల్లకే అయేయి."

"అంటే ఇప్పటికి ఏడేళ్ళన్నమాట? నీ కొడుకూ కూతురూ బాగున్నారు. నువ్వు చదువుకోకపోయినా నీ పిల్లలనయినా చదివిస్తావా? అంటే నా ఉద్దేశం ఇంగ్లీషు చదువు."

"ఇంకా ఏదీ వాళ్లు పసివెధవలు. ఏదో భగవంతుడి దయవల్ల వాళ్లు బ్రతికి బాగుండి పెద్దవాళ్లయితే అప్పటి మాటకదా! చదివించాలంటేమాత్రం, మనకి చిన్నతనంలో తెలియదుగాని, ఎంత శ్రమతో కూడుకొన్నపని, దానికి బోలెడు డబ్బుండాలి."

"ఉంటే డబ్బు ఖర్చుపెట్టుకొంటామంటే వద్దనడుగాని, డబ్బెమో ఎంతో అయిపోతుందనుకోకు. అసలు నా చదువుకి డబ్బెవడిచ్చాడు?"

"బాగుందిరా! అందరికీ నీ అంతటి తెలివితేటలూ పట్టుదలా ఉంటాయా? నువ్వుగనక మొదట్లో ఎన్ని ఇబ్బందులు పడినా కొసకి నెగ్గుకొచ్చేవు. అప్పుడు నేను నీతో బయలుదేరలేదుగాని, బయలుదేరినా వారం పదిరోజులకి బెంగపెట్టుకొని ఇంటిముఖం పట్టేవాణ్ణి అందుమూలంగా నీకూ చికాకు కలిగిఉండేది."

"ఏమో ఎందుకలా అనుకోవాలి? నువ్వు వాళ్లాగే కాదు, నాకంటె బాగా చదువుకొని ఉంటా వేమో!

"ఊఁహుఁ లేదురా, నా సంగతి నాకు తెలీదూ? కాకపోతే నువ్వు మొదట్లో ప్రవేశించావన్నావు చూడు. పూటకూళ్ళింట్లో వడ్డనపనికి. నేను ఆ పనిలో శాశ్వతంగా పడుగుకొని ఉండేవాణ్ణి; మహా అయితే కొన్నేళ్లకి వంటవాడుగా కూడా తయారవ గలిగే వాణ్ణి."

"అసలు నీకు ఇంగ్లీషు చదువుమీద, పట్నం బ్రతుకుమీదా మనసులోంచీ నిజంగా ఇష్టంలేదు. పోనీలే, నీ కిది బాగానేఉంది. నువ్వొక్కడివే పెళ్ళిళ్ళు చేయించేస్తున్నావుట? డబ్బుకూడా చాలా ఆర్జించేవట?"

"నువ్వంటే పెద్ద మెట్రికులేషను చదువుకొన్నావు గనక నెలకి ఏ యాభయ్యో వందో జీతం తేగలవుగాని, నాదీ ఒక ఆర్జనే? ఏదో కాలంలో సరిగా వర్షాలు పడి ఒక సంవత్సరం బాగా పండిందంటే మరి రెండేళ్ళపాటు పండకపోయినా బాధలేద నేపాటి గ్రాసం వస్తుంది. బట్టలకికూడా మా కిక్కడ ఎలాటివి కట్టుకొన్నా సరిపోతుంది. ఉప్పూ, దీపం పెట్టుకోందికి కిరసనాయిలూ తప్ప మరేమీ కొనుక్కో అక్కర్లేదు. అంచేత, పెళ్లిళ్లు పేరంటాలు చేయించిన బాపతు, మా పెద్దనాన్నగారు మంచంపట్టిన తరవాత కొన్నాళ్లు నాచేత పలుగురికీ, మందు లిప్పించేరు—ఆయన పోయినవెనక అదీ మనపరమే అయింది. అంతా ఇప్పటికి, ఈ సంగతి నాకూ నా భార్యకీ తప్ప, మా యింట్లో మరెవ్వళ్లకీ కూడా తెలియదు, ఎనిమిదివందల యాభైరూపాయిలయింది. మరొక్క ఏడాదిలో వెయ్యి పూర్తికావాలి. నేనంటాను, పొలం కొందామని. నా భార్య అంటుంది, కరణంగారిల్లులాగ ఎత్తుగా పెంకుటిల్లు కట్టుకొందాం, ముందు మిద్దెపడిపోతూ పడిపోతూ ఉంది" అని—నువ్వేమంటావు?"

"రెండూ మంచిపనులే. అయితే పొలమంటే దానికి మరి అంతు ఉండదు. అంచేత ముందు చక్కటి ఇల్లు కట్టుకొని, తరవాత పొలాన్ని విస్తరింపజెయ్యొచ్చును, ప్రస్తుతానికి ఎటువంటి లోపమూ లేదు గనక—

"బాగా చెప్పావురా!"

"నీ పని బాగానే ఉంది. చక్కగా రోజంతా ఏదో నీకు సరదా అయిన పని చేస్తున్నావు; ఊళ్లో పెద్దమనిషి వనిపించుకొంటున్నావు; అంతో ఇంతో ఆర్జించుకొంటున్నావు. మీ సరస్వతి సంగతే నాకు విచారంగా ఉంది. రెండవ పెళ్ళివాడి కిచ్చేరా?"

"రెండవ పెళ్ళి ఏమిట్రా మూడవ పెళ్లే. ఆ మొదటి సంబంధం కూతుళ్లూ కొడుకులూ దీనికంటె పెద్దవాళ్లు. రెండవ సంబంధానికి ఒక కూతురు. మూడవది ఇది, దీని కింకా పిల్లలు లేరు. అతగాడికి జలోదరం. మహా అయితే మరొకటి రెండేళ్ళకంటె ఎక్కువ జీవించడం కష్టం."

"అయితే మీవాళ్లు చూస్తూ—జూస్తూ అంత ముసలాడికి ఎలా కట్టబెట్టేరా?"

"ఏం చెయ్యమన్నావు? అదంతా మా పెదనాన్న చేసిన నిర్వాహకం. ఆయన ఉద్దేశం కుటుంబానికి లాభం చెయ్యడమే ననుకో. అవతలి వాళ్ళ ఆస్తినీ, మా కియ్యబోయే వెయ్యి రూపాయిలనే చూశాడు గాని, మరేమీ చూడ్లేదు. మీ మామయ్య కూడా తక్కువ తిన్నవాడు కాదు. తనకి బోలెడు ఆస్తి ఉండగా తన కూతురు కామాక్షిని ఒక రెండవ పెళ్ళివాడి కిచ్చి పెళ్ళిచేసేడు. లెక్కకేమో రెండవ పెళ్ళివాడు గాని, మా బావగారికంటె కూడా పెద్దవాడు కాని మీ మామయ్య అనుకొన్నట్టే అయింది. పెళ్లయిన ఒక్క కూతురూ అత్తారింటికి పోయింది. కామాక్షికి ఒక కొడుకుకూడా పుట్టేడు. ఆతర్వాత కదా అతను పోయాడు. ఆస్తంతా దక్కింది."

"ఆ డబ్బుగర్వానికి తోడు, మా మామయ్య పోవడంతో కామాక్షి కిప్పుడు పట్టపగ్గాలు లేకుండా ఉన్నాయి. దీని వెధవ అధికారం అంతా ఎప్పుడూ ఎవరి గోలా అక్కరలేని మా అమ్మమీద ఆరంభం అయింది. మరిక్కడ అట్టేకాలం మా అమ్మని ఉంచను. ఈసూరు వెళ్ళగానే ఏదో ఉద్యోగంలో ప్రవేశించి మా అమ్మను తీసుకొని వెళ్లిపోతాను. నాకు గాని రావడానికి వీల్లేకపోతే, నీ పేర ఉత్తరం రాస్తాను; మా అమ్మను తీసుకొనివచ్చి దిగబెట్టేస్తావు కదూ; మరేం భయపడకు, రైలు ఖర్చులు నేనిచ్చేస్తాను."

"ఓస్! ఏమిట్రా! కావలసినవాళ్ళ దగ్గర డబ్బు మొగం చూసుకొంటా ననుకొన్నావా? నీకు గాని ఉద్యోగప్రయత్నానికి అవసరం ఉంటుందంటె ఏ యాభైయ్యో పట్టుకెళ్లు; మరొకళ్ళ ప్రాధేయం లేకుండా ఇవ్వగలను."

"నువ్విస్తానన్నదే పదివేలు. అంతగా అవసరం వస్తే అలాగే తీసుకొంటాను. అప్పుడు వెళ్లేటప్పుడు

మీ చెల్లెలు సరస్వతి ఇచ్చిందని ఇచ్చావే ఆ రెండు రూపాయిలూ ఎప్పుడో ప్రాణావసర సమయంలో గాని ఖర్చు పెట్టకూడదనుకొన్నాను. ఇంకా ఉన్నాయవి నాదగ్గర. అవి ఉండడంవల్ల ఎప్పుడూ డబ్బులేక పోడం అంటూ ఉండదు. చాలాసార్లు అనుకొన్నాను! ఈసారీ రెండు రూపాయిల్లో అసలుం ఒకటిఅయినా ఖర్చుపెట్టక తప్పదని. కాని, అంతలోకే ఏదో సాధనాంతరం కనిపించేది. ఇకముందు కూడా అలాగే ఎందుకు జరగకూడదూ? సుబ్బిస్తా నన్నదికూడా వాడుకోకుండా నే గడిచిపోతే ఎంత మంచిమాట!"

"ఓస్, నే నివ్వగలిగే దెంత? అయినా నువ్వు కేప్పొద్దున్న ఏతాసిల్దారో, మాజిస్ట్రేటో అయిపోయా వంటే, అప్పుడు మేము దర్శనానికొస్తే ఎవరండీ, మీరు, ఏం పనిమీద వచ్చేరు, ఆఫీసుకే గాని, ఇంటికి రాకూడదని తెలియదూ అంటావు కాబోలు—"

"ఏమో, నా ముందు ముందు ఏమవుతుందో కాని, ముందు గుమాస్తాగా ప్రవేశించి పై అధికారులని మెప్పించుకొంటూ రావాలి, తరవాతిమాట దేము డెరుగును. మా మామయ్య ఇలా హఠాత్తుగా పోయి ఉండకపోతే ఇంకా పై చదువు చదివి ప్లీడ రవాలనుకున్నాను. బాగా చల్లబడినట్టుంది; వెళ్ళి మొగం కడుక్కొని నీటికిదగ్గరగా ఇసకమీద కూర్చుందాము"

"అలాగే పద."

*　　*　　*　　*

ఏమండీ సోమయాజు లున్నాడా?

ఉన్నారు రండి కూర్చోండి.

ఎందుకులెండి. నే నొచ్చానని చెప్పండి.

రారా, కృష్ణా వీధిలో నిలబడ్డా వేమిటి?

నాకేం మీ యింట్లో మొగమాటం లేదు గాని, నీ కిప్పుడేం పెద్దపని లేదుకదూ! అలా తోటవేపు వెళదామా?

అలాగే కానీ పద.

....................

అయితే ఏమిటి సంగతి?

సంగతికి ఏమీ లేదు, ఈ రాత్రిబండికే ప్రయాణం. నా పెట్టె పరుపు పట్టుకొందికి మనిషాకడు కావాలి.

సరే దానికేంలే గాని, ఇంకా మరొక నెల్లాళ్ళ పాటు ఉంటా నన్నావు?

నిజమే ఉంటా నన్నాను; కాని ఇప్పుడు పోతా నంటున్నాను. అలా వచ్చింది పరిస్థితి.

ఇంతలో అంతమార్పు కేమిటి కారణం?

చెప్పడానికి నాకు చాలా మొగమాటంగా ఉంది. అయినా నీకుగనక చెప్తున్నాను; కూడా అనకూడదు.

అసలు ముఖ్యంగా దానితో నే అనకూడదులే.

ఈమధ్యను కామాక్షి కాస్త ఒంటరిగా ఉన్న సమయం చూసుకొని, 'అయితే బావా! మీయింగ్లీషు చదువుకున్నవాళ్లు ఆడవాళ్లుకూడా మగాళ్లతో పాటు చదువుకోవాలంటారా అనీ, పెద్దవాళ్లయేక పెళ్లిళ్లు చేయాలంటారా అనీ, ఇంకా ధైర్యం చేసి అయితే వితవ్వాళ్ళు పెళ్ళి చేసుకోడంకూడా తప్పు లేదంటారా అనీ ఏవేవో ప్రశ్నలడగడం మొదలు పెట్టింది. నాకు దానితో మాట్లాడ్డం అట్టే ఇష్టం లేదు. కాని, అడిగినప్పుడు, అందులో సబబయిన ప్రశ్న అడిగినప్పుడు జవాబు చెప్పకుండా ఉండడ మెలాగ? ఏవేవో నాకు తోచిన సమాధానాలు చెప్పేను. వితంతూద్వాహంగురించి వీరేశలింగం గారి వాదం సారాన్ని బోధపరచడానికి ప్రయత్నించేను. అంతే, ఏదో ప్రశ్నకి పరీక్షలో సమాధానం చెప్పినట్టుగా. అంతేకాని, నాకు మరొక ఆలోచనేలేదు.

నిన్న రాత్రినుంచి ఇంగ్లీషునవల ఒకటి చదువుతూ పడుకొన్నాను. అది చదువుతూండగా రెండుమూడు మార్లు వచ్చింది. మంచినీళ్ళు కావాలా అని అడగడానికీ, రాత్రంతా మరి నిద్రపోదలచుకో లేదా అనీ, అంతలా దీపం దగ్గరపెట్టుకు చదివితే కళ్ళకి జబ్బు చెయ్యదా అనీ అనడానికి. అప్పటిమట్టుకు నే నేవో సమాధానాలు చెప్పానుగాని నాకొస్ఫురణేలేదు; నా మనసంతా పుస్తకంమీదనే. రాత్రి ఒంటిగంట దాటిఉంటుంది నేను పుస్తకం మూసి పడుకొనే సరికి.

నాకు తెలివి వచ్చేసరికి ఒళ్లు వేడిగా ఉంది; ఆమె ఒళ్లు వెచ్చగా తగుల్తూంది...అంతా ఒక కలలా అయిపోయింది—నిజంగా కలే అని నన్ను నేను నమ్మించుకోవాలని చూసేను. కాని లాభంలేదు. ఇవాళఉదయం పళ్లుదోముకొందికి పుడక ఇవ్వడం, మొగం కడుక్కొందికి నీళ్లివ్వడం, స్నానానికి నీళ్లు అమర్చడం అన్నిటిలోనూ ఏదో విశేషం కనిపించడమే కాదు, ఎవళ్లూ దగ్గరలేని సమయంచూసి, అదొక

మావైపిగా చూసి చిన్న నవ్వునవ్వింది. ఆ నవ్వును తల్చుకొంటే నాకు జాలీ, కోపమూ రెండూ కలుగుతున్నాయి. పాపం దాన్ని చూసి జాలిపడవలసిందే, కాని, నన్ను ఎందుకు దిగలాగాలి అని కోపం. చిన్నప్పుడంటే ఒకమాదిరి వికారంగా ఉండేదిగాని, ఇప్పుడు అవయవ పుష్టిలేకపోలేదు, అయినా ఏమిటో అదంటే నాకిష్టంలేదు. ఇక్కడనుండి మరి తప్పించుకోలేను. అందుచేతే ఈ ప్రయాణం. ఖర్చులకి ఒక పదిరూపాయిలివ్వాలిసుమా! రాత్రి రైలుకి నన్ను దిగబెట్టవూ?

అది నా విధి; ఖర్చులకో పదికాకపోతే పాతిక

## : గ్రీష్మం :

రాధా! అమ్మయ్య, నిద్రపోయావనుకొన్నాను. మేలుకొనే ఉన్నావు.

నాకు మధ్యాహ్నం నిద్రపట్టదని నీకు తెలియదుటే. ఇప్పుడు మధ్యాహ్నమే కాదు రాత్రికూడా నిద్రపట్టడంలేదు. రా! ముందు మంచినీళ్ళుతాగు, మజ్జిగ తెచ్చియిస్తాను. అబ్బ, ఈ ఎండలో ఎలా నడిచివచ్చేవె అంత దూరంనించి!

ఏం చెయ్యమన్నావు! ఇంకా నెల్లాళ్లుంటా ననుకొన్నానా! నిన్న మొన్నటిదాకా ఇక్కడ మావాళ్ళింట్లో పెళ్ళిగొడవ. ఇక హాయిగా ఉందామంటే అక్కడ మా అత్తారింట్లో పెళ్ళి నిశ్చయమయిందిట. ఆయన అప్పుడే మొన్ననే వచ్చి కూర్చున్నారు. ఇవాళ ఏదో పనుండి ఇక్కడికి దగ్గరే, వాళ్ల స్నేహితుడిగారి ఊరు వెళ్ళేరు సైకిలుమీద. ఈరాత్రే ప్రయాణం. మొన్నటినించీ నీదగ్గరికి రావాలనుకుంటే ఇవాళకి వీలయింది. ఏమిటే అలా ఉన్నావు?

మరెలా ఉండమన్నావు చెప్పు. నీకు తెలుసును కదూ!

తెలియకేం—తెలిసింది. అంతా నాలుగురోజులయిందిట కదూ, పూర్తిగా ఏడాదిపాటు వేశారట జెయిలు. ఏమిటో, ఈ గాంధీగారు, మీటింగులు, సత్యాగ్రహాలు, దేశంలో మనుష్యులందర్నీ ఖయిదులో పెట్టించడమే మిగుల్తున్నాది.

ఆ ఖయిదుమాటకేం, తిట్టినవాళ్లు తిట్టినా మెచ్చుకొనేవాళ్లు మెచ్చుకోకపోరు. నాపని ఖయిదు కంటే అధ్వాన్నంగా ఉంది.

నిజమే నిజమే, కాని కొత్తగా మరేమయినా..

కొత్త ఏమీలేదు, ఎప్పుడూ ఉన్నదే. నాకీ యింట్లో ఉండడం రోజొక యుగంగా ఉందంటే నమ్ము. మా అక్కయ్యకి ఘోష ఏమీ తెలీదు. మా బావ మరి నన్ను వదలడు. ఈ మధ్యనల్లా ఇతను కృష్ణమూర్తి ఆశ ఉండేది. అతను స్వయంగా చెప్పేడు, ఈ నెలాఖరుకల్లా ఉద్యోగం అయినా కాకపోయినా సరే నన్ను పెళ్ళిచేసుకొంటానని. మా బావ ఉద్దేశం తను వేయించిన ఉద్యోగం గనక అతనూ అతని మూలంగా నేనూ తన చెప్పుచేతల్లో ఉంటామని. నేనూ, సరే ముందు, పెళ్ళికానీ, ఈ యింటినుండి తప్పించుకోవచ్చుకదా, తరవాత సంగతి చూసుకోవచ్చుననుకున్నాను. వేళకి అంతా ఈవిధంగా రసాభాస అయింది.

అతను ఆవేళ పార్కులో మీటింగుకి వెళ్ళేటప్పుడు నువ్వు ఒద్దనలేకపోయావూ?

నాకు కనబడితేకదా! అయినా ఆ వేడిలో, దేశం, స్వాతంత్ర్యం, దేశం స్వాతంత్ర్యం...ఇవే మాటలు.

పోనీలే, జరిగినదానికి ఇప్పుడు వగచి లాభం లేదు. అయితే అతను స్వయంగా నీతో అన్నాడు కదా పెళ్ళి చేసుకొంటానని. అతను మాటతప్పే రకంకాదు. ఇన్నేళ్లు గడిపేవు, ఎలాగో వీధిని పడకుండా ఈ ఒక్క సంవత్సరం గడపలేవూ?

ఒక్క సంవత్సరంకాదు, మరొక్క నెలయినా అసాధ్యమే. నిజానికి మా బావదికూడా తప్పనలేను. మా అక్కది ఎన్నటికీ తగ్గనివ్యాధి. ఏదో వేగం అట్లో ఇట్లో తేలిపోతే బాగుండునని, అతని బాధ. ఇప్పటికప్పుడే మూడేళ్లుపైగా అయింది. పైగా నేనొకతె నీయింట్లో దిక్కులేకుండా ఎందుకు పడి ఉండాలీ.

అదే ఏమీ అర్థంకాకుండా ఉంది. నీకు మహా ఉంటే నాకంటె ఒకటి రెండేళ్ళకంటె ఎక్కువ ఉండవు. మాకింకా అత్తవారిల్లు కొత్తగానే ఉంది. నీకింత చిన్నవయస్సులోనే పెళ్లి,సంసారం వైధవ్యం- అన్నీ సమకూడేయి. ఇంతకీ మన పెద్దవాళ్ళననాలి.

ఎవళ్లని ఏమన్నా లాభంలేదు. అందరూ కబుర్లు చెప్పేవాళ్లేగాని తీరా సమయం వచ్చేసరికి నిలబడే

వాళ్ళెవళ్ళు? మా యింట్లో వాళ్ళు ఒప్పుకోడం లేదని, మా నాన్న చచ్చిపోకమునుపు పెళ్ళి చెయ్యాలనీ ఏవో
...ప్ప చిన్నపిల్లలకి పెళ్ళిళ్ళు చేసేవాళ్ళే. ఎవళ్ళేనా తెగించి పరి రెండేళ్ళు ఉంచినా నలుగురూ నానామాటలూ అంటారు. అయినా నాకుమాత్రం మా మామయ్య అన్యాయం చేసేశనలేను. ఆయనకి పోయేసరికి ముప్ఫైఏళ్ళకంటె ఎక్కువ లేవు; అంతా నాదురదృష్టం కాకపోతే ఎవరో ఏటిలో మునిగి పోతున్నారని ఈయనెందుకు వెళ్ళాలి? వెళ్ళినా అది వరకెన్నిమార్లు ఎందర్ని నీటిప్రమాదంనించి తప్పించ లేదు! అంతా నాదురదృష్టం! నన్ను చేసుకోడం నించి ఆయనకి పట్టుకొంది. పోనీ, మామయ్యేనా బ్రతికిఉండకూడదూ. ఉఁహుఁ, నాశని అందర్నీ పీడిస్తూంది. నన్ను చేసుకుంటాననడంవల్ల నే కాబోలు ఈయనకూడా హఠాత్తుగా ఖయిదులో పడవలసి వచ్చింది.

నువ్విలా ఏడుస్తే నాకు మరీకష్టంగా ఉంటుంది. ఖయిదులో పడడమంటే మరేమీ దొంగతనం చేసి పడడం కాదుకదూ! మా గోపాలం అన్నయ్య ఎంతో గొప్ప[illegible] ప్పే? [illegible]ం విడిచిపెట్టి దేశంకోసం త్యాగం చెయ్యడానికి ధైర్యం చాలిందికాదు.' నిజంగా కృష్ణమూర్తిలాటి వాళ్ళు ఊరికి పదిమంది ఉంటే మన దేశానికి స్వాతంత్ర్యం ఆరునెల్లలో వస్తుందంటాడు. ఎలాగోలాగు, నువ్వీ ఒక్క ఏడూ ఓపికపట్టేవంటే అందరికంటె నువ్వే హాయిగా ఉంటావు. అతనిలాటివాడికి ఈ ఉద్యోగం కాకపోతే ఇంకొకటి దొరక్కపోదు, చదువు రూపం గుణం అన్నీ ఉన్నాయి

ఏమిటో నాకేం నమ్మకం లేదు. ఏవో అంటే మాత్రం ఏడాది తరవాత ఆమాట నిలబడుతుందా? నిలబడినా మామూలంగా అతనికికూడా నలుగురిలోనూ తలవంపులు. అంతకంటె, నేననే మనిషే లేకపోతే ఎవరికీ ఏయిబ్బంది ఉండదు.

అదుగో అటువంటిమాటలంటేనే నాకిష్టం లేదు. ప్రపంచంలో మనకంటె హీనంగా ఉంటున్న వాళ్ళు, బాధలుపడుతున్నవాళ్ళూ లేకపోలేదు. వాళ్ళందరూ బ్రతకాలని తాపత్రియం పడుతున్నప్పుడు మనమెందుకు మన ప్రాణాన్ని మనమే తీసుకోవాలీ! సుఖమో, దుఃఖమో రేపన్నరోజు ఎలా ఉంటుందో ఎవ్వరూ చూడలేదు; చూడనిదాన్ని బాగుంటుందనుకోడంలో తప్పేముంది?

ఇవాళ అన్నరోజు బాగున్నవాళ్ళు రేపూ అలాగే ఉందనుకొంటారు.

అలా అనుకొంటే మాత్రం వాళ్ళకి కష్టాలు రాకుండా ఉంటున్నాయా! అలాగే కష్టాలలో ఉన్న వాళ్ళకీ ఎప్పుడో అప్పుడు సుఖాలనేవి రాకపోవు. అంతేకాదు, సుఖపడడమనేది కూడా కొంత మన చేతిలోనే ఉంది. ఎంత సుఖంగా ఉండికూడా ఏవో బాధలుపడుతున్నామనుకునే వాళ్ళు లేకపోలేదు.

అయితే నాబాధలన్నీ నేను కల్పించుకొంటున్నావేనంటావు?

నేననేది అదికాదు; ఎలాగూ తప్పనివాటి గురించి తిల్లడిల్లేకంటె వాటిని మరిచిపోయి సరదాగా ఉండడానికి ప్రయత్నం చెయ్యకూడదా అని. అసలు నేనివాళ నువ్వు పెట్టిన కాఫీ తాగాలని వచ్చేను. మళ్ళీ ఎన్నాళ్ళవుతుందో

కాఫీకేముంది, మళ్ళీ నువ్వు వచ్చేసరికి నేనుంటే—

ఛ! అదేం మాట!

మాటవల్ల మునిగిపోయిందేమీ లేదు గాని, శ్యామలా నన్ను మీ అత్తవారింటికి వంటమనిషిగా తీసుకొని పోకూడదూ?

నువ్వు తమాషాకి అన్నా నేనూ నిజంగా ఆ సంగతి ఆలోచించకపోలేదు. అయితే ఆ మహారణ్యంలో నేనే ఉండలేకపోతున్నాను. మా ఆయనకిగాని ఉద్యోగం అయి, మేం వేరే వెళ్ళిపోతే మాత్రం తప్పకుండా నిన్ను నా దగ్గరికి తీసుకొని వెళ్ళిపోతాను—నేను తెద్దామనుకొని మరిచిపోయాను. సాయంత్రం మా తమ్ముడిచేత పంపిస్తాను, మా ఆయన ఎడ్రసు రాయించి ఉంచేను పదికవర్లు. నా ఉత్తరం వచ్చినవెంటనే నువ్వు మళ్ళీ ఉత్తరం రాస్తూ ఉండాలి, తెలిసిందా!

రాస్తాన్లేగాని, కవర్లెందుకే?...

ఎందుకా, నువ్వు ముందు కవరు తెప్పిద్దాం తరవాత రాద్దాం అనుకొంటూ ఆలస్యం చెయ్యకుండాను. ఈ పదణాల కవర్ల మూలంగా నే నేమీ చెడిపోనులే. నా కక్కడ ఉండగా నీ దగ్గరనించి ఉత్తరం వచ్చిందంటే ప్రాణం లేచివస్తుంది. ఎవళ్ళో వచ్చినట్టున్నారు?

ఆఫీసు బంట్రోతు. కాఫీ పట్టుకొని వచ్చేడు. పన కాఫీ పెట్టుకొంటాను.

ఎవరురా తమ్ముడూ!

ఎవరో నే, వెంకట్రామయ్యగారున్నారా అనడిగేరు

వెంకట్రామయ్యగారి గురించా! ఏడీ, అ అత నే. కృష్ణమూర్తిగారే, పరుగె ... పిలుచుకు రాగలవు?

ఓ, అలాగే.

ఏం తమ్ముడూ దొరక లేదురా!

లేదక్కయ్యా! పరుగెత్తుకొని వెళ్ళేను దారిలో అడ్డంగా ఒక కారు వచ్చింది ... నా కారు కింద పడిపోవలసిందే. నేను తొందర ... అటునించి ఎవరో నా నె అమ్ముకొనే అమ్మి పరధ్యానంగా వచ్చింది. నూనె అంతా ఒలికి పోయింది. అందరూ నాది ... లేదని, దాన్నే తిట్టేరు. ఈలోపుని అతను ఎటు వెళ్ళిపోయేరో మరి కనబడలేదు. అక్కడికి దగ్గరలోనే నాలుగు దార్లు కలుస్తాయి. ఏ దారిని వెళ్ళడం? అయినా ఆ దగ్గరలో ఉన్న వాళ్ళని అడిగిమాసేను. ఎవళ్లూ చూళ్లేదుట. అసలతి నెవరక్కయ్యా! ఎందుకు పిలవమన్నావు?

ఇదివరకీ యింట్లో అనూరాధావాళ్లూ ఉండే వారు తెలుసునుకదూ.

అవును. వెంకట్రామయ్యగారువాళ్లే కాదకదూ. ఆయన అమ్మాయిని ఉద్యోగం మానేసి వెళ్ళిపోయారుటకదూ! వాళ్ళ యింట్లోనే ఉండేవారు. అయితే ఇతని ... తెలుసును?

ఇతను అప్పుడు కొద్ది రోజులు వాళ్లింట్లో ఉండేవాడు. నిరుడు కాంగ్రెసు అల్లర్లలో జెయిలుకి పాపం అనూరాధకోసం వచ్చిఉంటాడు.

ఆవిడ చచ్చిపోయిందికదూ!

చచ్చిపోయిందిరా పాపం. నేనన్నట్టే అయింది. ఇన్నాళ్లూ గడిచేయి. ఈ ఒక్క ఏడాది మెల్లిగా గడిచిపోనీ అన్నాను. ఒక్క ఆరు నెల్లలో అంతా ఇలా అయిపోయింది. అసలు నాదీ బుద్ధితక్కువ. మా అత్తారింటికి నాతో తీసుకుపోవలసింది. ధైర్యం చాలింది కాదు.

అకేమిటే అక్కయ్యా ... బావు. ఎక్కడయితేమాత్రం జబ్బులు రా... మనుష్యులు చచ్చిపోరా? అన్ని మందులు పోశారు, అందరు డాక్టరు ...చ్చారు, మన అమ్మని బ్రతికించి ఉంచగలిగేరా?

...బ్బచ్చి ... విచారమే లేదురా! నీకు తెలియదులే ఆ గొడవంతా! ఆవిడ బలవంతంగా చచ్చిపోయింది. తరవాత నాలుగురోజులకి వాళ్లక్కయ్య చచ్చిపోయింది—అప్పటికిగాని అతనికి బుద్ధిరాలేదు. ఉద్యోగం విడిచిపెట్టిపోయి సన్యాసుల్లో కలిసిపోయాడు. ఎన్ని గొడవలు పడినా ఇతను జైల్లోనించి బయటపడివచ్చేదాక, అనూరాధ బ్రతికిఉంటే, తరవాత కలకాలం సుఖంగా ఉండిఉండును. అతనికి పాపం ఈ సంగతులు చెప్పేవాళ్ళెవళ్ళు? చెప్పినా, ఏవేవో కల్పించి చెప్తారు. ఈసారెప్పుడైనా కనిపిస్తే తీసుకురా! అనూరాధ చచ్చిపోయే ముందు నాకు రాసిన ఉత్తరమయినా చూస్తాడు. ఆ ఉత్తరం రాసిన తరవాత మరి రెండు రోజులు ఆగిఉంటే బాధ లేకపోవును. నేను ఇవతల బండిలోంచి దిగుతున్నాను. అవతల శివాని, ...కొని వెళ్... న్నారు.

*　　*

ఏమిరా యాజులూ! చాలా కాలానికి తిరిగి వచ్చేవు.

అవునురా శర్మా! రోజు రోజూ యాత్రలకని బయలుదేర లేముకదా! ఎలాగూ వెళ్లినప్పుడు నాలుగూ పూర్తి చేసుకొనివద్దామని. మరేమిటి విశేషాలు?

విశేషాలేమీ లేవుగాని, ఈ మధ్యని మన చిన్నప్పటి సహాధ్యాయి కృష్ణమూర్తి వచ్చేడు. తెలుసునా?

అరె, నాకేమీ తెలీదే, ఎన్నాళ్ళయింది వచ్చి? ఉన్నాడా?

వచ్చి, ఎక్కడ పదిహేనురోజులయింది. మొన్న ఉదయం కనిపించినప్పుడు, ఆ వేళ సాయంత్రం వెళ్ళిపోతున్నా నన్నాడు.

అయ్యో, అయితే, ఎన్నాళ్లకో వాడు రాక రాక వస్తే వేళకు నేను ఊళ్లో లేకపోయేనన్న మాట! ఎక్కడికి వెళ్తాడో అడ... ...డా

ఆ సంగతి అతనికిమాత్రం తెలిసేకదూ? ఎక్కడికి అని అడక్కు శర్మా అన్నాడు. ఇక్కడ మరేముంది, మా అమ్మకూడా లేదు; ఎక్కడికో ఒక చోటికి పోతాను. ఏదో ...ంగా బ్రతుకుతాను అన్నాడు.

అంత దిగులుగా ఉన్నాడన్న మాట! పాపం, వాడు చదివిన చదువుకి ఈపాటికి ఏ తాసిల్దారో కావలసింది.

గుమాస్తాపని దొరికితే తాసిల్దారీ దొరికినట్టే. గవర్నమెంటులో అదీ దొరకదట, అప్పుడు నేను జైల్లో పడ్డానేమో మన కృష్ణమూర్తి అంటే నువ్వు కొట్టొచ్చావు. వాడు మరెవడో కృష్ణమూర్తి అయుంటాడన్నావు. ఉంటే వాడి నోటంటే వినుందువు, మనిషికూడా బాగా  యేడు, మన రంగు లేదు.

అలాటివాణ్ణి మరి నాలుగురోజు లుండమని బలవంతం చెయ్యలేకపోయావ్రా! వాళ్ల కామాక్షికి తెలుసునేమో ఎక్కడికి వెళ్లేడో...

తెలిస్తే ఏం చేస్తావురా?

ఏం చేస్తావా? వెళ్ళి తీసుకొనివచ్చి మందో మాకో ఇచ్చి వాడి ఆరోగ్యం బాగయేలా చేస్తాను. వాడిష్టపడి చేసుకొంటానంటే మంచి సంబంధం తెచ్చి పెళ్ళిచేస్తాను—నాకెంతో ఇదిగా ఉంది వాడు వచ్చేసరికి నేను లేకపోయేనని. అయినా కామాక్షినడిగి చూడాలని.

లాభం లేదురా! వాడు వాళ్లింట్లో అసలుండ లేదు. వాళ్ళమ్మ పోయేసరికి మనకి ఎక్కడున్నాడో కూడా తెలియలేదుకదా. మొత్తానికి వాడు ఈ ఊరు వచ్చేదాకా కూడా వాళ్లమ్మ పోయిందని వాడికి తెలీదు. ఆమాట తెలియగానే తిన్నగా వచ్చిన దారినే బయలుదేరిపోయాడు. దారిలో కరణంగారి అబ్బాయి నిలబడి బతిమాలి ఆపితే ఆగాడు. కొంతసేపల్లా బాగా మాట్లాడేవాడు, అంతలోనే మళ్ళీ ఏమి వచ్చేదో పరధ్యానంగా అయిపోయేవాడు, ఎంతో బాధపడుతున్నట్టుగా మొగం ఉండేది. ఒక్కడూ వెళ్ళి మనం చిన్నప్పుడాడుకొనే తోటలో వంక మామిడిచెట్టు మొదట కూర్చునేవాడు. సాయంకాలమే కాదు, రాత్రయిపోయినా అలాగే కూర్చొనే వాడు ఎవళ్లయినా వెళ్లి పిలుచుకొని వచ్చేదాకా!

ఒరే శర్మా మీకు బుద్ధిలేదురా, నేనెలాగూ వస్తానని తెలుసునుకదా! మరి నాల్రోజులుంచితే! పోనీ కరణంగారబ్బాయికి తెలుసునేమో ఎక్కడికి వెళ్ళేడో ఏమిటో

*        *        *

ఎవరండీ ఈ అబ్బాయి?

ఎవరో నాకూ సరీగా తెలీదు. నిద్రపోయాడా?

భోంచెయ్యగానే పడుక్కొన్నాడు. బాగానే నిద్రపట్టినట్టుంది. ఎందుకు వచ్చేడేమిటి?

అతను రాలేదు, నేనే పిలుచుకొని వచ్చేను. పాపం చాలా నీరసంగా ఉన్నాడు.

అసలు మీ కెక్కడ కలిసేడు?

చెప్తే నీకోప్పం వస్తుంది. మన అబ్బాయి పోయిందగ్గర్నించి నాకేమిటో మనసు మనసులో లేదు—ప్రెస్సులో కూర్చోలేక పోతున్నాను. ఎంతసేపూ వాడు, అబ్బాయి, అక్కడ తిరుగుతున్నట్టు, నాన్నా ఈ ప్రూఫులు చూస్తారా? ఆ లెటర్ హెడ్సు పంపించేసేదా అని అడుగుతున్నట్టే ఉంటుంది. ఇంటిదగ్గరుంటే ప్రెస్సుకి పోతే బాగుంటుందనీ, ప్రెస్సులో ఇంటిదగ్గరే నయమనీ అనిపిస్తుంది. రోజూ సాయంకాలం అలా తిరగడానికి పోతున్నాను, ఊరవతలికి. ఇతనెవరో రోజూ నాకంటే ముందుగా వస్తున్నాడు—నువ్వేమంటే అనుగాని ఆ శ్మశాన వాతావరణంలో నే మనస్సుకి ఏదో కొంత శాంతి కనిపిస్తుందేమో. నాలుగురోజులాయి కనిపిస్తున్నా ఏమీ మాట్లాడలేదు. ఇవాళ మరి ఊరుకో లేకపోయాను. దూరంనించి చూస్తే, సరిగా తెలియ లేదుగాని మనిషి బాగా కృష్కించిపోయి ఉన్నాడు. మూడురోజులాయి సరిగా ఏమీ తినలేదట. ఇవాళ నేను పిలవకపోతే ఏమవునో! ప్రాణంపోతున్నా ఒకర్ని ఏమీ అడిగే అలవాటు లేనివాడులాగున్నాడు.

పాపం, ఇంత చిన్న కుర్రవాడి కెందుకో అంత విచారం? ఏం కష్టం వచ్చిందో?

ఏమిటో, ఏమీ చెప్పలేనన్నాడు. ఎవళ్ళ శాంతా! నిద్రపోలేదామ్మా!

లేదు నాన్నా!

ఏమమ్మా ఇవాళ మనింటికి వచ్చిన అబ్బాయిని చూస్తే మీ అన్నయ్య జ్ఞాపకం రావడం లేదమ్మా?

నేనూ అదే అనుకొన్నాను నాన్నా! అయితే మన అన్నయ్య ఇంతకంటె కొంచెం పొట్టి, మరి కొంచెం తెలుపు. కాని పోలికలుకూడా లేకపోలేదు.

ఇతను నాతో సరిగా ఏమీ చెప్పలేదుగాని, నా వాళ్ళని ఎవ్వరూ లేరన్నాడు. మనింట్లో ఉండి పోతే, ఎంత బాగుంటుంది.

ఎందుకుంటాడు! ఏదో మనసుకి కష్టంగా ఉండి అలా ఉన్నాడు. నాల్రోజులుపోతే తన

దారిని తాను వెళ్ళిపోతాడు. తానెవరో, మన మెవరమో!

చూశావమ్మా! శాంతా! మీ అమ్మకి అన్నీ అనుమానాలే. ఏం ఎందుకుండడూ? తను చదువుకొన్నవాడిలాగే ఉన్నాడు. తను ఇష్టపడితే ప్రెస్సుపనంతా అప్పజెప్పి, నేను రామా కృష్ణా అనుకొంటూ కూర్చుంటాను. నీ పెళ్ళికూడా అయిపోతే...

నీకు రాత్రి పగలూ ఇదే ఆలోచనలాగుంది నాన్నా. ఇప్పుడేం తొందర వచ్చింది? ఇంకా అన్నయ్య పోయి మూణ్ణెల్లయినా కాలేదు. మధ్యాహ్నంకూడా నువ్వు నిద్రపోయినట్టు లేదు, పడుకో నాన్నా!

అలాగేనమ్మా నువ్వు పడుకో—

* * * *

ఏమిటమ్మా శాంతా! అలా చూస్తున్నావు.

ఏమీ లేదమ్మా! అన్నయ్యింకా ప్రెస్సునుండి రాలేదేమని. రోజూ మామూలుగా వచ్చే వేళ కూడా దాటిపోయింది. ఇవాళ అయిదు గంటలకల్లా వస్తానన్నాడు. ఇప్పుడెప్పుడే ఆరుంబావయిపోయింది. ఈసరికి సినీమా మొదలు పెట్టేస్తారేమో?

సినీమాకా? పోనీ నువ్వు వెళ్ళకూడదూ, పొరుగువాళ్ల సరోజనిని సాయం తీసుకుని.

కాదమ్మా! ఇవాళ చాలా మంచి ఇంగ్లీషు సినీమా. అన్నయ్య ఈ ఆరు నెల్లలోనూ ఒక్క సినీమా అయినా చూడలేదు. ఇవాళ ఎంతో బలవంతం చేస్తేనో ఒప్పుకొన్నాడు. అట్టే పనిలేదు, నాలుగున్నరకే వస్తానన్నాడు. ఇంకా రాలేదు.

ఏదో అర్జంటుపని వచ్చింది

అదేం కాదమ్మా! అతనేదో భోంచేసి పనిచేసుకొంటూఉంటే మామూలుగానే ఉంటున్నాడనుకొంటున్నారు, నువ్వు నాన్నాను. మనసులో ఇంకా ఏదో బాధపడుతున్నాడనే నా అనుమానం. అందుకే అస్తమానం ఏదో పని పెట్టుకొంటూఉంటాడు. చదివినా చదవకపోయినా ఏదో పుస్తకం మొగానికి అడ్డుపెట్టుకొంటాడు. ఈమాదిరి అయితే ఈ అన్నయ్యకూడా మనకి దక్కడనే నా అనుమానం.

అదేమిటే నీ మాటలు చిత్రంగా ఉన్నాయి.

చిత్రమేం లేదమ్మా! ఇవాళయినా ఎంతో బలవంతంచేస్తే సినీమాకి వస్తానన్నాడు. కావాలనే రావడం మానేసిఉంటాడు.

మనమేం చెయ్యగలమమ్మా తనంతట తనకి సరదాగా ఉండాలని లేకపోతే. మీ నాన్నగారుకూడా అన్నారు. అంతలా రోజంతా కష్టపడొద్దని. అంటే నాకీ పనిచెయ్యడమే సరదాగా ఉందని అన్నాడట!

నాకు తెలుసును. మరింక చూసి లాభం లేదు. నేను బయలుదేరతాను. అలా ప్రెస్సుపక్కనించి వెళ్తాను. ఈలోగా దార్లో కనిపిస్తే బాధే లేదు. జట్కాలో వెళ్తాము.

అయితే ఇక్కణ్ణించే జట్కా వేయించుకొని వెళ్ళిపోకూడదూ?

అలాగే చేస్తానమ్మా. నాకు తెలుసును నీ భయం. కాకు [illegible] వాళ్ళు ఎలా కూసినా కుయ్యనీ—

అబ్బాయేడే? ఎక్కడా కనబడడు.

ఇంట్లో ఉన్నట్టులేదు. ప్రెస్సుకి వెళ్ళాడేమో?

ప్రెస్సుకా? ఇవాళ సెలవు, పనివాళ్లెవళ్లూ రారు!

సెలవయినా పనిరోజయినా తనకొకటే— భోజనం నిద్రాతప్ప తక్కినవేళంతా ప్రెస్సే తన లోకం.

అటువంటివాడిని అనడానికి నోరెలాగ వచ్చిందో.

లోకులకేమిటి? తమలో ఉన్న కుళ్లునంతా ఇతరులకి అంటించడానికి చూస్తారు. అయినా వాళ్లనీ అని లాభంలేదు. అతనెవరో కొత్తమనిషి, మనింట్లో ఉంటున్నాడు; మనమ్మాయితో చనువుగా ఉంటున్నాడు.

అయితే అంతమాత్రంలో అపనిందలు వెయ్యడమేనా?

వేసేవాళ్లు మన నడిగి వేస్తారా? నాకు మొదట్నించీ ఈ భయంఉంది. అయితే మొదట్లో నాకింకో బుద్ధి ఉండేది. తరవాత పోయిందనుకోండి. ఈడు జోడుగా ఉంటారు, ఎవడికో ఇచ్చేకంటె ఇతడికే ఇస్తే మనపిల్లా అల్లుడూ మనింట్లోనే ఉంటారనుకొన్నాను. కాని తను అమ్మా అమ్మా అని పిలవడంతో నాకుకూడా మనసు మారిపోయింది. శాంతతో కూడా అతను స్పష్టంగా చెప్పేశాడు. చెల్లెమ్మా నాదగ్గర నువ్వనవసరంగా మొగమాటపడకు - నాకు

మొదటినుంచీ చెల్లెళ్ళులేరు; నీకు ఉండీ అన్నయ్య లేకుండాపోయాడు. మనమిద్దరం అన్నాచెల్లెళ్ళం, ఎవరేమనుకొన్నా సరేఅని

అటువంటివాళ్ళమీదా అపనిందలు?

ఏంచేస్తాం, లోకం తీరేఅంత – మరి అమ్మాయి పెళ్ళి ఎలా అవుతుందో?

అయినప్పుడే అవుతుంది. నువ్వేమీ బాధపడి అతనిముందేమీ అనకు అసలితను ప్రెస్సుకే వెళ్ళేడంటావా? ఏదీ, అదుగో, తాళాలిక్కడే ఉన్నాయి నేనలా వెళ్ళివస్తాను. నువ్వు పెళ్ళి అమ్మాయిని చూడు. ఈ ఒక్క సంబంధం తిరిగిపోయినంతలో మరేం మునిగిపోలేదు ప్రపంచంలో ఇంకా నీతీ, నిజాయితీ, మనుష్యులంటే నమ్మకం ఉన్నవాళ్లూ ఉండకపోరు.

* * * *

మరొక్క నిమిషం నేను ఆలస్యంగా వెళ్ళి ఉంటే రైలు కదిలిపోను. మళ్ళీ జన్మలో ఇతన్ని చూడలేకపోదును. నేను దిగమంటే దిగేడు గాని, మళ్ళీ రయిల్లో వెళ్ళిపోతానన్నాడు. నేను స్పష్టంగా చెప్పేశాను, శాంతికి శాశ్వతంగా పెళ్లికాకపోయినా నాకిష్టమే గాని, నిన్ను చూడకుండా ఉండలేనని.

నాకూ అలాగే అనిపించింది. కాని ఏమిటన్నాడు?

ఏమీఅనలేదు, వచ్చాడు. నువ్వుమాత్రం దాని పెళ్లిమాట అతనిముందు ఎత్తకు. అసలది మనదే పొరపాటు. ఇద్దరి పెళ్ళిళ్లూ ఒక్కమారే నిశ్చయం చేస్తే సరిపోతుంది.

అదిమాత్రం అంత తేలికా? వీళ్లూ వాళ్లూ ళ్ళవాళ్లు అందరూ ఇష్టపడాలికదా?

పడతారు, ఎందుకు పడరూ? పడేలా చేస్తాము.

* * * *

నువ్వు మరేం గాభరాపడకు శాంతా! మీ కృష్ణమూర్తిఅన్నయ్య నాతో అంతా చెప్పాడు. ఇదివరకు వచ్చిన ఒకటి రెండు సంబంధాలు తప్పిపోయిన సంగతికూడా చెప్పాడు.

అయితే మీకన్నీ తెలుసునన్నమాట!

తెలుసుననే అనుకుంటున్నాను. మీ అన్నాచెల్లెళ్ళ మధ్యనున్న సామరస్యం మా అక్కచెల్లెళ్ళతో నాకుంటే బాగుండిపోను. నేను ఒక్కణ్ణే ఇంటికి మగపిల్లవాణ్ణి కావడం వాళ్లకి తమ నేదో అన్యాయం చేసినట్టుంది. మా నాన్న తమకి ఆస్తి ఇవ్వకపోడానికంతా నాదే బాధ్యత అని. నేను ఎవరితోనయినా ఒకరితో కాస్త కలుపుగోలుతనంగా ఉందామంటే తక్కినవాళ్ళకి ఈర్ష్య. అందరితోనూ కలిసిమెలిసి ఉండడం మళ్ళీ ఎవ్వరికీ ఇష్టంలేదు. నేనిలా అంటున్నానని భయపడుతున్నావేమిటి?

భయం నాకెందుకు? నేను మిమ్మల్ని చూసి, మీ గురించి విని, ముఖ్యంగా మా అన్నయ్యకి మీరు నచ్చేరని చేసుకొన్నాను. మీ ఆస్తంతా మీ అక్కచెల్లెళ్ళకిచ్చినా నాకు విచారంలేదు.

ఆఁ అంతా ఎందుకిచ్చేస్తారు? అయినా మనకి తోచి మనం ఇవ్వాలిగాని వాళ్ళు దెబ్బలాడి ఏం పుచ్చుకొంటారు? ఏమిటో ఇంకా నీముఖం విచారంగా ఉన్నట్టుంది.

అబ్బే, విచారమేమీలేదే...

నువ్వు దాస్తే మాత్రం దాగుతుందా!

దాచడానికేమీ లేదు. ఈ ముహూర్తానికే మా అన్నయ్య పెళ్ళికూడా అయిపోతుందనుకొన్నాము. అది, మరి కుదిరిందికాదు, మా అన్నయ్యను ఒక్కణ్ణే విడిచిపెట్టి వెళ్ళిపోవడం అంటే కష్టంగానే ఉంది. తనికీ పెళ్ళయింటే కొంత.

నువ్వేమీ నీ మనస్సుని కష్టపెట్టుకొని అక్కడికి రానక్కర్లేదు. ఎన్నాళ్లు కావాలంటే అన్నాళ్లు ఇక్కడే ఉంటూ ఉండవచ్చును.

అదెలా కుదురుతుందిలెండి. అంతా మనిష్టమేనా పెద్దవాళ్ల మాటప్రకారం నడుచుకోవాలిగాని.

అటువంటి భయమేం లేదు. నేను మానాన్నగారి మాటప్రకారం నడుచుకొనే మాటయితే ఇప్పటికప్పుడే అయిదారేళ్ళక్రితమే నా పెళ్లి అయిపోయి వుండును. ఈసరికి ఇద్దరో ముగ్గురో పిల్లలు పుట్టి ఉండేరు.

పుట్టిఉండవలసిన పిల్లలగురించే ఇంత ప్రేమ చూపిస్తున్నారు; ఇక నిజంగా పిల్లలే పుడితే...

ఏదో మాటవరసకి సరదాగా అన్నానుగాని నాకేం పిల్లలు అక్కర్లేదు. అసలు మీ ఆడవాళ్ళలో ఉన్న దుర్గుణమే ఇది. పెళ్లయిన మర్నాటినుండి పిల్లలు పిల్లలు అని. మరి తనుగోల ఏమీ అక్కర్లేనట్టు — నేనింకా మనమిద్దరమూ కలిసి మనదేశమంతా తిరిగిరావాలనుకొంటున్నాను. అందాక చూసుకో, పిల్లలుగాని పుడితే వాళ్ళ పూచీ అంతా నీదే.

ఇప్పటినుంచీ మనకెందుకీ వాదులాట!

* * *

మీ అన్నయ్య ప్రణయకలాపం, దారిలో పడే టట్టేఉంది.

ఏమిటేమిటి, మీరేవో చిత్రమయిన మాటలు చెప్తారు! గాలికబుర్లేనా, అసలు ఏమయినా ఉందా?

చెప్పానుకదూ అప్పుడు. ఆవిడ స్కూల్లో ఇన్స్పెక్ట్రెసు ఒకావిడ ఉందని, ఆవిడని మీ అన్నయ్యకి పరిచయం చేసేను. పరిచయం దినదినాభివృద్ధి పొందుతున్నాదిట!

అంతేనా?

మరెంతయితే నీకిష్టం? రేపొద్దున్న ఒకనాడు శుభలేఖవస్తేకూడా నమ్మవు కాబోలు?

ఎందుకు నమ్మను? మీ మాటెప్పుడూ నాకు నమ్మకమే. మరి మన ప్రయాణం ఈ నెలాఖరుకయినా అవుతుందా?

నీ కంత గట్టిగా కావాలంటే ఇవాళే బయలు దేరు. నేను ఇక్కడ పనులు తెముల్చుకొని వస్తాను ఈ నెలాఖరుకలా. అప్పుడే నీ మొగంలో ఆశ పడుచు కళవచ్చేస్తున్నట్టుంది. ఏమిటి అక్కడికి నువ్వెళ్తే జరగవలసిన పెళ్ళి గురి కాస్త త్వరగా అవుతుందనా నీ ఆశ.

* * *

ఏమిటంత విచారంగా ఉన్నావు?

విచారమేమీలేదుగాని నా కేమిటో మావాళ్ళింటికి వెళ్ళాలనిలేదు. ఇక్కడే...

పురుడుపోసుకోందికి నా అభ్యంతర మేమీ లేదు. కాని బాగుంటుందా? ఒకవేళ మీ అమ్మా నాన్నాకూడా ఏమీ అనుకోకపోయినా, ఊళ్ళో వాళ్ళంతా నేనేదో భర్తగా అధికారం చలాయించి అఘాయిత్యం చేస్తున్నానంటారు. అయినా పుట్టింటికి పోతాననే వాళ్లను తప్ప, పోమనే ఆడదాన్ని నిన్నొక్కతెనే చూసేను.

అదికాదండీ, అప్పుడు మా అన్నయ్య పెళ్ళి, నా పెళ్ళి ఒక్కమారే అవుతుందనుకొన్నాము. ఇప్పటికీ తన పెళ్ళి కాలేదు, మనకి పిల్లలు పుడుతున్నారంటే...

దానికి మనమేం చేస్తాము? ఇదేం బలవంతంగా చేసే వ్యవహారమయితే మూడురోజుల్లో కుదుర్చుకొని వదును. అప్పుడు స్పెక్ట్రెస్ ప్రణయ కలాపం దారిలో పడుతుందనుకొన్నాను.

నేనూ అలాగే ఆశపడ్డాను.

ఆవిడ నాతో చెప్పిన మాటల్నిబట్టిచూస్తే, ఆవిడ లోపం ఏమీలేదనే తోస్తుంది. కావాలంటే ఉద్యోగం మానుకోందికికూడా అభ్యంతరం లేదంది. మరి మనం చేసేది ఏమీలేదు, ఆ సమయం వచ్చే వరకూ ఓపికగా యెదురుచూడ్డమే.

## : వర్షం :

ప్రియమైన అన్నయ్యకు శాంత అనేక నమస్కారములు చేసి వ్రాయునది: తి॥ ఇచ్చట నేనూ శ్రీ మీ బావగారు చి॥ వెంకటరమణ కులాసాగా వున్నాము. అచ్చట నీవు మ॥ ల॥ స॥ అమ్మ, మ॥ రా॥ శ్రీ నాన్నగారు అందరూ క్షేమంగా వున్న సంగతి వ్రాయించగోర్తాను.

ఇంగ్లీషు వైద్యము మానిపించి ఆయుర్వేద వైద్యము మొదలుపెట్టుటవలన నాన్నగారి ఆరోగ్యములో ఏమయినా మెరుగు కనిపించినదా? మీ బావగారికి ఆయుర్వేద వైద్యములో ఎంతమాత్రమును నమ్మకములేదు. ఆయనకు ఇక్కడకు వచ్చిన ఒక కొత్త డాక్టరుగారు, సుబ్బరామయ్యగారని, వారిమీద చాలా నమ్మకముగా ఉన్నది. నిజముగా కూడా, డాక్టరుగారు చాలా సమర్థులనే అందరూ అంటున్నారు. ఈమధ్యను మా కుర్రవాడు చి॥ వెంకటరమణకు చాలా ప్రమాదం చేసినప్పుడు కేవలం ఆయనే భగవంతునిలాగ అక్కరపడ్డారు. మీరు అనవసరంగా బాధపడతారని ఆయన రాయవద్దన్నారు. మొదట కొంచెం జలుబుగా ప్రారంభించినది; తరవాత జ్వరము; నిమోనియా అన్నారు. చాలా భయపడ్డాము. కాని, భగవంతుని దయవలన ఇప్పుడు హాయిగా ఆడుకొంటున్నాడు.

నాన్నగారికి స్థలం మార్పువలనకూడా కొంత మంచిది గనక, ఇక్కడకువచ్చి కొన్నాళ్ళుండి ఈ వైద్యముకూడా ప్రయత్నించడం చాలా మంచిదని ఆయన గట్టిగా రాయమన్నారు.

ఇచ్చట ఈ సంవత్సరం వర్షములు చాలా ఎక్కువగా పడుచున్నవి; ప్రతిరోజూ ఉదయమో సాయంత్రమో వర్షము పడుచునేయున్నది. మా పెరటిలోని పూరిసాలను, రేకులతో వేయించి, గోడలు కూడా పెట్టించినాము. పశువులకు, కర్రలు మొదలయినవి

పెట్టుకొందికి మంచి సహాపాయముగా నున్నది. ఆయన ఆఫీసుగదిలోని పాతసామాను లోపలగదిలోకి మార్చి కొత్తవీశాలు రెండు, ఒక పెద్ద టేబిలు, ఆరు కుర్చీలు తెప్పించినారు. ప్రస్తుతం బాగానే ఉంది, కాని, ఒక్క ... లేదు. ఇం... ఒం...గా ఉంటున్నట్టుంది. కొన్నాళ్ళపాటు అమ్మా నాన్నా వచ్చి ఉంటే చాలా బాగుంటుంది.

అమ్మనూ నాన్ననూ తోడ్కొని సాధ్యమయినంత త్వరలో వస్తావని నమ్ముతున్నాను. బయలుదేరేముందు, ఉత్తరంగాస్తే ఆయన స్టేషనుకి వస్తారు. చి॥ వెంకటరమణ నామీద కోపంవచ్చినప్పుడెల్లా 'మామదగ్గిరికి వెళ్తాను రైలెక్కి' అని నన్ను బెదిరిస్తూ ఉంటాడు.

వెంటనే జవాబు వ్రాస్తావని నమ్ముతున్నాను. ఇంతే సంగతులు. చిత్తగించవలెను.

ఇట్లు
నీ ప్రియమైన చెల్లెలు శాంత

*  *  *  *

ప్రియమిత్రుడగు సోమయాజులు కృష్ణమూర్తి వ్రాయునది:—మనం కలుసుకొని చాలాకాలం అయింది. అప్పుడు నేను సుమారు నాలుగేళ్ల క్రితం వచ్చినప్పుడు నువ్వు ఊళ్లోలేవు. వచ్చినవెంటనే తిరిగిపోవాలనుకొన్నవాణ్ణి నీ కోసం పదిహేను రోజులుపైగా ఉన్నాను. అప్పటికీ నువ్వు రాలేదు. నేను మరి ఉండలేక బయలుదేరిపోయాను; ఎక్కడికి ఏమిటే అనే అడ్రసు ఇవ్వలేదు కూడాను. ఆ తరవాత వ్యవహారం అంతా రాయబూనుకొంటే అదంతా ఒక పెద్ద గ్రంథం అవుతుంది. కాబట్టి మనం మాట్లాడుకొందికిగాను అది వాయిదా వేస్తున్నాను.

ఈమధ్యను అంటే ఒక పదిరోజులక్రితం మా చెల్లెలిగారి ఊరు వెళ్లేను. అప్పుడు మన ఊరువిడిచి పెట్టిన నేను, ఒక చెల్లెల్నే కాదు, అమ్మనూ నాన్ననూ కూడా సంపాదించాను. వాళ్ళ ఇంట్లో ఒకనాడు సాయంకాలం షికారుకెళ్తూండగా ఒక కుర్రవాడు కనిపించాడు. వాడిని చూసి అడగకుండా ఉండలేకపోయాను, "అబ్బాయీ మీనాన్నగారెవరు?" అని. నా అనుమానం నిజమయింది. నీవాడే. నేనన్నాను, "అబ్బాయీ, నీ అంతవయస్సులో నేనూ మీనాన్నా ప్రాణస్నేహితులమని. నన్ను ఇంటికి వచ్చి వాళ్ళతోపాటు కూర్చున్న చెల్లెల్ని చూసి తీరాలన్నాడు. మీ సరస్వతిని నేను పోల్చుకోలేక పోయాను. తాను మాత్రం నన్ను పోల్చుకొంది. అదివరకు ఎప్పుడో రైల్లో వస్తూ ఉంటేకూడా తను నన్నుగుర్తుపట్టిందట!

మనం కలుసుకొని చాలాకాలమయింది. మన జీవిత శకటాలు చాలాదూరం వేర్వేరు మార్గాలను అనుసరించి సాగిపోయాయి. ఆనాడు రాత్రి నేను ముందుగా రైలెక్కకుండా నిన్నే ఎక్కించివుంటే ఇద్దరం కలిసే ప్రయాణించి ఉండేవాళ్లమేమో? ఆనాటిరాత్రి నువ్విచ్చిన రెండురూపాయిలు ఇంకా నాదగ్గర భద్రంగా ఉన్నాయి.

ఈఉత్తరం రాయడానికి ముందు నేనే బయలుదేరి రావాలనుకొన్నాను. కాని, అంతకంటె నువ్వే ఇక్కడకు రావడం చాలా బాగుంటుందని నా నమ్మకం. ఇక్కడ మాయింట్లో అమ్మానాన్నకూడా లేరు; నేను ఒంటరిగానే ఉంటున్నాను అందుచేత నీకేమీ మొగమాటంగా ఉండదు.

వచ్చేటప్పుడు అక్కడి మా మామయ్యగారి తోటలోవి మంచిపళ్లు ఏవయినా తీసుకొనిరావలెను.

ఎప్పుడు బయలుదేరివచ్చేదీ ముందుగా రాస్తే నేను స్టేషనుకి వస్తాను. ఇంటియడ్రసు దిగువను రాస్తున్నాను ఎందుకయినా మంచిదని. వెంటనే జవాబు రాస్తావుకదూ!

ఇట్లు నీ
కృష్ణమూర్తి.

ఏమని సంబోధించాలో తెలియక ఏ సంబోధనా లేకుండానే ఈఉత్తరం ఇలాఆరంభిస్తున్నాను. ఆవేళ నీచేతికాఫీ తాగినదగ్గరనుంచీ నాలో ఏదో కొత్త అలజడి ప్రారంభమయింది. అలజడి అంటే మరేమీ కాదు. ఏ కారణాలవల్లనయితే నేమి, మన ఇద్దరి జీవితాలు మోడువారిపోయినాయి. కాని, ఈ నేటి వర్షాలకు మళ్ళీ చిగురించి, కుసుమించడానికి అవకాశం లేకపోలేదనే ఆశ లేశమాత్రంగానయినా కలుగుతూంది. నీ మాటలలోనే కాదు, నీ మనసులో కూడా ఎంతో పెద్దదానిననే భావం జీర్ణించిపోయినా నాకంటె అయిదారేళ్ళు చిన్నదానివనే మాట నాకు బాగా జ్ఞాపకం ఉంది. నీకూ జ్ఞాపకం ఉండే ఉండాలి.

నేను ఆవేళ కాఫీ తాగివచ్చిన వెంటనే, నీకే ముందుగా రాయాలనుకొన్నాను. కాని, కొంత ఆలోచించినమీదట, నువ్వు ఎలాగూ అన్నిటికీ వా

అన్నయ్యా యిష్టం అంటావని తెలిసి, మీ అన్నయ్యా సోమయాజులు పేర రాశాను ఇక్కడికి రమ్మని. అతను నా మాట కాదనకుండా ఉత్తరం అందిన వెంటనే బయలుదేరి వచ్చేశాడు. ఒక వారం రోజులపాటున్నాడు. హాయిగా మళ్ళీ చిన్నతనం వచ్చినట్లుగా నే ఆ వారం రోజులూ గడిపేను.

అతనితో నా అభిప్రాయం చెప్పాను. ఇద్దరం కలిసి బయలుదేరి నీదగ్గరకు రావాలనుకొన్నాము. కాని, నాకు నచ్చలేదు. యాజులు అన్నాడు, పోనీ నేను వెళ్ళి కనుక్కొంటానని. నాకు అదీ ఇష్టం లేకపోయింది.

నిన్ను ఏమాత్రం బలవంతం చెయ్యడం నాకిష్టం లేదు. నేను గాని, మీ అన్నయ్య గాని, ఎదురుగా ఉండి, గట్టిగా నిన్ను అడిగి, నీ అభ్యంతరం ఏమిటి చెప్పు అంటే నువ్వేమీ చెప్పలేవు అని నాకు తెలుసును.

కాబట్టి నేను నీకు తగినంత వ్యవధి ఇస్తున్నాను. అంతే కాదు, నీకు ఇష్టం లేకపోతే అందుకు కారణాలేమీ తెలియజేయ నక్కరలేదు. మళ్లీ నీ జీవితమార్గంలో ఎన్నటికీ పొరపాటునైనా అడుగు పెట్టకుండా ఉండడానికే ప్రయత్నిస్తాను.

ఒకవేళ నువ్వే గాని ఇష్టపడితే, అంత అదృష్టమే గాని నాకు లభిస్తే, నీకు నేను పెద్ద ఐశ్వర్యమూ భోగభాగ్యాలూ కలుగజేస్తానని హామీ ఇవ్వలేను; కాని, నీ జీవిక గురించి నువ్వేమీ ఆలోచించవలసిన అవసరం లేకుండా బాధ్యత వహించగలనని మాట ఇస్తున్నాను. అంతే కాదు, నీ ఆనందాన్ని అనుబంధాలనీ వేటినీ విడిచిపెట్టుకో నక్కరలేదు. నీ మేనల్లుళ్లకు నీదగ్గర ఎంత చనవో నాకు తెలుసును. వాళ్లు కూడా నీదగ్గరే ఉండవచ్చును.

ఇక సంఘభయం గురించి; ఎందుకు నేను ఎక్కువగా రాయడం? మామూలు చదువు అనేది నీవు ఎక్కువగా చదువుకోకపోయినప్పటికీ, కొంత వయసు, ప్రపంచజ్ఞానం ఉన్నాయి గనక, ఒకరి సలహా అక్కరలేకుండా నువ్వే స్వయంగా ఆలోచించగలవు. ఒకప్పుడు నా దృష్టిలో మీ అన్నయ్య దృష్టిలో నీ నిర్ణయం పొరపాటు కావచ్చును. కాని, పొరపాటో మంచో, ఎవరి భవిష్యత్తుని నిర్ణయించుకొనే అధికారం వారిది. నే నిదంతా ఎందుకు రాస్తున్నానంటే, తానెంత సనాతనవాతావరణంలో పుట్టి పెరిగినవాడైనా మీ అన్నయ్యకు మాత్రం ఈ అంశంలో ఎటువంటి అభ్యంతరం లేదు. ముఖ్యంగా మనిద్దరికంటె ఇటువంటి విషయాలు బాగా, మన అనుబంధాన్ని ప్రస్తావించకపోయినా తాను సంఘంలో ఎక్కువ అనుభవం ఉంది.

నేను నిశ్చితంగాని అప్పుడు పోతిపోకుండా మామయ్యగారింట్లో నే ఉంటేనంటే సరస్వతి నే గాని ... కాని, నేనున్నా మీ నాన్న ... మామయ్యగారు చెప్పి చెయ్యను ఒప్పుకోండికి ఇష్టపడకపోయారు; నా మామయ్య కూడా ఎలాగో నా మొహం చూసి, మంచిమాటలు చెప్పి, కొన్నాళ్ళిచ్చి పెళ్ళి చేసి ఉంచేవాడు. ఎందువల్లనయితే నేం, నేను బయటపడ్డాను. చాలా చాలా తిరిగాను. ఎన్నెన్నో క్రొత్త క్రొత్త పరిస్థితులను చూశాను. కాని, తిరిగి తిరిగి భూమి గుండ్రంగా ఉంటుందన్నట్టు చరిత్ర పునరావృత్తమవుతుందన్నట్టు, కొంత విచారంతో మళ్ళీ బయలుదేరిన చోటికే వచ్చి చేరేను.

నేను నిన్ను కోరుతున్నాను; అంటే నా కోసం నిన్ను త్యాగం చెయ్యమని కాదు. నీకు నాతోడి సాహచర్యంవల్ల ఏ కొంచమయినా ఆనందం లభించగలదని ఆశ భాసిస్తే అప్పుడను. లేదా ఇంకా ఆలోచనకి వ్యవధి కావాలంటే అలాగే కానీ. మనం అంతా వర్తమానాన్నిబట్టి భవిష్యత్తుని ఊహించుకొంటాం. ఈ రకమయిన కలయికవలన మన యిద్దరి జీవిత వీణలూ సమశ్రుతిలో మేళవించి అలరించగలవని నా నమ్మకం.

తప్పకుండా జవాబు రాస్తావని నమ్ముతున్నాను. బహుశః మీ అన్నయ్యకూడా నీకు ఈ సంగతే రాయవచ్చును. కాని నువ్వు మాత్రం అనవసరంగా మొగమాట పడవద్దు. నీకు ఈ నెలాఖరువరకూ ఆలోచించుకొండానికి సమయం ఇస్తున్నాను. ఈలోగా నీ దగ్గరనుండి ఏ ఉత్తరమూ లేకపోతే నీకు ఈ అంశం ఇష్టం లేదని నిర్ణయించుకొంటాను.

ఇట్లు
ఇంతకాలానికి నీవాడు కాగోరే
కృష్ణమూర్తి.

* * * *

చి॥ కృష్ణమూర్తికి ఆశీర్వచనపురస్సరముగా సోమయాజులు వ్రాయునది. ఉభయకుశలోపరి. త॥ నీదగ్గరనుండి వచ్చిన తరవాత నేను మా సరస్వతి పేర ఉత్తరం రాశాను. నా ఉత్తరం అందిన రెండు రోజుల నాటికే నీ ఉత్తరం అందినదట. అందుమీదట తన

క్షేమో గాభరాగా ఉన్నదని నన్ను రావలసినదని ఉత్తరము వ్రాసినది. నేను ఇక్కడ మిక్కిలి పని తొందరగా ఉన్నను ఎట్లో వీలుకలుగజేసుకొని వెళ్లి ఒక మూడురోజులుండి వచ్చినాను. మీ ఊరు మీదుగా రావాలనుకొన్నాను గాని, ఇక్కడ ఒక ముఖ్యమయిన రిజిష్ట్రేషనువ్యవహారం ఉండి తిన్నగా రావలసి వచ్చినది.

నేను నీతో చెప్పిన అభ్యంతరాలే తానూ చెప్పింది; నువ్వు నాకు చెప్పినయిష్టాలన్నీ నావే అయినట్లుగా చెప్పాను. తాను అంతా మీయిష్టం, మీరెలా అంటే అలాగే చేస్తాను అంటుంది. నేను స్పష్టంగా చెప్పాను, నీ స్వబుద్ధిపూర్వకంగా నే జరగాలి తప్ప ఇందులో మా బలవంతం అనేది ఎంత మాత్రం ఉండకూడదని.

ఇది ఇలా ఉండగా ఇంకొకవిషయం ఆలోచించడం మనం మరిచిపోయేము; మొన్న మా సరస్వతి జ్ఞాపకంచేసేవరకు నాకీవిషయం స్ఫురణకే రాలేదు. సరస్వతికి సంబంధించినంతవరకు మా యిద్దరికీ యిష్టం అయితే చాలును. అభ్యంతరం చెప్పేవారెవరూ లేరు. కాని, నీకు సంబంధించినవారి ఇష్టానిష్టాలు మాత్రం గమనించవద్దూ! దైవికంగా నీకు లభించిన మీ తల్లిదండ్రులకూ, ముఖ్యంగా మీ చెల్లెలు కాంతకూ అంగీకారం అవునో కాదో మనం తెలుసుకోవలసి ఉంటుంది.

నీకు గట్టిగా బుద్ధిపుట్టినట్లయితే ఎవరి ఇష్టానిష్టాలను లక్ష్యంచేసేవాడివి కావని నాకు తెలుసును; కాని, వారికి ఏమాత్రం ఇష్టంలేకపోయినా వారి మనస్సులను కష్టపెట్టడం మంచిపనికాదు. నువ్వు ఊ అంటే నీకు కావలసినటువంటి సంప్రదాయమయిన సంబంధం తీసుకొనిరాగలను. సరే, మరెందుకిన్ని మాటలు, నువ్వు మీవాళ్లకు రాయి. వాళ్లింకా అక్కడే ఉన్నారుకదా! నీ ఉత్తరం చూసుకొని అవసరమయితే నేను బయలుదేరి వస్తాను

ఈమధ్యను కామాక్షినిగురించి ఎవరెవరో వదంతులు లేవదీసే నేను నమ్మలేదు. అంతా పదిహేను రోజులయింది కాబోలు మగపిల్లవాడు పుట్టి. ఊళ్లో అందరూ అనుమానించినట్లు, ఆశించినట్లు ఏ విపరీతమూ జరగలేదు. కామాక్షి మామూలుగానే ఉందిట; తల్లీ పిల్లవాడూ బాగా ఆరోగ్యంగానే ఉన్నారు. ఊళ్లోవాళ్ళు కూడా అప్పుడే బాహాటంగా రాకపోకలు సాగిస్తున్నారు. వితంతువు కన్నదంటే అదేదో వింత అని చూడడానికి ఎగబడుతున్నారు. అంతే కాదు, ఇప్పటికింకా శిశువు తండ్రి ఎవరో తెలియలేదు; నలుగురూ నాలుగు విధాల బుద్ధిబలాన్ని వినియోగించి కనుక్కోడానికి ప్రయత్నిస్తున్నారు. కొందరిచేత అజ్ఞాతపితగా అంచనా కట్టబడిన వ్యక్తులే తామూ మరికొందరిని అనుమానిస్తున్నట్టున్నారు. అసలిందులోకల్లా చిత్రం ఎక్కడుందంటే ఆమధ్యను కొన్నాళ్లు (అంటే ఒక పదిరోజులపాటు) కామాక్షి కనబడలేదట. కాబట్టి నీ చిన్నతనపు చనువు స్నేహము బాంధవ్యమూ వీటిని పురస్కరించుకొని నువ్వే ఈ అజ్ఞాతపితవు ఏల కారాదు అనే ఊహాశాలులు కూడా లేకపోలేదని వినికిడి! నీగురించి అసందర్భంగా నాతో మాట్లాడ్డానికి ఎవరికీ సాహసం ఉండదులే.

నువ్వు మన అభిప్రాయంగురించి మీవాళ్లకు ఉత్తరం మూలంగా తెలియజేస్తావో, లేక నువ్వే అక్కడికి వస్తావో, ఏమైనాసరే పర్యవసానం నాకు వెంటనే తెలియజేస్తే నేను బయలుదేరి వస్తాను. మీ వాళ్లనుమాత్రం అనవసరంగా ఒత్తిడి చెయ్యడం నాకిష్టంలేదు అయినా నీకు నేను చెప్పేపాటివాణ్ణి కాను.

ఏ సంగతీ వెంటనే ఉత్తరం రాయగోర్తాను.

ఇంతే సంగతులు, గ్రహించవలెను,

ఆ॥ సోమయాజులు వ్రాలు.

* * * *

ప్రియమైన అన్నయ్యకు కాంత అనేక నమస్కారములుచేసి వ్రాయునది. తి॥ ఇచ్చట నేను శ్రీ మీ బావగారు, చి॥ వెంకటరమణ, మ॥ ల॥ స॥ అమ్మ మ॥ గా॥ శ్రీ నాన్నగారు అంతా క్షేమంగా యున్నారు. అచ్చట నీ క్షేమసమాచారము తరుచు వ్రాయించగోర్తాను

ఈ మధ్యను నీవు పంపిన నూటయాభై రూపాయిలు మనియార్డరు అందినది. కాని, శ్రీ మీ బావగారికి చాలా కోపం వచ్చినది; మన యింట్లో మీ అమ్మగారూ నాన్నగారు ఉన్నందుకు ఖర్చుల నిమిత్తం పంపినావేమిటి మీ అన్నయ్య అన్నారు. మనియార్డరు తిప్పి పంపిస్తానన్నారు. కాని నేను చెప్పినమీదట ఊరుకున్నారు.

ఇక, అసలు సంగతి—నీ ఉత్తరం అందిన వెంటనే, అనగా మొన్న సాయంకాలం బయలుదేరి, అమ్మా నేనూ వెళ్లేము. మేము ఫలానా అని నేను చెప్పాను. ఎక్కువగా మాట్లాడలేదు. ఒక్క పదినిమిషాలు మాత్రమే కూర్చున్నాము; ఆవిడ కాఫీ పెడుతున్నారు. ఇంతలో హఠాత్తుగా

అమ్మకు గుండెలో నొప్పివచ్చింది. వెంటనే మేము వెళ్ళిన జట్కాలోనే తిరిగివచ్చాము. నీ పెళ్ళివిషయంలో వర్ణాంతరవివాహం చేసుకొన్నా, విజాతీయ వివాహం చేసుకొన్నా నీమీది అభిమానంకొద్దీ అమ్మా నాన్నా అంగీకరించకపోరు—అమ్మను నేను తరచి తరచి అడిగేను తనకు మనసులోకూడా ఎటువంటి అభ్యంతరమూ లేదంది. ఒక్కమాట మాత్రం ఏదో మాటవరసను అంది—అయితే ఆవిడ మీ అన్నయ్యకంటె చిన్నదయి ఉంటుందంటావా అని. బహుశః ఆవిడ బట్టకట్టుపద్ధతి, మాటతీరు, అలంకారాలేని శరీరమూ అమ్మకు తోపింపజేసి ఉంటాయి. నేను అంతా చెప్పాను. నీ చిన్నతనము, ఒకే ఊళ్ళో కొంతకాలం పెరగడం, ఆవిడ నీకంటె బాగా అయిదారేళ్ళు చిన్న అయిన సంగతిని స్పష్టంగా చెప్పాను. అమ్మ తనకు ఎటువంటి అభ్యంతరమూ లేదంది ఇక నాన్నగారు, తనకిది సంపూర్ణంగా ఆమోదమనీ, తను బ్రతికి ఉండగానే ఈ శుభం జరిగిపోవడంకంటె తనకు వాంఛనీయ మింకేమీ ఉండదనీ అన్నారు అందరికంటె ముఖ్యంగా మీ బావగారికి చాలా ఇష్టంగా ఉంది. నేను మొదటి నుంచీ అనుకొంటూనే ఉన్నాను, బావ అందరిలాగా కాక, ఏదో విలక్షణమయిన పని చేస్తాడని. విలక్షణత్వమే కాదు, వెలకి విలువయిన మంచి పని చేస్తున్నావన్నారు, నేనువెళ్లి చూసివచ్చి చెప్పేక—కాబట్టి ఇక్కడ మా యావన్మందికీ అంగీకారమే కాక చాలా ఆతృతగా ఉంది. కాబట్టి మీ స్నేహితులు సోమయాజులుగారికి వెంటనే రాసి, సాధ్యమయినంత త్వరలో ముహూర్తము నిర్ణయింపజేయవలసిందని నాన్నగారూ, మీ బావగారూ రాయమన్నారు. పెళ్ళికూడా అక్కడెక్కడో పల్లెటూళ్లో కాక ఇక్కడే అయితే బాగుంటుంది; ఏమంటే నాన్న ప్రస్తుతం కదల్చవీలైనస్థితిలో లేరు ప్రత్యేకించి ఏమీ లేదుగాని, క్రమక్రమంగా నీరసించిపోతున్నారు. డాక్టరుగారుకూడా మరీ ఎక్కువ ఆశాజనకంగా మాట్లాడ్డం లేదు.

అన్ని సంగతులతోనూ వెంటనే ఉత్తరం రాస్తావని నమ్ముతున్నాను. వీలయితే నువ్వే ఒకమారు రావలెను—రాలేకపోతే, ప్రెస్సుకి సంబంధించిన వ్యవహారాలన్నీ వివరంగా రాస్తే నాన్నగారు సంతోషిస్తారు.

ఇంతకాలానికి నీకిటువంటి బుద్ధి పుట్టినందుకు మాకెంతో సంతోషంగా ఉంది. ఏమాత్రం ఆలస్యం కాకుండా వీలయినంత త్వరలో నీవూ సోమయాజులుగారూ కలిసి నిర్ణయించ గోర్తాను.

ఇంతే సంగతులు. చిత్తగించవలెను.

ఇట్లు,

నీ ప్రియమైన చెల్లెలు

శాంత.

* * * *

జీవితేశ్వరి సరస్వతికి!

ఇవాళ ఆషాఢ శుద్ధపాడ్యమి. ఉదయం అంతా వర్షం పడుతూ ఉండడం చేత పనివాళ్ళకి మధ్యాహ్నం సెలవిచ్చేశాను. భోంచేసి పుస్తకం చదువుతూ పడుకొన్నాకే చల్లగా నిద్రవచ్చింది. ఇప్పుడే లేచి క్రిందకు వెళ్ళి ముఖం కడుక్కొని కాఫీ ఫలహారం చేసివచ్చాను. శాంతి బజ్జీలు బూంది చేసింది. ఎంత బాగున్నాయనుకొన్నావు బజ్జీలు! అవి తింటూంటే నువ్వు చేసిన చేగోడీలు జ్ఞాపకం వచ్చేయి చిన్నప్పుడెప్పుడో మా అమ్మ చేసింది; తరవాత మళ్లీ నువ్వు చేసేవు, ఈమధ్యకాలంలో అంత రుచికరమయిన ఫలహారం ఎన్నడూ తినలేదు.

ఫలహారం చేసివచ్చి చదువుదామని పుస్తకం తీసేను; కాని ఏమీ చదవాలనిపించలేదు. చుట్టూ ఎటు చూసినా అన్నీ కొండలలా మేఘాలే. కవికుల గురువు కాళిదాసు ఏ కాలంలో రాశాడో మేఘసందేశం, 'ఆషాఢస్య ప్రథమ దివసే మేఘమాశ్లిష్ట సానుమ్' అని. అలా నిరంతరంగా వాటివంకే చూస్తూ ఉంటే నాటి యక్షుడికే కాదు, ఏనాటి ప్రేమభిక్షువుకైనా ఆషాఢమేఘం ప్రియురాలికి తన సందేశం తీసుకొని వెళ్ళగలగడంలో అసందర్భం ఏమీ గోచరించదు.

రెండు సంవత్సరాల క్రితం ఆషాఢమేఘాలు కేవలం పనికి ఆటంకాలుగా మాత్రమే నాకు గోచరించేవి. అయితే ఆసంవత్సరం వర్షాకాలంలోనే నిన్ను చూడగలిగేను. గతవర్షాకాలం అంతా మనం కలిసే ఉన్నాము. వర్షామేఘాలు బలవంతంగా సెలవులిప్పించి మనలను కలిపి ఉంచే ఆప్తులవలె ఉండేవి. ఈ సంవత్సరం మనం దూరంగా ఉన్నాము. కాని, మన మనస్సులను మాత్రం ఈఎడబాటు బాధించేదికాదు; ఇందులో మన పొరపాటు ఏమీ లేదు; ఒకరి అజ్ఞాపనా లేదు. అంతేకాదు, భవిష్యత్తునిగూర్చి ఒక సుందరస్వప్నం కంటున్నాము మనం. కావాలంటే ఏరోజయినా

నీదగ్గరకి రాగలను. కాని, రాను. అంతా సవ్యంగా జరిగింది అని ఉత్తరం వచ్చేవరకూ నేను రాను. నాకు మొదట్లో భయంగా ఉండేది; మన వివాహబంధాన్ని అనేకవిధాలుగా నిరసింపదలచినవాళ్ళకి ఎక్కువ సావకాశంగా ఉంటుంది, మనకి సంతానం లేకపోతే. అంతేకాదు, నామటుకు నాకుకూడా, ఇదివరకల్లాలేదు, మా శాంతకొడుకు వెంకటరమణని చూసినదగ్గరనుండీ పిల్లలంటే మక్కువ ఎక్కువయింది. మా శాంత ఇక్కడినుండి వెళ్ళిపోయేటప్పుడల్లా బైటికి అనకపోయినా నాకు మనసులో ఎంతో బాధగా ఉండేది. అందమైన పసిపాప మనమీద ఆధారపడిఉండి మనలనే కావాలనడంకంటె మధురమైన అనుభవం ఇంకేముంటుంది?

ఇంకా ఏమిటేమిటో రాయాలనుకొన్నాను. కాని మరి లాభంలేదు; వెంకటరమణవచ్చి కాగితప్పడవలు, తిరిగేచక్రాలు చెయ్యమంటున్నాడు. గడియారం అరగంట కొట్టడానికి ఇక రెండునిమిషాలు మాత్రమే ఉంది. అంతే వ్యవధిఇచ్చాడు వాడు నాకుఅత్తయ్యకు ఉత్తరం రాసుకొందికి.

నువ్వు ఏదో ఉత్తరానికి ఉత్తరం జవాబు అన్నట్టుకాకుండా పెద్ద ఉత్తరం అన్ని సంగతులతోనూ రాస్తావని నమ్ముతున్నాను.

ఇక్కడ అమ్మ ఆరోగ్యం అలాగే ఉంది; మొదటినుంచీ ఆవిడ అంటూఉండేది నాన్నగారు పోయినతర్వాత మరొక్క ఏడాదికంటె బ్రతకనని. ఇప్పటికి ఆయనపోయి ఎనిమిదినెలలయింది. డాక్టరుగారుకూడా అంత ఆశాజనకంగా చెప్పడంలేదు.

మీఅన్నయ్య అసలేఉత్తరం రాయడంలేదు. ఒకటి రెండురోజులు ఆలస్యం అయినా పెద్దఉత్తరం రాస్తావుకదూ? నీఆరోగ్యం చాలా జాగ్రత్తగాచూసుకోవలసిందని నేను పదేపదే రాయనక్కరలేదు.

నాకు మావాడిచ్చిన టైము దాటి మరి రెండునిమిషాలైంది. రాస్తావుకదూ!

ఇట్లు,

నీవాడు, కృష్ణమూర్తి.

* * *

ప్రియమైన అన్నయ్యకు శాంత అనేక నమస్కారములుచేసి వ్రాయునది. త॥ నీ ఉత్తరం అందినది. అక్కడనుండి శుభలేఖకూడా వచ్చినది. తల్లీ పిల్లా క్షేమంగా ఉన్నందుకు చాలా సంతోషం. అందరితోపాటు నేనూ మొదటిమారు మగపిల్లవాడు పుట్టాలని కోరినప్పటికీ ఆడపిల్ల పుట్టిందంటే ఎంతో సరదాగా ఉంది. నేను బైటికి అనకుండా మనసులో ఉంచుకొన్నమాటను మీబావ బైటికి అనేశారు. అయితే మన వెంకటరమణకు పెళ్లాం పుట్టిందన్నమాట! అని. సరే సంబంధాల మాటకేమి, పిల్లలు ఏ అనారోగ్యమూ లేకుండా పెద్దవాళ్లయితే అంతే చాలును.

బారసాల పదకొండవరోజున కాక ఇరవై ఒకటవ రోజున చేస్తే బాగుంటుందని మీ బావగారు రాయమన్నారు. నాటికయితే మేము రాగలముగాని, అమ్మని ఎలా కదపడమో తెలియకుండా ఉంది. బహుశః రెండుమూడు రోజుల్లో మద్రాసునుండి మా ఆడపడుచు, అత్తగారూ రావాలి; వాళ్లు వస్తే బాధ లేదు, అమ్మను ఇక్కడే ఉంచి నేనూ మీ బావగారూ కలిసివస్తాము.

చి॥ వెంకటరమణకి అక్షరాలు వచ్చేయి; గుణింతాలు నేర్చుకుంటున్నాడు. అస్తమానం నిన్ను తలుస్తూఉంటాడు. తనకొక సైకిలు కొనిపెట్టమని గోలచేస్తున్నాడు; సైకిలెక్కి తిన్నగా రోడ్డంట వెళ్లిపోతే మామయ్యగారి ఊరు వస్తుందిట!

ఈమధ్యను మీ బావగారికి ఒక పజిలులో పన్నెండువందల రూపాయిలు వచ్చిందిట; అంటే ఇంకా చెక్కు రాలేదు; పజిల్సంటే నవ్వేవాడు, మీ అన్నయ్యకి రాయి అన్నారు. ఇక్కడ చలి మామూలుకంటె ఈ సంవత్సరం ఎక్కువగా ఉంది. మా చేమంతులు ఇదివరకటికంటె కూడా బాగా పూచేయి. ఈ మధ్యను మీ బావగారి పార్టీ ఒకరు ఆయనకొక పెద్ద పళ్ళతోట పువ్వులతోట ఉన్నాయిట; రకరకాల పూలమొక్కలు పంపించేరు గోతాల్లో. మా డాబా అంతా వాటితో నిండిపోయింది. ఇదివరకు నాకు తెలియని ఎన్నో రంగుల పువ్వులున్నాయి. నీకు పువ్వులంటే అంత సరదా! ఒకటిరెండు రోజులు ముందుగా బయలుదేరివస్తే అందరం కలిసి వెళ్దాము బారసాలకు. నీ క్షేమం వెంటనే రాయగోర్తాను.

ఇట్లు

నీ ప్రియమైన చెల్లెలు శాంత!

* * * *

జీవితేశ్వరి సరస్వతికి !

నేను చాలా కోపంతెచ్చుకొని అసలే నీకు ఉత్తరం రాయకూడదనుకున్నాను. అయితే ఉత్తరమే రాయకపోతే నాకు కోపంవచ్చినట్లు నీకు తెలియడం ఎలాగ?

తీరా ఉత్తరం ఆరంభించి జీవితేశ్వరి అని సంబోధించడంతో సగం కోపం చల్లబడిపోయింది. కోపమయినా, ఎదురుగా మనిషిఉండి మాటకి మాట అంటూ ఉంటేనేగాని, రాజుకోదు.

సరేగాని, నువ్వింకా రావడానికి ఎంతకాలం పడుతుంది? పెళ్ళికి వెళ్ళి వారంరోజుల్లో వస్తానన్నదానివి, ఇప్పటికి నెల దాటింది. ఎప్పుడు రాదలచుకొన్నదీ ఉత్తరమయినా లేదు, అసలు అక్కడి ఆ హడావిడిలో నేను జ్ఞాపకం ఉన్నానా అని అనుమానం.

నీ దగ్గరనుండిగాని రెండుమూడు రోజుల్లో ఉత్తరం రాకపోతే ఈమారు నేనూ నీతో చెప్పకుండా ఎక్కడికో వెళ్ళిపోయి కొన్ని నెలలయితే నేగాని తిరిగిరాను.

ఇందిర బాగా ఆడుకుంటుందా? నువ్వు చెప్పిన లెక్కప్రకారం అయితే ఈపాటికి బంగరడం వచ్చి ఉండాలి.

నేను అట్టే ఎదురుచూడను; నీ యిష్టం అయితే ఉత్తరం రాస్తావు, లేకపోతే లేదు, నిర్బంధించడానికి నే నెవర్ని.

నీవాడు, కృష్ణమూర్తి.

*　　*　　*　　*

సరస్వతీ! మీ అన్నయ్యరాసిన ఉత్తరం అందింది. అందులో రాసినప్రకారం బయలుదేరే మాటయితే ఈ ఆదివారంనాడు బయలుదేరాలి. అంటే నాలుగురోజులే ఉంది.

ఇందాకా ప్రెస్సునుండి తిరిగి వస్తుండగా టెలిగ్రాము వచ్చింది మా బావకు జబ్బుగా ఉంది వెంటనే రావలసిందని. నేను ఇప్పుడు మూడుగంటల బండికి వెళ్తున్నాను. అందుచేత మీరు ఆదివారం నాడు బయలుదేర్కి, ఇక్కడిదాకా తిన్నగా రాకుండా మా చెల్లెలుగారి ఊళ్ళో దిగితే అక్కడ అవసరముంటే అందరం ఉంటాము. లేకపోతే కలిసి రావచ్చును—టెలిగ్రాంలో కేవలం జబ్బుగా ఉందని మాత్రమే ఉంది. అయినా ఎందుకో చాలా భయంగా ఉంది. అక్కడకు వెళ్ళి పరిస్థితిఅంతా చూసి ధైర్యంగా ఉంటే వైరుచేస్తాను. వీలయితే ఆదివారం దాకా ఎందుకు, ఈలోగానే బయలుదేరకూడదూ? ఓహో, ఇది మీ కందడమే శనివారంనాడు అందుతుంది. ఏమిటో మనస్సు సరిగా పనిచేయడంలేదు. ఇవతల ప్రెస్సులోకూడా ముఖ్యమయిన పనివాళ్లిద్దరు లేరు; చాలా తొందరగా చెయ్యవలసిన పని ఎంతో ఉంది. సరే కానీ ఏంచేస్తాం? ఇది నీకందేలోగానే టెలిగ్రామిస్తానేమో! లేక ఇంట్లో మరెవ్వరూ లేక గాభరాపడి మా చెల్లెలు టెలిగ్రా మిప్పించిందేమో? ఇది అందినతరవాత మరి ఆలస్యం చెయ్యవుకదూ.

నీవాడు కృష్ణమూర్తి.

*　　*　　*　　*

ప్రియమైన బావ సోమయాజులుకు అనేక నమస్కారములు. ఈ రోజునే మా బావగారు ఆరోగ్యస్నానంచేసినారు. రేపు ఉదయం రైలులో బయలుదేరి మేము వెళ్తున్నాము. మా బావగారూ, మా చెల్లెలు శాంత నువ్వు ఆనాటికి సరిగా ధన్వంతరిలాగ అవతరించావంటున్నారు. నిజంకూడా అంతే. ఆవేళగాని నువ్వు వచ్చిఉండకపోతే ఏమయేదో? ఇక్కడ ప్లీడర్లలో మూడువంతులు మంది తమతమ దీర్ఘవ్యాధులను నీచేత నయం చేయించుకోవాలనుకొంటున్నారు. నేను వద్దంటున్నా వినకుండా మా బావగారు నీపేర ఈ ఉదయం రెండువందల రూపాయిలు మనియార్డరు కట్టేరు; అది తిరగగొట్టవద్దని నా కోరిక. లేకపోతే ఆయనమనసుకి చాలా కష్టంగా ఉంటుంది—త్వరలో అక్కడికి జవాబు రాస్తావు కదూ!

కృష్ణమూర్తివ్రాలు.

[సమాప్తం]

# వజ్రహస్తుని అరసవెల్లి శాసనము

## కట్టి సాంబమూర్తి శాస్త్రి

గత మేనెల భారతి సంచికలో బ్ర. శ్రీ. మండ నరసింహముగారు ప్రకటించిన "వజ్రహస్తుని అరసవెల్లి శాసనము" అను వ్యాసమును జూచితిని. శ్రీ నరసింహముగారు ఆంగ్లాంధ్ర గీర్వాణ భాషలందు పండితులు. చరిత్ర పరిశోధనమున ప్రసిద్ధులు. అట్టి వారు ప్రకటించిన విమర్శనమున నే కాలకర్మముననో కొన్ని ప్రమాదములు ప్రవేశించినవి. వానిని సవరింపకున్న పాఠకులు భ్రమ ప్రమాదములకు లోను గావలసివచ్చునను నూహమున నాకు దోచిన కొన్ని విషయముల నిట బేర్కొనుచున్నాడను. విజ్ఞులు చి త్తగింతురుగాక.

శాసన ప్రతిబింబములు చాల అస్పష్టముగ నున్నవి. ముద్రితములగు వానివలన పాఠకులకు లాభము లవలేశమాత్రమే. తుప్పుపట్టిన భాగములను వీరెట్లు చదివిరో యెట్లు పూరించిరో తెలుపలేదు. ఆ పూరితములు కుండలీకరణములోనున్నవని సూచించినారు. కాని కుండలీకరణములు మొదటిరేకునందలి గ్రంథమున దక్క నికెక్కడను లేవు. కావున తక్కినభాగమెల్ల నున్నది యున్నట్లెంచుకొనవలసినదేనా? ఈ శాసనము ఒకటేనా, లేక రెండా యను సందేహము కలుగుచున్నది. నాలుగవరేకు రెండవపెడ ఆరవ బంతిలో "ప్రదత్తమస్మాభిర్భావిభూమిపాల...మమ ధర్మ చోరవత్పాలనీయమితి" అని ముగింపబడినది. తరువాత భాగము "వజ్రహస్తదేవినామా...అరసవిల్లి గ్రామప్రతేస్య" అని ఆరంభింపబడినది. ఆఖరున "దత్తివంతే" అని ముగింపబడినది. మొదటి భాగము చివర మాత్రము శాసనములందు సామాన్య లక్షణమగు భావి భూమి పాలరక్షణాశంస కలదు. ద్వితీయభాగమున నదిలేదు. అందుచే నీ శాసనమసంపూర్ణమేమో యను సంశయము కలుగుచున్నది. శాసనమందలి సంస్కృత భాగము సంస్కృత గద్య పద్యాత్మకము, అందలి కవిత మంచిది. చిక్కొల వలస శాసనమందలిదే. దానమీయబడిన గ్రామము ప్రతిగ్రహీతల నామములు మొదలుగ భాష మారిపోయి తప్పులధికముగ నగపడుచున్నవి. "లేఖక దోషము లరుగు." అని శ్రీ నరసింహముగారెట్లు వ్రాసిరో దురూహ్యము! నాలవరేకు మొదటి పె మొదటి బంతిలోనే "కాయస్థవరేష్ఠః" (వరిష్ఠః అనుటకు) "మహాప్రధానేః" (మహాప్రధానః)" అనుటకు, రెండవబంతిలో "పుత్రః" అనుటకు "పుత్రోః" అని చెక్కబడుట అరుదగునా? "అత్యుత్తర నియోగ" అని శ్రీ నరసింహముగారిచే పేర్కొనబడిన పదము శాసనమున "నచ్ఛ్యుత్తర నియోగ" అను రూపమున నుండుట సరియగునా? "తేషాం భాగేషాం మధ్యే" అను ప్రయోగ మెవ్వరైన ప్రయోగింతురా?, ఇవి భాషా రచయిత దోషములో, లేఖక దోషములో నిర్ణయింపవలసియున్నది. రచయిత రచించిన గ్రంథమును లేఖకుడు సరిగ చెక్కక తన యిచ్ఛ వచ్చినట్లు చెక్కి పాఱవేసినాడని నా తలంపు.

శ్రీ నరసింహముగారు ప్రతిగ్రహీతలను గూర్చి వ్రాసినవిషయములు చాల నప్రమాణములై యున్నవి. గ్రామభాగములు కొందఱు కాయస్థులకును, శూద్రకులజాతులగు కొందఱు రట్టడులకును నీయబడినవి. కాయస్థుల విషయమున కాశ్యప గోత్రోత్పన్నులని పేర్కొనబడినది. రట్టడుల గోత్ర ప్రశంసలేదు. నాలుగవ రేకు రెండవపెడ రెండవ బంతి చివర "పునః శూద్ర వంశోద్భవ" యని రట్టడులను పేర్కొన్నాడు. కాని శ్రీవారందఱను కలగూర పులుసు వండినారు. గోత్రోత్పన్న, గోత్రోద్భవ శబ్దముల నాధారముగా గొని మిక్కిలి అప్రమాణములలిఖించినారు. ప్రతిగ్రహీతలగు కాయస్థులందఱు (ప్రథమ భాగమున) కాశ్యపగోత్రోత్పన్నులుగానే పేర్కొనబడినారు. వారందఱనామముల చివర నాయక బిరుదము గలదు. ద్వితీయ భాగమున "వజ్రహస్తదేవినామా" అని శ్రీ నరసింహముగారు చదివిన భాగమున ప్రతిగ్రహీతలకు నాయక బిరుదములున్నవి కాని వారి గోత్రము చెప్పబడలేదు. ఐదవ రేకు రెండవ పెడ రెండవ, మూడవ బంతులలో "శరస్థ వంశోద్భవ చీడనాఖ్యస్య" అను నొక పదసమూహ

మున్నది. ఆ చీడనకు గోత్రము కాని నాయక బిరుదమో రట్టడి బిరుదమో గాని లేవు. పైగా శశస్థవంశోద్భవుడని చెప్పబడినది. కాగా నతడు కాయస్థ రట్టడులకంటె వేఱు కులమువాడు కాదగును. ఉన్న విషయ మిట్లుండ "ఉత్పన్న, ఉద్భవ" శబ్దముల కర్థ భేదము కల్పించి, వర్ణసాంకర్యము కల్పించుటకు శ్రీనరసింహముగారి కాధార మేమో తెలియకున్నది. "బ్రాహ్మణ గోత్రోత్పన్నులన, బ్రాహ్మణ పురుషులకు క్షత్రియాది స్త్రీలవలన జనించిన సంతానము కావచ్చును. కాశ్యప గోత్రోత్పన్నులగు కాయస్థులు బ్రాహ్మణులకు తదితర స్త్రీలకు జనించినవారనియు, కాశ్యపవంశోద్భవులన స్వచ్ఛమగు నౌరస జాతులనియు దెలియవచ్చుచున్నది" అని వ్రాసినారు. ఇది సరిగాదు. ఇందు వ్యభిచారప్రశంస లేశమును లేదు. వంశసాంకర్య మంతకంటె లేదు. కాశ్యప గోత్రోత్పన్నుడు, కాయస్థ వరిష్ఠుడు, మహాప్రధానుడు, నగు "దాలమప్రెగ్గడ." అతని భార్య "మవనక." ఆ దంపతులకు పుత్రుడు మండప నాయకుడు. విద్దాము, మేడము, పోతమాఖ్యలు దుహితలు. వీరి నలుగురకు గలిపి గ్రామము నాలుగు భాగములుగా జేసి యందొక భాగ మీయబడినది. దాలమ (దాలయ?) ప్రెగ్గడ కూతులు ముప్వురు స్త్రీలుమాత్రమే ప్రతిగ్రహీత్రులుగా నున్నారు. మరి యే స్త్రీయు ప్రతిగ్రహీత్రి గాలేదు. అందఱు పురుషులే. శాసనలేఖకుడు "నాయకేభ్యః" అనుటకు "నాయకిభ్యః" అని చెక్కిన తప్పు ననుసరించి శ్రీ నరసింహముగా రిట్లు వ్రాసినారు. కాబట్టి నాయక శబ్దము పురుషులకును, నాయకి శబ్దము స్త్రీలకును బిరుదము అని వ్రాయుట సరిగాదు. రట్టడిశబ్దవిషయమునగూడ శ్రీ నరసింహముగా రనవసర చర్చ గావించినారు. రట్టిడిశబ్దభవమే రట్టడి. దానినుండి రడ్డి, రెడ్డి పదములు పరిణమించినవి అనుట వాస్తవమే. ఆ రట్టడులు శూద్ర వంశోద్భవులని శాసనమందు స్పష్టముగ నుండ రట్టడి పదము కాయస్థులకు విశేషణముగా దగిలించుటకు ప్రయత్నించినారు.

శాసన మేమో ప్రాచీనమైనది. దానివలన ననేకములగు భాషావిశేషములు, చరిత్రవిషయములు, సాంఘికవిషయములు తెలిసికొనవచ్చును. అట్టివానికై ప్రయత్నింపక నప్రమాణములగు విషయములను అవిచారితముగ గల్పించినచో శాసనములివిలువయే చులకన కాగలదు.

## విశేషములు

శాసనమందలి కాయస్థపురుషులకెల్ల అకును నాయకబిరుదముగలదు. ఆ బిరుద మిప్పుడు "పట్నాయక" అను రూపముతో ఉత్కలకాయస్థులకును, తెలుగు శిష్టుకరణములకును గూడ బిరుదముగానే యున్నది. ప్రాచీనగాంగులు శైవమతాభినివిష్టులై, ఆర్షగోత్రముల జెప్పుకొనరైరి. వర్ణభేదమున్నట్లు వారి శాసనములవలన నెఱుకపడదు. కావున వారు యజ్ఞోపవీతములు ధరించియుండరని యూహింపనగును. దరిమిలా గంగవంశమువారు వైదికసర్మావలంబులై ఆర్షగోత్రముల దగిలించికొన్నారు ఆ భేదము తెలియుటకే గాంగవంశమును గంగవంశమునుగా మార్చుకొన్నారు. మన కాయస్థులుగూడ ప్రాచీనమగు నాయక బిరుదము (పట్నాయకు) నుంచుకొనియు, దాము వైదికమతావలంబులుమని దెలియుటకై తమ జాతికి శిష్టపదవిశేషణము చేర్చుకొన్నారు. కరణమను మాట ఉత్కలులకు నాంధ్రులకు నిప్పుడు సమముగా నుండనేయున్నది. నాయక, పట్నాయక శబ్దములకు భేద మంతగా లేదు. "రాజసంబంధి" యని తెలుపుటకు "పట్ట" శబ్ద ముపయోగించుట ఆనాట నీనాటనుగూడ ప్రసిద్ధమే. పట్టపురాణి, పట్టపుటేనుగు, పట్టమహాదేవి, పట్టాకత్తి, పట్టాపోతు, దానపట్టా మొదలగు శబ్దములలో పట్టాపదమునకు రాజసంబంధి అని యర్థము వ్యవహారప్రసిద్ధము. పురుషనామముల చివర ఇప్పటివలెనే పూజ్యతాద్యోతకమగు అయ్య, అన్న, అప్ప, అమ్మ, శబ్దములు గలవు. అవి ద్విత్వరహితముగా నుండుటగూడ మన భాషాసాంప్రదాయమే. నన్నయ, నన్నప, మంచెనల వలెనే, దాలమ(య) ప్రెగ్గడ, మండపనాయక, నడుపననాయక, శిరిపయనాయక, వజ్జినాయక, గండిమనాయక, నుంకమనాయక, గుండమనాయక, గంగన, అపితన| కవివయ, చన్దినప, విదున, చామిన, మాది, మావి, మాంకన, దుర్గన, కట్టన, విద్దన, చండినాయక, 'దామరనాయక, వేఱరాయినాయక, నుంకప, చీడన, భద్రి, చిరిపయ, అపితమనాయక, పిన్నమనాయక, మాపురనాయక, భద్రిమనాయక అను పురుషనామములీ శాసనమున నగపడుచున్నది. వెంకమశెట్టి, కృష్ణమనాయకుడు మొదలగువానివలెనె అమ్మ యను పూజ్యతావాచక మాకాలమందును పురుషుల కుపయోగింపబడెడిది. అయ్య, అప్ప, అన్న, అమ్మ అను నాలుగు శబ్దములు పురుషులకున్నవి. స్త్రీలకు అమ్మ, అప్ప, అక్క శబ్దముల సంక్షిప్తరూపములున్నవి. మవనక, విద్దమ,

మేడము, పోతము, పితిప, సాయుప, సర్వ్యప, కిన్నప, గోవక అని కలవు. ఇవి తక్క స్త్రీనామము లింక లేవు. "పిగ్గడ"యను శబ్దమొకటి గలదు. ఇది "ప్రగ్గడ, ప్రెగ్గడ" శబ్దము. దానిని లేఖకు డిట్లు రూపనాశము చేసినాడు. ఎఱ్ఱాప్రగ్గడ, సింగనప్రగ్గడ, మంత్రిప్రగ్గడలవలె నిదియు ప్రగ్గడ శబ్దభవమే కాని యితరము కాదనుటకు దాలమ(య)కు "మహాప్రధానః" అని విశేషించుటే ప్రమాణము. పురుషులకు దాలమయను పేరు లేదు. స్త్రీలకనేకుల కిపుడు నది కలదు. పురుషులకు దాలయ్య యను పేరీప్రాంతమున నిపుడు బహుళముగ నున్నది. బ్రాహ్మణులలో మాత్ర మగపడదు. బ్రాహ్మణేతరు లన్ని తెగలందును గలరు. గండిమ, గుండమ యను రెండు పదములున్నవి. ఇవి వేఱు పదములో లేక యొకటి తప్పో నిర్ణయింప వీలులేదు. వేఱుపదములుచో "గండిమ" పద మిప్పటి "గడ్డియ"కు మూలము, లేక తప్పుపడిన రూపాంతరము కావచ్చును. "అమ్మ" అనుటకు "అంమ" అని వ్రాయువా రిప్పటికిని లేకపోలేదు. "నుంకమనాయక" శబ్దమొకటి వింతయైనది. ఇప్పుడీ ప్రాంతమున నా పేరంతగా వినపడదు. కాని దక్షిణవిశాఖ, తూర్పుగోదావరి మండలములం దత్యధికముగ "నుంక" శబ్దమునుండి పరిణమించిన "నూక" శబ్దము "నూకాలు, నూకాలమ్మ, నూకలమ్మ, నూకయ్య, నూకన్న యనునది కలదు. "నూకాలమ్మ, నూకలమ్మ" యను ప్రసిద్ధ గ్రామదేవతలు విజయనగరముకడ పాలిపల్లిలోను, అనకాపల్లిలోను, తునిలోను గలరు. చిన్నమ్మవారు (వేపపువ్వు) అను స్ఫోటకము ఈ అమ్మవారికోపముచే కలుగునట. అట్లే జ్వరము లేకుండ ముత్తెములంతేసి బొబ్బలను పుట్టించు అమ్మవారు ఆటలమ్మ. ప్రసిద్ధమైన, ఘోరమైన మసూచివ్యాధిని కలిగించునది పెద్దమ్మవారట. వీనిలో నూకలమ్మ ఆగ్రహముచే కలుగు వేపపువ్వు వ్యాధి బహుళముగుటచే నా దేవతపేరు ఆ దేవతా ప్రీతికై చాలమంది తమ బిడ్డల కుంచెదరు. ఆనాడు నీనాడును ఆంధ్రదేశములో బహుళవ్యవహారములో నున్న యీ భాష తొమ్మిదివందల యేండ్లకు పూర్వము త్రికళింగాధిపతి శాసనములో నుండుటను, "శ్రీకాకుళ ముత్కలదేశమందలిదే" యను ఉత్కలవాదు లెట్లు సమర్థింపగలరో?

ప్రథమవజ్రహస్తునకు, మూడవ వజ్రహస్తునకును నడుమ మూడుతరములు గలవు. (1) వజ్రహస్తుడు. ఆతనికొడుకు (1) కామార్ణవుడు. (2) వజ్రహస్తుడు. ఆతని సుతుడు (2) కామార్ణవుడు. ఆతని కొడుకు శాసనదాత మూడవ వజ్రహస్తుడు. ప్రథమ వజ్రహస్తుడు పూర్వరాజులచే నైదుగా భాగింపబడి ఐదుగురచే ననుభవింపబడిన కళింగము నేకమొనర్చి పాలించినాడు. మూడవ వజ్రహస్తుడో త్రికళింగాధిపతి. అనగా నైదు ఒకటైన కొలదికాలమునకే యొకటి మూడైనదని తేలుచున్నది. మూడవ వజ్రహస్తుడు త్రికళింగాధిపతినని చెప్పుకొన్నను, మూడు కళింగములను సార్వభౌముడుగా నేలెనో, లేక త్రికళింగములం దొక్కదానినే యేలెనో స్పష్టపడుటలేదు. ప్రతి రాజును సామాన్యముగ నుపయోగించుకొను సకల కళింగాధి రాజపద మీతడు నుపయోగించుకొనియు, త్రికళింగాధిపతి యని మరల చెప్పుకొనుట సంశయమున కెడమిచ్చుచున్నది. కాని గంగరాజులందఱకు త్రికళింగాధిపులను బిరుదుండుటచే నది నిరస్తమగుచున్నది.

కాయస్థులు : కాయస్థ జాతిపరిణతి గూర్చి స్మృతులందు, పురాణములందు నెట్లు వర్ణింపబడినను, నాజాతి ప్రచండశాస్త్రతేజము కలిగి వంగదేశమున బహుకాలము రాచఱికము నెఱపినదే. వైదిక ధర్మములను, వర్ణభేదములను పాటింపని ప్రాచీన కళింగమున కూడ విరివిగ నిండియుండెడిది. ప్రాచీన గాంగవంశపు క్షత్రియులుకూడ వైదికాచారములను, వర్ణభేదములను పాటింపని పరమశైవులే. అయిన నాకాలమున గూడ వైదికకర్మావలంబులు లేకపోలేదు. కాని వారికి యజనాధ్యయదానములను మూడు కర్మలందే యధికారముగలదని దేవేంద్రవర్మ చీడివలసశాసనమున గలదు. కళింగమేలిన గాంగవంశజులే కాక ప్రాచీన చాళుక్యులుకూడ దమ శాసనములందు వైదికసంప్రదాయప్రసక్తిని దెలుపుకొనలేదు. (చూ॥ యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము.) గుణగ విజయాదిత్యుడాదిగనే వారు తాము మానవ్యసగోత్రులమనియు, పరమబ్రహ్మణ్య, పరమ వైష్ణవ, పరమ మాహేశ్వరులమనియు జెప్పుకొన్నారు. యుద్ధమల్లుడు తాను గొరవనియు (శైవుడు) గొరవలు కానివారు గుడిలో ప్రవేశింపరాదనియు చెప్పికొన్నాడు. యుద్ధమల్లుడు రాజరాజనరేంద్రునకు నూఱేండ్లు ముందువాడని కొందఱును, తరువాతివాడని కొందఱును జెప్పుచున్నారు. ఎట్లయినను వైదికాచరణము వర్ణవిభేదము పాటింపని శైవమతస్థులు చాళుక్యులలో నుండియుండి రనుట నిర్వివాదము. అట్లే ప్రాచీన గాంగవంశజులు వీరశైవులనియు, తరువాతి గంగవంశజులు ఆత్రేయ

గోత్రులు, పరమ మాహేశ్వరులు, పరమ భట్టారకులనియు జెప్పుకొన్నారు. వీరివలెనే పూర్వకాలమున వైదిక ధర్మధురీణులగు కాయస్థులు, తరువాతి కాలమున శిష్టకరణములుగ మారిరి. ఆంధ్రదేశమును కొంతకాలమేకచ్ఛత్రముగ నేలిన కాకతీయులు సూర్యవంశజులుకాని చంద్రవంశజులుకాని కారట. వారి కులమత్యర్కొందు కులమట. వారు సూర్య చంద్రవంశ క్షత్రియులను ఈసడించినారు. ఈ కాకతీయులకు అంబయదేవసాహిణి మొదలగు కాయస్థులతో సంబంధము కలదు. కాబట్టి కాకతీయులు వంగదేశమునుండి వచ్చిన కాయస్థులనుటకు అవకాశముకలదు. వారి వీరమాహేశ్వరత్వము నిందులకు తోడ్పడును. కావున కాయస్థులు క్షత్రియజాతికి చెందినవారనుట సమంజసము.

ఈ శాసనము ఒకటో, రెండో తెలియదు. కొంతభాగ మయినతరువాత నైనవరేకు మొదటి పెళ్ళ ఆరవబంతిలో "ప్రదత్త మస్మాభి ర్భావి భూమిపాల ...మమ ధర్మచోరవ అని యుండుటచే నా శాసనమంతటితో ముగిసినదనియు, తరువాతిది రెండవశాసనమనియు దోచుచున్నది. లేదా వజ్రహస్తునివలన "కుద్దాము" గ్రామ మగ్రహారముగా బడసిన మల్లప్రశ్రేష్ఠుడు తనకు గొంతభాగముంచుకొని మిగిలినది బ్రాహ్మణులకు దానముచేసిన రీతిగానే సుంకపనాయకుడు తనకిచ్చిన చతుర్థభాగ మష్టభాగములుచేసి యితరుల కిచ్చెనను విషయము తెలుపు పూర్వశాసనము ఉత్తరభాగమని యూహించుటకు నవకాశముగలదు. ఈ యూహమున కవకాశమెక్కువగలదు. అయిదవరేకు మొదటి పెళ్ళ ఎనిమిది తొమ్మిది బంతులలో గల "శ్రీ వజ్రహస్త దేవినామా—మః అరసవిల్లి గ్రామః ప్రతేస్య ప్రదత్తః చతుర్థభాగ మష్టధాకృత్వా విశేష్వభాగే కాయస్థ సుంకపాఖ్య" అను వాక్యములు వజ్రహస్తు డిచ్చినదానినే నాలుగవదాని నెనిమిదిగా జేసి అని స్పష్టపడుచున్నది. కాగా నిప్పుడు వజ్రహస్తుని దేవికిగాని, యామె పేరికిగాని యిందు ప్రసక్తియే లేదు. "వజ్రహస్తదేవి" అని లేఖకుడు "దేవు" ని "దేవి"గా చెక్కిన తప్పుగాని అసలు వజ్రహస్తుని భార్యప్రసక్తియే యిందులేదు. ఇట్లూహించిన భావిభూమిపాలురను ధర్మరక్షకై వజ్రహస్తుడు ప్రార్థించుటయు దరువాతి భాగము చివర నట్టి ప్రార్థనాదికము వ్యాసగీతిలు లేకుండుటయు సంగచ్ఛమానములై శాసనము సమగ్రమేయనియు నొక్కటేయనియు దేలును. చికాలవలస శాసనమునగూడా నిట్లే "మమధర్మ గౌరవాత్పాలనీయ మితి"—అని మాత్రమే రాజశాసనము తరువాతిది ప్రతిగ్రహీత శాసనముగా నున్నది. వ్యాసగీతిములందు నిందుకూడ లేవు. గ్రంథరచయిత లేఖకుడు అందును దెలియడు ఇందును దెలియడు. చికాలవలసలోని గౌరవము అరసవిల్లిలో చోరవత్తుగా మారుటే విశేషము. లేకున్న నావిషయమున సంశయము దుర్నివార్యమే. అయిదవరేకు మొదటి పెళ్ళ మూడవ బంతిలో "పునర ప్యయాం గ్రామః సప్తారహభాగా...భాగేషు" అని సంతారహపద ముపయోగించుట వింత.

శాసన మేమో సర్వవిషయముల నమూల్యమైనదే, కాని లేఖకుడు నిర్లక్ష్యముగా చెక్కియు దన యిచ్చవచ్చినట్లు శబ్దరూపముల మార్చియు గొప్ప అపచారము చేసినాడు. వాని యవకతవకలను పరమప్రమాణములుగా గ్రహించి శ్రీనరసింహముగారు విచిత్ర విమర్శ చేసినారు.

కథానిక

# * గుడిగోపురం *

## శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తి

గుడిదగ్గర బడిపిల్లలు గుమిగూడేరు. గోళీకాయలు కొందరూ గోణీబిళ్లలు కొందరూ, గొల్ల స్తంభాల ఆట మరికొందరూ ప్రారంభించారు. ఆ మగపిల్లలతో బాటు మరోవయిపు ఆడపిల్లలు వామన గుంటలూ వానాలప్పలూ మొదలుపెట్టేరు. అంత హడావిడి జరుగుతూ మంచి సరందావిడిగా వుంటే, ఆ పక్క భవంతి యజమాని నారాయణరావు అరుగు మీదికి రాక ఎలా వుండగలడు? సరాసరి వచ్చి స్తంభానికి జార్లబడి చుట్టముట్టించి పొగ నిగిడించాడు. అయితే అతని దృష్టి ఆ పిల్లలమీద లేదు. ఆ గుడిగోపురంమీదికీ, ఆ గుడిపక్కనుంచి బడినుంచి వచ్చేదారిలోకీ అతని దృష్టి ప్రతిక్షణం ప్రసరిస్తోంది పర్యాయంలో!

అరుగుమీదికి నారాయణరావు రాగానే ఆ దార్ని నీలాటిరేవుకి వెళ్ళే అమ్మలక్కల ముక్కుల మీద వేళ్లు మొలిచాయి! 'ఇదేం పాడుబుద్ధో' అని ఒక ఇల్లాలూ, 'ఎలాగయితేం కట్టించుకున్నాడు మహా! రాతిల్లు!' అని మరో మగనాలీ, 'ఆమాట మన కెందుకు గాని ఆ పెద్దమనిషికి అన్నేళ్ళు గడిచాయ్! అరుగుమీద రాయిలా కదలకండా తంబాని కంటుకు పోయివుంటే ఆడాళ్ళు ఎలా వెళతార నేపాటి గేనమూ లేదంటే!' అని కొండొక కోమలాంగీ రకరకాలుగా నారాయణరావుగురించి అక్షితలు కలపసాగేరు.

అదేం గుర్తించడంలేదు నారాయణరావు. అతని దృష్టంతా గుడిగోపురంమీదా, బడినుంచి వచ్చే బాట మీదా లగ్నమై వుంది.

ఆడిపోసుకుంటూనే ఆ దార్ని వెళ్లే అతివలు వెళుతున్నారు. తొలగే తొయ్యాలులు వెనుదిరిగి పోతున్నారు. అలా వారం పదిరోజుల్నుంచి జరుగుతున్న గ్రంథమే!

మగ మహాశయులికీ నారాయణరావు వడవడిక కోపాన్ని కలిగించింది. కాని, 'నా అరుగుమీద నే నిల్చబడతా. నా యిష్టం.' అంటాడేమో! అనడు గాని ఒకవేళ అనడమే సంభవిస్తే ఏమిటి గతి? అని వాళ్ళబాధ. అదీగాక నలుగురిలో మంచిగా న్యాయపరుడులా వుంటూన్న ఆ నారాయణరావుగార్ని గమ్మున ఆడదానిమాట విని అనెయ్యడమే!—అని భయం. అనకపోతే—ఆయన అరుగుకి అంకితమవ్వడం మానకపోతే—ఆడవాళ్ల గొడవ ఎలాగురా భగవంతుడా అని బెడదా! బెంగాను!!—ఎటూ తోచక, ఏమీ చేయలేక కొందరూ, ఏమో చేద్దామని బయల్దేరి తీరా నారాయణరావుని చూడగానే మరేమో అయిపోయే మహానుభావులు మరికొందరూను! ఫలితం?—ఎవరిదారి వారిది!

ఎప్పటిలా నాలుగున్నర కాగానే నారాయణరావు అరుగుమీదికి రావడం, ఆడవాళ్లు అటూ ఇటూ కావడం, దారినపోతున్న మగాళ్ల కంఠాల్లో కంకర రాళ్లు కరుక్కుమనడం మామూలుగా నే వుంది.

పావుగంట గడిచింది. పిల్లల హడావిడీ ఆటల సరందావిడీ అలానే వుంది. రక్కుకునేవాళ్లు రక్కుకుంటున్నారు నవ్వుకునేవాళ్లు నవ్వుకుంటున్నారు. ఏడ్చేవాళ్లు ఏడుస్తున్నారు. ఆడుకునేవాళ్లు ఆడుకుంటున్నారు. పాడుకునేవాళ్లు పాడుకుంటున్నారు. అదంతా బాలానందం! కోలాహలం!

నారాయణరావు దృష్టిమాత్రం గుడిగోపురంమీదనుంచి బడినుంచి వచ్చే బాటవయిపూ అక్కణ్ణుంచి మళ్ళీ గుడిగోపురంమీదికీ ప్రయాణిస్తోంది!

అదొక చిన్న గుడి! ఎప్పుడో వెల్లవేసినసున్నం. దాని తాలూకు అచ్చులు రాలుతూవున్నై! అందుకు తగిన గోపురం. నలువైపులా నాలుగు బొమ్మలు. ఒక బొమ్మ మొండెం తెగి తుండెం మిగిలివుంది. మరో బొమ్మ మాట్నుంచి రావిమొక్క రెమ్మలు తొడుగుతోంది. ఆ బొమ్మలపైన నాలుగువరసల మెట్లు. ఒక్క

మెట్టుకీ గోడు నలుపలకలు తీరివున్న పాపాన పోలేదు. అలాంటి మెట్లకి పైన మరికొన్ని లతలూ లావణ్యాలూ! ఆ చెక్కడాలపైనుంచి గోపురం సూచీముఖానికి మలచబడింది. ఆ మలుపులో నలువైపుల నాలుగుకోటరాకృతులు! వానిపైన గరగవంటి శిఖరం. ఆ శిఖరానికి దిగువగా తన భవంతికి అభిముఖంగా వున్న ఒక కోటరాకృతివయిపు నారాయణరావు దృష్టి సంలగ్నత! ఆ కోటరాకృతిలోంచి వచ్చే కువకువ ధ్వనులే అతని శ్రవణపుటాలని గిలిగింతలు పెడుతున్న మధురమంజుల నిక్వణాలు!—

అలా చూస్తూనేవున్నాడు నారాయణరావు.

తుర్రున తొర్రలోంచి ఓ పావురాయి బైటికి వచ్చింది. దాని వెనకనే మరోహటే! ఒకటి పెంటిదీ! మరొకటి మగదీని! ఆడ పావురాయి ఆ చేరువలోని శిథిలవిగ్రహంమీద వాలింది. అల్లంత దవ్వులో మగ పావురాయి ఎదురుగా రావికొమ్మమీద వాలింది. పెంటిపావురం రెక్క లెగరవేస్తుంటే మగపావురం కూడా రెక్క లాడిస్తోంది. మగపావురం కువకువ మంటే ఆడపావురం కూడా కువకువమంటోంది!

వాటి వైఖరి చూస్తూ నారాయణరావు గుడి గోపురం మీదనుంచి దృష్టిని బడినుంచివచ్చే బాటకేసి మరలించాడు. దృష్టి ప్రసరించేంత దూరం వెళ్లిన కొలదీ బాట సన్నమవుతోన్నట్టు చెట్లతో క్రిక్కిరిసి పోతున్నట్టు మాత్రం వుంది. సమీపంలో గుడికి వాయువ్యంగా పెద్ద చెరువుంది. రేవులో ఎవరో జనం

ఎవరో జనం అనే నారాయణరావు భావన. ఆడవాళ్లున్నారని అత డనుకోగలిగితే అరుగుమీద తన అవతరణం వారికి అభ్యంతరం అని గ్రహించి ఈపాటికి లోపలికో మరే చాటుకో మరలేవాడే!

నారాయణరావు దృష్టి మళ్ళీ పావురాల జంట వయిపు ప్రసరించింది. ఈసరికి రెండు పావురాలూ వేరువేరు స్థానాల్లో లేవు. ఒకేచోటున వున్నయ్. ఒకదానిపక్క ఒకటి పరస్పరం కలిసిపోయి ఒకటే పావురం అన్నంత భ్రాంతిని కలిగిస్తున్నయ్!

కొంత్త పరిశీలనగా చూశాడు నారాయణరావు!

ఆడపావురంలో ఒకానొక ఒదుగు, మగపావురంలో ఒకానొక మగత—అవ్యక్తంగా అవసరంగా సుద్యోతకాలవుతున్నయ్. అదే దృశ్యాన్ని అక్షియుగళంలో నిలుపుకుంటూ బాటవయిపు చూశాడు నారాయణరావు. అలా చూడగానే అతనిలో ఒక నూతనోత్తేజం వికాస విలాసం, లగ్నత నేత్రాలలో ఆనందరేఖలూ ప్రస్ఫుటించినయ్. అటే అతని దృష్టి సంశ్రయమయ్యింది. అంతకంతకు అతనిలో ముచ్చట అధికమవుతూవుంది. ఆ ముచ్చటతో బాటు మధ్య మధ్య గుడిగోపురంకేసి కూడా చూస్తూ మురిసిపోతున్నాడు. అతనికి ఎందుకో అంత ఆనందం?—

పశ్చిమాభిముఖంగా బాటవయిపు పయనించిన అతని దృష్టి క్రమంగా స్వగృహాభిముఖ మవుతోంది. అయ్యింది! ఇప్పు డతని దృష్టి క్షణం క్రిందికీ క్షణం పైకీ! అతని మనశ్శ్రీవాలలో క్షణం కువకువలూ! క్షణం గుసగుసలూ! క్షణం ఆడపావురాయి కిలకిలలూ! క్షణం సన్నటిగాజుల గలగలలూ! క్షణం మగపావురాయి రెక్కల సవ్వడి! క్షణం కిర్రుతో కూడిన బూటుల చప్పుడు!—అన్నీ కొన్ని క్షణాల వ్యవధిలో! అదంతా ఒక లిప్తమాత్ర సంఘటన!

అంతవరకూ ప్రాంగణాభిముఖంగావున్న నారాయణరావు దృష్టి క్రమంగా ప్రాక్పథాభిముఖంగా పయనింపసాగింది. పయనిస్తూనే మలుపువరకూ మరలింది. మలుపు దాటితే మరి కనిపించని ఊరు. ఊరికి దవ్వుగా భవంతి కట్టుకున్న నారాయణరావు దృష్టి మలుపు దాటలేక మరల భవంతి మొహం పట్టింది. పడుతూనే గుడిగోపురంమీదికి ఎగబ్రాకింది. సరిగ్గా అదేసమయాన జర్రున పావురాల జంట ఆలయ కోటరాంతరంలోకి అంతర్ధానమెంది!

నారాయణరావు హృదయనాడుల్లోంచి స్మితశ్రీలు ఒలికి సింహద్వారానికి సింగారాన్ని చిలికి, మెల్లమెలగా ఇంట్లోని చిరుచీకటులలో మటుమాయమయినయ్.

## 2

రాత్రి పదయింది. నడం చావడిలో ఎక్కడో పడక కుర్చీలో నడుం వాల్చేడు నారాయణరావు. బయట ఏం జరుగుతున్నదీ ఎంత వర్షం కురిసివెలిసిందీ అతనికి తెలీదు. ముసురువల్ల చావిడి మాత్రం చలిగా వుంది. అంతే. వెచ్చదనానికి కాళ్లమీద కాశ్మీరు శాలువా వేసికొన్నాడు.

మెల్లమెలగా నిద్రాదేవి చల్లటిమాపు అతని మీదికి ప్రసరించబోతోంది. ఇక లేచి పడకగదిలోకి పోదామనుకున్నాడు. క్రమంగా లేవడంకూడా

జరిగింది. వీధితలుపు గడియ వేయడానికిగాను వీధి చావిడిలోకి వచ్చేడు. జార్లవేసివున్న తలుపుల్ని అపళంగానే దగ్గరసగా వేశాడు. గడియ కూడా వేయబోయేడు.

'నారాయణరావుగారూ!' అని

అంతలోనే పిలుపు!

ఎవరైవుంటారు? అన్న ప్రశ్నతో మొహం మాత్రం చిట్లించి అదే భంగిమంలోవుండి గడియ వేయడం మాని తలుపులు బారుగా తెరిచాడు. ఎదురుగా మెట్లమీద అయిదారుగురుదాక నిలబడ్డారు. వారి శిరస్సులమీద ముసుగులున్నయ్. వారి వెనక గుడి దగ్గరగా మరో ఇద్దరు ముగ్గురు ఉన్నారు.

ఓసారి నారాయణరావుదృష్టి గుడిమీదికి పోయింది. "ఆ పావురాలు గూటిలోనే వుంటాయి!" —ఇంత వాన కురిసినట్టు వీధి ఇప్పటికీ చెబుతున్నా తన కంతకుముందు తెలీనట్టు వాటికీ తేలీదేమో! తెలీకపోయినా చలిమాటో? అన్న స్పృహ కలిగి "ఎంతగా చలికి వణికిపోతాయో!" అనుకుంటూ చటుక్కున 'అరే!' అనుకొని నారాయణరావు గుమ్మం ముందున్న వ్యక్తులవంక చూశాడు. చూస్తూనే 'మీరా? రండి లోపలికి!" అన్నాడు. అని లోపలికి దారితీశాడు.

ఒక్కొక్కరే మెట్లమీద నిలబడ్డవారూ గుడి దగ్గర తచ్చాడుతున్నవారూ లోపల ప్రవేశించారు. వీధి చావిడిలో వున్న పొడుగాటి బల్లలమీద అంతా ఆసీనులయేరు!

'ఏదైనా పనిమీద వచ్చేరా?'

పడక కుర్చీలో కూర్చుంటూ నారాయణరావు అడిగాడు. ఆ వచ్చినవారిలో ముసిముసి నవ్వులు మొసులెత్తినయ్. వారి వైఖరి శంకించినట్టే వాస్తవం అని నారాయణరావు గ్రహించాడు. పైగా మున్సబు గారూ కరణంగారూ కలిసి వచ్చేరు. ఏదో వ్యవహారం లేనిది ఎందుకు వస్తారు? అని నారాయణరావు ఆలోచన.

'ఏమండి కరణంగారూ!' అన్నాడు నారాయణరావు వచ్చినపని చెప్పండన్న భావాన్ని అధ్యాహారానుకూలం చేస్తూ.

'అబ్బె...'

గ్రామకరణంగారైన భీమశంకరం నసుగుతూ మున్సబుగారి వంక ముసిముసి నవ్వులతో చూసేడు. కరణంగారితో బాటు మరో నాలుగు కన్నులు మున్సబును చూశాయి. మరో రెండు కంఠాలు సకిలించాయ్.

'చెప్పండి మున్సబుగారూ!' నారాయణరావు కూడా అడిగేశాడు!

'మరేం లేదండి. మీతో వీరంతా ఒక విషయం చెప్పకుందామని వచ్చేరు.'

'వీరేగాని మీరు కాదన్నమాట!'

నారాయణరావు ఛలోక్తిగా అని నవ్వేడు.

'ఎందుకొండీ! ఒకటే ఊరయ్యేక?' కరణం గారు శ్రుతి కలిపేరు.

'సరే ఏమిటది?' అన్నాడు నారాయణరావు. 'చెప్పండి.' ఒకళ్ళిద్దరు మున్సబుగారి చెవులు కొరికారు. మున్సబు మొదలుపెట్టాడు.

'మీరు వచ్చినప్పట్నుంచీ మా వూరికి ఓ కొత్త జీవితం ఏర్పడింది. అంతవరకూ అజ్ఞానంలోపడి అల్లాడేవారు!

"బాగానే వుంది! కరణంగారు కవిత్వంకట్టి మీ చేత పాడిస్తున్నట్టుందే!' అంటూ మున్సబు మాటకు అడ్డువచ్చేడు నారాయణరావు. 'నే చెప్పలేదూ నారాయణరావుగారంటేఅవికత్థనులు అని!' అంటూ భీమశంకరం భీముడంత మనిషై సగర్వంగా సర్రయ్యవంక చూశాడు. తనమాటకు వాళ్లంతా హడలెత్తి పోయివుంటారని భీమశంకరం అభిప్రాయం! అంతపనీ జరిగింది. అర్థంగాక ఆ సర్రయ్యా కొస్తా తేలకన్నులు వేశాడు. అది కనిపెట్టి తెలివైన ఘటం అవ్వడంచేత భీమశంకరం గుక్కతిప్పుకొని 'మన నారాయణరావుగారికి తన్నుగురించి పొగిడితే సహించలేరు!' అని వ్యాఖ్యానం చేశాడు.

'అవన్నీ ఎందుకు శంకరంగారూ! అసలు సంగతి చెప్పండి.' అన్నా నారాయణరావు. నిజంగా నారాయణరావులో సహించలేనితనం స్పష్టమయింది.

'నారాయణరావుగారూ! మీరేమన్నాగాని మీరు వచ్చేకనే మా పల్లెటూరికో పాఠశాల అనేది వచ్చింది. ఆడమేస్టారో మగమేస్టారో భార్యాభర్తలోఎవరో మొత్తానికి ఆ యిద్దరివల్లా పదిమంది పిల్లలకీ నాలుగు అక్షరం ముక్కలు వస్తున్నయ్.' 'అయితే—' చిరునవ్వు ప్రకటిస్తూ అన్నాడు నారాయణరావు. అప్పుడతని దృగ్వలయంలో నాలుగ్గంట

లికి రణగోలచేస్తూ గుడిదగ్గర ఆటలాడుకునే పిల్లల హడావిడి రూపురేకలు దాల్చుకొంది. ఆ దృశ్యం గుర్తుకువచ్చి కలిగిన ఆనందంలో స్వీయప్రశంస అనే అంశాన్ని గమనించక అవునన్నట్టు నారాయణరావు 'అయితే?' అని అడిగాడు.

'అలాగే, పిల్లలతో బాటు పెద్దలు! లోకంలో ఎన్నిరకాల తంతులున్నా మావూరి ప్రజలకి భగవంతుడంటే వల్లమాలినంతభక్తి. పూజలూ పునస్కారాలూ! మీకు తెలీనివి గావు. తాతలనాటిది ఓ గుడివున్నదన్నమాటే గాని అందులోకి వచ్చి అర్చించడానికి అనువుగా లేదు. కనుక నలుగురిచేత చందాలు వేయించి మన శివంతి ఎదటిగుడి బాగుచేయిద్దామని! నలుగురికీ నచ్చే కార్యం. నలుగురూ కోరుతున్నదికూడా! ఇహమూ పరమూ అన్నారు పెద్దలు! అదేదో మీ పేరుమీదుగా జరగాలని మనవాళ్ళ మక్కువ. లేక గుడి కడుతున్నామంటే కాదనే కర్కోటకు లెవరుంటారు చెప్పండి."

'కర్కోటకు' లన్నమాట కటారిలా దూసుకుపోయింది నారాయణరావు గుండెని.

'దైవకార్యం. పదిమంది పట్టుదలా వుండాలే గాని పదినిమిషాల్లో మన నారాయణరావుగారు ఆపని చేయించలేరూ?'

అన్నాడు భీమశంకరం భాట్టభావంతో.

'గుడి మరమ్మత్తా?'

కొంచెం నీరసంగా వెలువడింది నారాయణరావుగొంతుకలోంచీమాట.

అంతా తలలు ఆడించేరు.

'ఆఁ!'

అన్నాడు నారాయణరావు ఆలోచనాజగత్తులో అడుగుపెడుతూ!

'ఆలయ పునర్నిర్మాణం! ఆస్తికులికి సరే! నాస్తికులకయినా నాశనకరమైన విషయం కాదు. దైవం విశ్వాసంతో కూడిన విషయం. ఆ విశ్వాసం హేతురహితమూ గాఢతరమూను. వీరి మనసుల్లోంచి ఇప్పుడది మంచుపొగలా క్షణంలో దట్టమై మరు క్షణంలో మాయమయ్యేది కాదు. లేక పదిమందీ వాంఛిస్తున్న విషయం ఎలా కాదనగలం?

అవునే అంటాం. అయిదురోజుల్లో నిర్మాణ వ్యయం నిమిత్తం డబ్బు వసూలవుతుంది. సరకులన్నీ సరఫరాచేస్తాం. తాపీ మేస్త్రీలు వస్తారు...'

అప్పుడే నారాయణరావు మెదడులో ఆలయ పునర్నిర్మాణం జరుగుతోంది!

'ముందు శిథిలభాగాల్ని తీసి పారేస్తారు' గోపురం పూర్తిగా—ఆఁ!

నారాయణరావుకి గుండెల్ని రైలు ఢీకొన్నంత ఘాత కలిగింది. 'పాపం ఆ పావురా లెక్కడికి పోతాయి? అవి రోజూ సాయంకాలం ఆడుకుంటూ పాడుకుంటూ...'

నారాయణరావు కళ్లు చెమ్మగిల్లినయ్. అంతరాంతరం పాతాళాంతరంలోకి జారిపోతున్నట్టు అయింది.

'ఏవండి నారాయణరావుగారూ!' కరణంగారు కర్రతో నేలమీద చప్పుడుచేస్తూ చప్పున చెప్పండి అన్న భావంతో అడిగాడు.

'మంచి పని కాదంటారా?'

మున్సబు మెల్లగా ప్రశ్నించాడు. ఎలా కాదన గలడు నారాయణరావు?

'స...రే...' అందామనుకున్నాడు నారాయణరావు.

'పాపం ఆ పావురాలో!'

అంతరాత్మలో సూదిలా మెరిసింది!

మళ్లా నారాయణరావు మనస్సు గుంజాటనలో

'ఏమిఁటి వీళ్లు. ఎంత అజ్ఞానంతో వున్నారు! శాస్త్రీయదృష్టి పూజ్యమే! ఆలయాన్ని బాగుచేయిస్తే ఒకవేళ దేవుడున్నా ఎవ్వరూ అమాంతం మజిలీ లేకండా వైకుంఠానికి ఏకాఏకీని ప్రయాణం చేయలేరు. ఆపాటిదానికి ఎందుకీ తతంగాలు? విగ్రహారాధన పెద్దవిషయం కాదు. విధి కాదు. మనసా ధ్యానిస్తే చాలని ధర్మశాస్త్రాలే ఘోషిస్తున్నయ్. పోనీ—వారి కదో ఆనందం! అజ్ఞానమో విజ్ఞానమో అని అంగీకరిస్తే? రెండుదుష్ఫలితాలు. ఒకటి వారి మౌఢ్యాన్ని మరింత ధ్రువం చేసి దృఢతరం చేసినవాడవుతాడు తాను. రెండు—ఎక్కణ్ణుంచి వచ్చాయో ఎలా వచ్చేయో నిక్షేపంగా స్తున్న ఆ పావురాలు అనాథ పక్షులవుతాయే! అవేమయితేం? అసలు ఏమీ కావు. తిన్నగా ఎక్కడికో పోయి మరో శిథిలాలయాన్నో జీర్ణవృక్షాన్నో ఆశ్రయించి హాయిగా వుంటాయి! కాని తన కంటికి—

మరి నారాయణరావు యోచన సాగలేదు.

‘ఆలయ పునర్నిర్మాణ ప్రయత్నం వద్దు’ అని ఖండితంగా చెప్పడమే కర్తవ్యంగా తోచింది నారాయణరావుకి. ఆమాట చెప్పేద్దామనుకున్నాడు. మరోసారి ఆలోచించాడు. ‘ఎందుకు వద్దంటున్నాను?’ అని ప్రశ్నించుకున్నాడు. “నాకోసమా?” మరో ఉపప్రశ్న ఉత్పన్నమయింది. అడగకుండానే ‘అవును’ అన్న సమాధానం అతని ఎదుట ప్రత్యక్షమయింది.

‘కాదు. నాకోసం కాదు. వారి మౌఢ్యాన్ని తొలగించడానికే! పావురాలు ఎగిరిపోయినా తనకేం బాధలేదు. ఉన్నా అది ఒక హేతువు కాదు. అసలు పావురాల ప్రమేయమే లేదు. ఆలయ పునర్నిర్మాణం వలనిఫలితం అజ్ఞానాంధకారంతో అలమటించే గ్రామీణుల్ని మరింత మూఢులుగా మూర్ఖులుగా తయారుచేస్తుంది. ఎన్నెన్ని విచిత్ర విషాద ఘట్టాలు సంభవిస్తాయి! అందులో అమ్మవారి గుడి! పూజలన్నీ నైవేద్యాలై అవి క్రమంగా జాతర్లవరకూ ఎదిగి జంతుహింసలకి కారణభూతమవుతాయి. మహా ఘోరమది. అంచేత ముఖ్యంగా ఆలయపునర్నిర్మాణాన్ని ప్రతిఘటించాలి!—

అభ్యుదయ భావాలు నారాయణరావులో ఆవేశానికి తెర లెత్తినయ్.

‘వద్దు. ఆ ప్రయత్నం మంచిది కాదు.” నారాయణరావు నోటిదాకా వచ్చింది. నాలుక చివరంటా వచ్చింది. ఇంక అనడమే అవశేషం.

‘మాటాడరేం?’

కరణంగారి కంఠంతోబాటు కర్ర చప్పుడు కాస్త హెచ్చుస్థాయిలో అనిపించి నారాయణరావు ఆగంతుకులవంక చూశాడు.

‘వద్దు.’ అందామని నోరు తెరిచాడు.

ఎదురుగా ఏడెనమండుగురి ఉత్సుకత!

‘అలాగే!’ అనేశాడు నారాయణరావు.

‘బయల్దేరుతూనే చెప్పలేదూ? మన నారాయణరావుగారు మన గ్రామాన్ని అన్నివిధాల ముందుకు తీసుకుపోయే మహానుభావులని! మన అదృష్టంవల్ల ఎక్కడినుంచో ఈ వూరువచ్చి స్వగ్రామం అన్నట్టు వ్యవహరిస్తున్నారు...

కర్ర నేలమీద ఆనిస్తూ కరణంగారు దండకమెత్తుకోగానే మున్సబుగారు లేచి “మరి సెలవండి.” అన్నాడు.

నారాయణరావు ‘ఊఁ’ అంటూ అందరివంకా చూశాడుగాని అతని దృష్టిలో సజీవ రేఖలు సన్నగిల్లినయ్. గాజుపలకలోంచి ప్రసరిస్తున్న సూర్యకిరణంలా మందగించిన అతని చూపును అక్కడివా రెవ్వరూ చూడలేదు. ఎవరిమట్టుకు వారు వెళ్లడానికి లేచారు. వారిని సాగనంపడానికి నారాయణరావు వీధిగుమ్మందాకా వెళ్ళేడు.

అంతా వీడ్కోలు వాక్యాలు చెప్పి వీధి మొహం పట్టేరు. నారాయణరావు దృష్టి అనాలోచితంగా ఆలయంమీదికి వెళ్ళింది. సూటిగా కోటరాకృతి కనిపించింది. నారాయణరావు ముఖంలోంచి ఓ కాంతిరేఖ ఎక్కడికో ఎగిరిపోయింది! అదే సమయాన కోటరాకృతిలోంచి కోమలంగా వెలువడ్డ కువకువధ్వని అతని హృదయంలో చురకత్తిలా కలదిరిగి కవ్వమాడింది! అలా చూస్తూనే, మరబొమ్మ చేతుల్లా నారాయణరావు చేతులు తలుపులు జారవేయడానికి నిటారుగా సాగాయి!

తెల్లవారింది. ఆశ్చర్యం!

సరిగా వెలుగైనా రాలేదు. అప్పుడే అమ గుడి అరుగుమీద తాపీ మేస్త్రీలు!!

అప్పుడే లేచి నిద్రకళ్ళతోనే బైటికివచ్చిన నారాయణరావు వాళ్ళని చూశాడు. క్షణం తనకళ్లని తాను నమ్మలేకపోయేడు.

రాత్రి పదిమందీ వచ్చి చెప్పి ఇంకా సరిగా తెల్లవారలేదే! అదైనా రాత్రి వాళ్ళన్నది చేయించాలన్న సంకల్పం మాత్రమే! ఇంకా జరగాల్సినది సవాశేరు గ్రంథం వుంది. ముందు పదిమందిదగ్గర చందాలు వసూలుచెయ్యాలి! ఎవరైనా భూరివిరాళాలిస్తారేమో చూడాలి! దాన్నిబట్టి ఎంతడబ్బు ఖర్చుపెట్టగలమో ఒక నిర్ణయానికి రావాలి! సనాతనమయిన ధర్మాన్ని పురస్కరించుకొని ఇంతా ఆలయాన్ని మరామత్తు చేస్తూ మరా సంప్రదాయాన్ని అనుసరించి వాస్తు చూపించి ముహూర్తం పెట్టించి.. ఇంకా...ఇంకా...ఎంతో తతంగముంటే, అప్పు ఈ తాపీమేస్త్రీలు. ఆయుధసామగ్రితో తెల్లారకుండానే వచ్చా రేమిటి?

తెల్లబోయి చూస్తున్నాడు నారాయణరావు. ఒకటి రెండు నిమిషాలు గడిచాయ్.

'ముం దీ పక్కనుంచి మొదలు పెడదాం.'

'అలాగే మొదలు పెట్టి ముహూర్తంచేసి ఆగం. పూర్తయిందాకా ఇదే పని!'

తాపీమేస్త్రీల మాటలు నారాయణరావు చెవిని బడ్డాయి. మరీ క్షణం యోచన వ్యర్థం అనిపించింది.

'ఏమోయ్ ఇలా రండి.' అని వాళ్ళని పిలిచాడు.

'అయ్యా!' అంటూ మేస్త్రీలు నారాయణరావుకి సమీపంగావచ్చి వినయవిధేయంగా నిలబడ్డారు.

'ఎవరు పురమాయించారు మీకీపని!' నారాయణరావు మామూలుగా అడిగినట్టే అడిగాడు.

'చెప్పడమయితే మున్సబుగారే చెప్పారు కానండి, పనంతా పురమాయించింది కరణంగారండి.'

'అలాగా?' అంటూ నారాయణరావు ఆలయంవంక చూశాడు. పావురాల నివాసమయిన కోటరం కనిపించింది. ఒక్కసారి నారాయణరావుహృదయం స్త్రీహృదయంలా తరుక్కుపోయింది!

నిద్రపోతున్న పసినెత్తురుకందుల్ని విచ్చు కత్తులతో తుత్తునియలుచేస్తున్నట్టు అనిపించి భరించలేకపోయేడు.

'నేను పిల్లేదన్నానని చెప్పండి. మీ యిళ్లకు మీరు పొండి.' తీవ్రంగా అన్నాడు నారాయణరావు.

తాపీమేస్త్రీలకు నడినెత్తిమీద తాటికాయలు పడ్డంత పనయింది! నారాయణరావుగారు చాలా శాంతం కలవారని ఆయనకి కోపం రానేరాదని ఆ భవంతి కట్టిననాడు అనుభవంలో వారు గ్రహించిన విషయం. అలాంటిది అకస్మాత్తుగా నారాయణరావు అగ్గిమీద గుగ్గిలమవ్వడంతో వాళ్లకి హడలెత్తిపోయింది.

'ఏం?'

మళ్ళా నారాయణరావు హుంకరించాడు. తాపీమేస్త్రీలు ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు! గుడ్లు తేలవేశాడు ఒకడు. మరొకడు మెడ వాలేశాడు. మెల్లగా ఇద్దరూ ఒకళ్ళనొకళ్ళు కూడబలుక్కున్నట్టుగా మాటా మంతీలేకండా మౌనంగా ఆలయందగ్గరకు వెళ్ళి సాధనాలు చంకను బెట్టుకున్నారు.

4

సరే! మంచితనంవల్లో మరే కారణంవల్లో అన్న వెంటనే వాళ్లు అవతలకి వెళ్లారు. వెళ్ళి ఊరుకుంటారా? పని పురమాయించినవాళ్ళకి చెబుతారు. వాళ్లు వింటారు. నానావిధాల భావాలు వాళ్లల్లో పొడుకుంటాయి.

మున్సబు అసలే ముక్కోపి! దానికి సాయం, తాను దలచినదానికి వ్యతిరేకం జరగరాదన్న తత్వం కలవాడు. ఏమంటాడో?

భీమశంకరం వసపిట్టే గాని భల్లూకపుపట్టుపట్టే మనిషల్లే తోచడు. తతిమా వాళ్ళంటే మున్సబుకో కరణానికో అనుయాయులు! కనుక విషయం మున్సబుకీ కరణానికీ ముందే చెప్పడం మంచిది...

అనుకుంటూ కాఫీ తాగడం మవ్వగానే నారాయణరావు ఊళ్ళోకి బయల్దేరాడు. మున్సబుగారు ఇంట్లో లేరని లోపల్నుంచి జవాబు వచ్చి తిన్నగా కరణంగారింటికి వెళ్లాడు. భీమశంకరంగారు పక్కముందర దస్త్రాలు సర్దుకొంటున్నారు. నారాయణరావుని చూడగానే 'రండి రండి' అంటూ ఆహ్వానించాడు.

'ఏమండీ కరణంగారూ! తెల్లారకండానె తాపీమేస్త్రీలు వచ్చేరు. ఏ విధంగా పని జరపాలో ఎంత డబ్బు అవుతుందో ఇంకా మనం ఒక నిర్ణయానికి రాలేదు. ముందు ఒక ప్లాను వుంచటం ఎందుకయినా మంచిదికదా?' అన్నాడు నారాయణరావు.

'అదేవిటండోయ్. గురువులేని విద్య గుడ్డివిద్యని ప్లానూ ప్రణాళికా లేని పనేవిటి? లక్ష విధాల చెప్పేను. మున్సబుకి తలకెక్కలేదు.'

'ఏవంటాడు?'

'ఏమని చెప్పను? అసలు నారాయణరావుగారూ! ఒక విషయం. మీకు నేను చెప్పకూడదు గాని మంచితనంగా వుండేవారికి అకారణంగా అపనిందలు అంటగడితే నేనుమటుకు సహించలేను. మీరు నిస్వార్థంగా ఇంత సేవ చేస్తున్నారే! ఆ మున్సబుకిగాని మరోహడికిగాని విశ్వాసం లేదు. పరాయివాడు పరాయివాడే అని వాళ్ళది ఒకటే దాసరి పాట! అదీగాక నారాయణరావుగారూ! ఇది క్షుద్రగ్రామం. ఇలాంటిచోట మీవంటివారికి తావు దొరకదు. మీ మంచితనం నెగ్గదు.' అన్నాడు కరణం ఖండితంగా.

'మరి మనమూ జాగ్రత్తగా వుండాలి!'

'ఏమి జాగ్రత్తండీ' మీకు తెలీడంలేదుగాని— సరే. నాకెందుకు లెండి. ఏమిటో వెధవది బొత్తిగా నాది జాలిగుండె. భరించలేక వెళ్ళగక్కుతుంటాను. 'కలహ మహామునిరా మనం కరణంగారంటే' అన్న అపప్రథకి పాల్పడుతూవుంటాను. నాకే బుద్ధి వుండదు.'

నారాయణరావు మాటాడలేదు.

'అసలీ వెధవలోక ధర్మమే ఇంతండీ! న్యాయానికి ధర్మానికి స్థానంలేదు. మీరు రాత్రి దేవాలయ పునర్నిర్మాణాన్ని అంగీకరించారా? పాపం! అమాయకులు మీరు—అంతా మీమీద వున్నట్టే వారు మాటాడేరు. కాని నాకది సహించదు.'

'ఏది సహించదు?'

'అబ్బే. ఏమీ లేదండి నోరుజారింది.'

'ఫర్వాలేదు చెప్పండి. నామీద మీకు నమ్మకం లేదా?'

'ఎందుకు లేదు. ఉండబట్టే ఈ నోరు జారడాలు! మళ్లా మీరు వాళ్లకి చెప్పరని నాకు తెలుసు. కాని...నారాయణరావుగారూ! నావంటి ఏకపక్షి ఎక్కడి విషయం అక్కడే రెక్కలు దులిపినట్టు దులిపెయ్యడం మంచిదిగాని ముక్కున తగిలించి మోసుకురాగూడదండీ!'

'మొత్తానికి మీకూ నామీద శంకే!'

'ఛా ఛా! ఆ అల్పులికయితే అలాటి వెధవ శంకలున్నాయిగాని అన్నీ తెలిసిన నాకూ అదే రోగమా? ఎంతమాటన్నారు: మీకు తెలీదుగాని నారాయణరావుగారూ! మీరు నవనీత హృదయులని నాకు తెలుసు. నమ్మండి చెబుతున్నా. మీ సలహాయే నిజంగా కావలిస్తే మీతో మాటాడంది తాపిమేస్త్రీలని ఎందుకు ముందే పురమాయించాలి? పోనీ పురమాయించడం తప్పుకాదే అందాం. అన్ని సంగతులూ మీకు చెప్పినప్పుడు ఆమేర్వాణీ ఏమయింది అసలు సంగతి చెప్పకుంటానికి? అని నేనంటాను. అందుకే నాకు అలాంటి గొడవలు సహించవ్'

'ఎవరు పురమాయిస్తే?'

మామూలు కంఠంతోనె అడిగాడు నారాయణరావు, కరణంగారి మాటలన్నీ కర్ణపుటాలలో పడుతున్నా గమనించేలా ఆయన ముఖకవళికలలో ఏవీ మార్పు పైకి ముద్ర వేసుకోలేదు.

'ఏమిటంటారు?'

అన్నాడు ఉలిక్కిపడి భీమశంకరం.

'పురమాయించిం దెవరని?'

'బాగుందండీ! పేరుపెట్టి చెప్పాలా? ఎంత వెర్రివారండీ మీరు! తనకీ నాగరికత తెలుసునే! పట్టణాల్లో ఉన్నానే! నాకంటె ఏమంత నారాయణరావు ఘనాపాటీ అని ఈ సంస్కారణలు అని మున్సబుగారి దుగ్ధండీ!'

ముక్కుపుటాల్లో నస్యం బిగిస్తూ కరణంగారు కరకరలాడేరు.

'కరణంగారూ! ఇక సెలవు.'

అంటూ నారాయణరావు లేచేడు.

స్వగృహాభిముఖంగా కాలు సాచేడు. భీమశంకరం వంతెనవరకూ సాగనంపి సెలవు దీసికొన్నాడు. ఒంటరిగా నారాయణరావు నడక మొదలు పెట్టాడు. అడుగులు జోరుగా పడుతున్నాయి. మలుపు తిరిగాడు.

'నమస్కారమండి! నారాయణరావుగారూ!'

అన్నమాట వినబడి తలయెత్తి చూశాడు.

ఎదురుగా మున్సబు!

'నమస్కారం. ఎక్కణ్ణించి. ఇంటిదగ్గర లేరంటే వచ్చేస్తున్నా.' అన్నాడు నారాయణరావు.

'నేను మీయింటికే బయల్దేరానండి.' అన్నాడు మున్సబు.

'సరే! ఆఁ. ఏమిటి సంగతి?'

'అబ్బే! రాత్రి మీతో నేను చెప్పింది—'

మున్సబు అంటుండగానే

'ఆఁ. ఏమయింది?'

అన్నాడు నారాయణరావు యథాకంఠంతోనె.

'అబ్బే! చందాలు గట్రా ఏపాటి వస్తయ్యో చూద్దాం. పదిరోజు లాగుదామంటే రాత్రి నాకూడా వచ్చినవాళ్లు సుతరాం ఒప్పుకోలేదు. కరణంగారో హాటి వాళ్లకి తగ్గట్టు కొన్ని సమిధలు వేశాడు. మొత్తానికి పదిమందీ రాత్రి మా యింటిదగ్గర్నించి వస్తూ దారిలోనే తాపీ మేస్త్రీలకి పురమాయించేరు. నేను కొంచెం కిందా మీదా ఆలోచిస్తూనే వున్నా. మేస్త్రీలు నిద్రలోంచి లేచివచ్చి 'ఏమిటి బాబూ

సెలవు' అంటే అనుమానిస్తూనే 'మన గుడి మరామత్తు చెయ్యాలి!' అన్నాను. అనడంతడవు నలుగురూ తొందరలో ప్రారంభించాలి అన్నారు. 'శుభస్య శీఘ్రం. తెల్లారుగట్ల దశమి శేషతిథి అయిదు గంటలకి ఆల్వాచీగా పని మొదలు పెడితే సరి!' అన్నారు కరణంగారు! ఆ మాటమీద నలుగురూ సరే అంటే సరే అన్నారు. నారాయణరావుగారికి చెప్పనిదేనా అని నసుగుతుంటే 'ముసుగులో గుద్దులాటా ఏవిటి పురమాయించండి అంటే పురమాయించండి అని నలుగురూ నాలుగు మాటలన్నారు.

మొత్తానికి—

మున్నబు కళ్ళల్లో బెదురు తొంగిచూడటాన్ని గమనిస్తూనే వున్న నారాయణరావు మెల్లగా అన్నాడు. 'అవును. మేస్త్రీలు రానేవచ్చారు. మరో కారణాన పని మానేసి పొమ్మన్నాను.'

'అది తెలిసే మీకేం కోపం వచ్చిందో అని గబగబా మీయింటికి వచ్చేను. అయితే పొలంమీదనుంచి రావడంవల్ల దారులు వేరయ్యాయి '

'ఆఁ దానికేం, ఊరివాళ్ళకి ఆలయం తప్పని సరిగా బాగుచేయించుకోవాలన్న భావం ఉన్నప్పుడు మనం కాదని అనకూడదు. ఇందాక ఏవిటో నామనసంతా అదో మాదిరిలావుండి వాళ్లని పొమ్మన్నాను. దశమి పోయినా ఏకాదశీ మంచిదే! మధ్యాన్నంనుంచి పని మొదలు పెట్టిద్దాం. ఈలోగా మనం ఎవరెంత డబ్బు ఇచ్చేదీ ఒక అంచనా వేసికోవాలి! భోజనమయ్యేక ఒకసారి మాయింటికి వస్తారా?' అన్నాడు నారాయణరావు.

'సాయంత్రం రాకూడదాండి.'

'అలాగైనా సరే!'

'అయితే సాయంత్రమే వస్తాను.'

'మంచిది. మరి సెలవా?'

నారాయణరావు కాలు కదపబోయి మున్నబు వంక చూశాడు. మున్నబు మొహంలో ఒక తచ్చాట కనిపించి అలా చూస్తూ ఆగిపోయేడు. మున్నబు గొంతుక సవరించుకొంటూ ముందుకు వెళ్ళబోయి ఆగి 'నారాయణరావుగారూ!' అన్నాడు. మళ్లా కాలు సాచబోయిన నారాయణరావు సాచుతున్న కాలు సాచుతున్నట్టే ఆపి మున్నబువంక తిరిగాడు.

'మీయింటికి వస్తూ తాపీ మేస్త్రీలను కూడా దీసుకు వచ్చేను—మీకు సంగతిచెప్పి పని మొదలు పెట్టిద్దామని-తొమ్మిది గంటలదాకా దశమివుందని మళ్లా పదిమంది పట్టుపట్టారు. మీరు ఇంటిదగ్గర లేరు. మేస్త్రీలు 'నారాయణరావుగారు మీరు ఏకస్తులై చెప్పండి, ఎలా చెయ్యమండి?' అని గోలపెట్టారు...ఫర్వాలేదు. నేను మళ్ళీవచ్చి నారాయణరావుగారికి చెబుతా. ఆయన రాత్రి మాతో బాటు ఈపని చేయించాలనే అన్నారు. ముహూర్తం ఆగదుకదా! అని దగ్గరవుండి పని మొదలుపెట్టించి ఇలా వస్తున్నా. ఇంతలో మీరు ..'

అంటూ మున్నబు నారాయణరావు మొహంలోకి చూశేడు. నిర్వికార గభీరంగా వున్న నారాయణరావు ముఖాన్నిచూచి విస్మయచకితుడయిన మున్నబుగారి ముఖాన్ని నారాయణరావు చూచి 'పని మొదలు పెట్టారా?' అన్నాడు.

'నేనే మొదలు పెట్టించానండి.'

'సరే' మరి వస్తా.

'సెలవండి -సాయంత్రం తప్పకుండా వస్తాను.'

'నేను ఎక్కడికీ వెళ్ళను. ఇంటిదగ్గరే వుంటాను.'

మున్నబు తల ఆడిస్తూ ముందుకు నడిచాడు.

"ఒకరికంటె ఒకరు. కరణం సాక్షాత్తూ వృద్ధ జంబుకం. మున్నబు మెత్తని పులి! సరే! వార్ని అనుకోవడమూ అనవసరమే! అన్వాల్సిందేదో ఈపాటికి అవుతూనే వుంటుంది. పాపం మేస్త్రీలు! వాళ్లేం చేస్తారు? ఎవరి అధికారంలో వుందని ఎవరిమాట వింటారు? పైగా దేవుడిపెళ్ళికి అందరూ పెద్దలే! అందులో ఒకాయన మున్నబు. మరొకాయన కరణమూ! గ్రామాధికారులు! వారిని కాదని క్షణం సామాన్యులు బ్రతకలేరు. అంచేత తాపీపనివాళ్లని అనుకోవడమూ తప్పే!

ఈపాటికి గుడిలో ఏ సగమో కూలగొట్టి వుంటారు—"

ఈ స్ఫురణ కలగ్గానే నారాయణరావు గుండెలోనే గునపాలు కదిలాయ్! అడుగులు తడబడినయ్. అల్లాగే తలయెత్తి చూశాడు.

అల్లంత దూరంలోనె ఆలయం!—"అదిగో! మావిగున్నచాటునే పై శిఖరం! ఆ శిఖరం కిందనే—"

నారాయణరావు నాడులు చల్లబడసాగాయి. అతికష్టంమీద అడుగుపడుతున్నది. సన్నమావి కొమ్మల గుబురు దృష్టిపథాన్నుంచి తప్పుకొంది స్ఫుటంగా గుడి అదిగో! అరే! ఎవ్వరూ లేరేఅక్కడ?

ఆశ్చర్యంలో నారాయణరావు అడుగు జోరుగా పడబోయింది. 'వెనకవైపు ఉన్నారేమో!—' అన్న తలంపు కలిగి అంతలోనే ఉసూరుమని పోయింది నారాయణరావు ప్రాణం.

ఎల్లాగో కాలు కదుల్తోంది! మరికొంతదూరం నడిచాడు.

అన్నివైపుల్నుంచి ఆలయభాగాన్ని చూడ వచ్చు. నారాయణరావు చూశాడు. చీలిపోతున్న గుండె ఎల్లాగో అదుముకుంటూ కళ్లు చీల్చుకుని మరీ చూశాడు.

నిజం! నిజంగా లేరు. ఏమైనట్టు తాపీపని వాళు?

నారాయణరావు ఆదుర్దాపడసాగేడు. అంచె లంచెలుగా అడుగులు పడినయ్.

అమ్మవారిగుడిముంగిలికి వచ్చేశాడు.

నిజంగా తాపీమేస్త్రీలు లేరు. కనీసం గుడికి ముహూర్తం చేసినట్టుకూడా లేదు, మరి మున్సబు అలా చెప్పాడేం? దగ్గరుండి పని మొదలుపెట్టించా నన్నాడు! ఆ బాపతుచిహ్నాలేమీ కనిపించవే!

ఆతురత హెచ్చుతున్నకొలదీ కంగారు కంగా రుగా చూశాడు. ఆలయాన్ని ప్రత్యణువునా పరి శీలనగా చూశాడు నారాయణరావు! ఎక్కడా శిథిల దేవాలయాన్ని మరామత్తునిమిత్తం కూలగొట్టినట్టు లేదు. ఏమిటిది?

నారాయణరావు కేమీ తోచలేదు.

ఆలయంచుట్టూ ప్రదక్షిణాలు మొదలుపెట్టాడు. మొదట రెండుమూడుసార్లు ఏమి శేషమూ లేదు. నాలుగో సారి నారాయణరావు కాలికి ఏదో తగిలింది. బాధ పడుతూనే కాలికి తగిలిందేమిటని చూశాడు.

ఒక ఇటిక! ఎక్కడిది?

గుడి మూలలోకి దృష్టి పోనిచ్చేడు!

క్షణం అతనిదృష్టి స్తంభించిపోయింది.

ఉలిక్కిపడ్డాడు. అనంతరం మళ్ళీ స్తబ్ధుడై చూడసాగేడు.

అలా ఎన్ని నిమిషాలు గడిచాయో? క్రమంగా నారాయణరావు భవంతిలో ప్రవేశించాడు. ఇప్పు డతని మొహం నల్లబడింది. అర్థంగాని ఆందోళన— స్పష్టంగాని సంకోచం—ఇంకా ఏవిటేవిటో!—

నడం చావిడిలో పడక కుర్చీ వాల్చుకున్నాడు. నారాయణరావు కూర్చోబోయేడు. కూర్చోకండానే గదిలోకి వెళ్లేడు. డ్రాయరుదగ్గర పది నిమిషాలు చలనంలేకండా నిలబడ్డాడు. ఉన్నట్టుండి డ్రాయరు సొరుగు తీశాడు. సొరుగు తీస్తూండగా అతని కళ్లు చెమ్మగిల్లినయ్.

సొరుగులోంచి ఒకటి రెండు పుస్తకాలు అటూ ఇటూ తీసి వానికిందవున్న క్యాలికో బైండుని అందుకున్నాడు. కళ్లకద్దుకున్నాడు. అట్ట వెనక్కి త్రిప్పి ఆలోచనగా మరో నాలుగయిదు పుటలు వెనక్కి త్రిప్పాడు. మరి పుటను కదల్చటం మాని అలా మౌనులాగై పుస్తకంలోకి చూస్తూవున్నాడు.

కొంతసేపటికి అతని పెదవులు కదలినయ్. ఆ కదలికలో ఒక విషాదావిలమయిన భీతచిత్త ప్రవృత్తి జీరాడింది!

'అమ్మా!'

అప్రయత్నంగా అతని పెదవులు ధ్వనించాయ్. అప్రయత్నంగానే అతని నేత్రాలు కూడా ఊర్ధ్వా లోకన చేశాయి. గోడమీద చిత్రపటం చిందులా డింది!

నారాయణరావు దృష్టి చిత్రపటంమీద లగ్న మయింది!

'ఏమయ్యావో! ఎక్కడున్నావో!—నీతో బాటు—రత్నం!—'

నారాయణరావుమనసు మాటాడుతుంది. రత్నం అన్న సంబోధనతో మరా మనసు మాటాడలేక మూగైపోయింది! అతని లగ్న నేత్రాలలో అశ్రువులు వెలువడ్డాయి!

ఇంక అక్కడ ఆగలేకపోయేడు నారాయణ రావు. కాలికో బైండు మూసి డ్రాయరు సొరుగులో యథాస్థానంలో వుంచి, కంగారుగా సొరుగు వేసి గోడకేసి చూడబోయి చూడలేక గదిలోంచి గబ గబా బైటికి వచ్చేశాడు.

వస్తూనే వీథి కిటికీదగ్గరకు వెళ్ళాడు. కిటికీ తలుపులు తెరిచాడు. గుడివంక చూశాడు. నిశ్శ బ్దంగా వుంది. నిర్నిమేషంగా చూశాడు.

గుడిదగ్గర బడిపిల్లలు గుమిగూడినట్టయింది. నారాయణరావు నిశితంగా చూశాడు. నిజంగా గుడిదగ్గిర ఎవ్వరూ లేరు. నిశ్శబ్దంగా నే వుంది. కాని నారాయణరావు దృష్టిలో గుడిదగ్గర బడిపిల్లలు గుమిగూడేరు. ఆటల సంరంభంలో పడ్డారు. మాంఛి హడావిడిగా పెద్ద సరందావిడిగా వుంది. నారాయణరావు అంతర్దృష్టి బడినుంచి వచ్చే బాటవయిపు ప్రసరించింది. స్పష్టంగా కలకల మొహాలతో కిలకిల నవ్వులతో బడినుంచి వస్తున్న పంతులమ్మా ఆమె భర్తా అతనికి గోచరించారు. తిరిగి నారాయణరావు అంతర్దృష్టి గుడిగోపురంమీదికి ప్రసరించింది. కువకువ ధ్వనులతో పావురాలు బైటికి రావడం దర్శితమయింది.

నారాయణరావు దృష్టి మాస్తో నేవుంది. అంతరాత్మ ఆలోచిస్తూ నేవుంది. "ఆఁ! అవిగో—అందంగా ఆనందంతో బైటికి వచ్చాయి పావురాలు! ఎందుకో మగపావురం కొంచెం మందంగావుంది. ఆడ పావురంలో ఒక ఆదుర్దా కనిపిస్తోంది. ఏమిటా వైఖరి?"

నారాయణరావు భావన అలానే సాగుతోంది! "మగపావురాయికి ఏదో వచ్చింది. ఆడ పావురాయి ఆదుర్దాపడుతోంది. ఆహా! అచ్చంగా ఒక ఆడదాని మల్లే ఆ ఆడపావురం ఎంతగా బేలపోతోంది! మగపావురాన్ని చూసి ఆడపావురం పరమసాధ్విలా ఎలా పలకరిస్తోంది! అఁ. మగపావురాయి మెడ అలా వాలేసిందే! అయ్యో ఆడపావురాయి బావురమంది. అరె! కింద పడిపోతోంది.

తటాల్న నారాయణరావుఊహ ఆగింది. "ఏమిటిది?" అందని లోతునీటిలో ఈతరానివాడిలా ఉక్కిరి బిక్కిరై ఒక్కసారి ఎగసిపడి మరోసారి మునిగిపోతూ కడకు ఎల్లాగో తేరుకొని కళ్ళు పెకలించి కిటికీచువ్వల్ని చీల్చుకుంటూ గుడికులాయం వంక చూశాడు. ఏముందక్కడ?

"అరే! పావురాలు బైటికి రానేలేదు. ఎలాంటి దురుహ కలిగింది నాకు! ఎంతటి దుర్భరమైన దృశ్యాన్ని......"

మరి నారాయణరావు మనసు ముందుకు సాగలేదు. యాంత్రికంగా కిటికీ తలుపులు మూసి మెల్లగా అడుగు కదలించాడు.

నడం చావిడిలోకి వచ్చేడు. పడకకుర్చీ పరామర్శించింది. మేను వాల్చేడు. ఎదటి గోడమీదికి చూశాడు. "గడియారం తన గుండెలా కొట్టుకుంటూనే వుంది!" అనిపించింది నారాయణరావుకి. అలా గడియారానికి సహచారిగా కళ్లు అప్పగించాడు. పది...పదిన్నర...పదకొండు...పన్నెండు ...ఒంటిగంట...రెండు...మూడు...నాలుగు—

గభాల్న లేచాడు నారాయణరావు. మరుక్షణంలోనే అరుగుమీదికి వచ్చాడు. స్తంభానికి జార్లబడ్డాడు. చుటుముటించాడు. మందంగా చూపు సాగింది.

ఎప్పటిలానే వుంది బాలానందమూ! కోలాహలమూ! యథాపూర్విగానే నారాయణరావు దృష్టి గుడికోటరం వయిపు బడినుంచి వచ్చే బాటవయిపూ ప్రసరిస్తూనే వున్నై. కాకంటే గమనంలో మాంద్యం!—

ఆడపావురం బైటికి వచ్చింది. అటు నారాయణరావు దృష్టి నిలిచింది. మగపావురం ఇక వస్తుందని కన్నులు విప్పేడు. ఎప్పటికీ అది రావడం లేదు. నారాయణవు దృష్టి మరి బాటవయిపు మరలడం లేదు. కోటరంనుంచి రావలసిన మగపావురం కోసమే కొనలు సాచుతోంది. ఎప్పటికీ మగపావురం రావడం జరగడం లేదు. నారాయణరావు కళ్లల్లోని నరాలు చిట్లిపోతున్నాయి. మగపావురం మాత్రం బైటికి రావడం లేదు. ఆందోళనగా నారాయణరావు ఆడపావురంవంక తదేకధ్యానంగా చూడసాగేడు. అతని నిశితదృక్కులకే వణికిపోయినట్టుగా ఆడపావురం వణికిపోయింది. అది స్పష్టంగా చూశాడు నారాయణరావు. గమ్మత్తన మధ్యాహ్నం తనకు పొడమిన దురూహ గుర్తుకు వచ్చింది. ఆసుర్తితో బాటు అతనిగుండెకూడా వణికిపోయింది. అలా సంచలితహృదయంతోనే ఆడపావురంవంక మరీ పరిశీలనగా చూశాడు.

ఆడపావురం రెక్క ఆడించింది!

ఆరెక్క తుద తన ఎదలో మెల్లగా మెదిలి చల్లగా సోకినట్టు తోచింది నారాయణరావుకి!

ఒంటరిగావున్న పెంటిపావురం మళ్ళా రెక్క ఆడించింది! గుండెలో రెక్క ఈసారి విసురుగా దూసుకుపోయినట్టు విభ్రమం కలిగింది నారాయణరావుకి!

ఇతోధికమైన నైశిత్యంతో ఆడపావురంమీదికి దృష్టి సారించాడు. ఆడపావురం కనుగ్రుడ్లలో

దైన్యం కనిపించింది. అంతే నారాయణరావు కనుపాపల్లో ఆ దైన్యం కన్నీళ్లని గిలకొట్టింది.

భారంగా అటు చూడలేక నారాయణరావు బడినుంచివచ్చే బాటవయిపు అనుద్దేశపూర్వకంగా చూశాడు.

"అరే! ఆమె ఒక్కర్తే వస్తోంది!" నారాయణరావు గుండె గొణుక్కుంది.

"ఏమిటి కారణం? ఆయనకు పని తెమలక తర్వాత వస్తానని ముందు ఆమెను ఇంటికి వెళ్ళమని వుంటాడు. ఈమాత్రం దానికి విపరీతంగా ఎందుకు భావించాలి!" అనుకుంటూ అనుకోకుండా నారాయణరావు గుడిమీది పావురంవంక చూశాడు. కనుగుడ్లుమూసి మందంగా దీనంగా కుంచించుకుపోయి కూర్చుం దాపావురం!

'ఇదంతా ఏమిటి? మగపావురం ఏమైంది? ఎవరి కిరాతహసం ఏంచేసిందో?—'

ఆలోచనలోపడిన నారాయణరావుదృష్టి అల్లనల్లన భారంగా బాధతో బడినుంచివచ్చే బాటవయిపు ప్రసరించింది.

అలతి సమీపంలోనే ఆమె!

సూటిగా చూశాడు నారాయణరావు. చూస్తూనే తల్లక్రిందులైపోయేడు. 'అరే! ఈఅమ్మాయి ముఖంలో ఎప్పుడూ వుండేకళ ఏమైపోయింది? ... ఈ మేష్టారు ఎందుకు రానట్టు? ఇందాక అనుకొన్నదే హేతువయితే ఈమెలో దాగివున్న దైన్యానికి కారణమేమైవుంటుంది? అతని గురించే ఆమె బాధ అలా కళ్ళల్లో ప్రతిఫలిస్తూ ముఖంలో ముసురుకుందేమో! అడిగేస్తే?—'

అడుగుదామనుకున్నాడు నారాయణరావు. పెదవి కదిపేడు. 'తీరా అడిగితే ఏమనుకుంటుందో? ఒంటరిగా వస్తున్న యువతి! భర్త లేకుండా చూచి మీ ఆయన నీకూడా రావడంలేదేం అని ఎంత మంచి హృదయంతో అడిగినా ఎలాంటి కాలుష్యాన్నైనా ఆమె ఆపాదించుకోవచ్చు' అనిపించి నారాయణరావు పెదవి మరి కదలించలేకపోయేడు.

'అడగకపోతే అసలు జరిగిందేమిటో ఎలా తెలుస్తుంది? ఆమె బాధ ఏమిటో? ఆ పావురం ఎంతగా విలవిలలాడిపోతోంది! అలాగే ఈమె హృదయమూ ఎంతగా దహించుకుపోతోందో పాపం! అడిగితేనే మంచిది. ముందు తన ఆరాటం సడల్తుంది. తర్వాత...'

సరిగ్గా భవంతిముందుకు వచ్చిందా పంతులమ్మ. మాసిన దుకూలంలో నైగనిగ్యంలా కలకబారిననీటిలో స్వచ్ఛందతలా గత సందర్భంలోని కిలకిలలూ గలగలలూ నారాయణరావు హృదయాంతరంలో ఎక్కడో మెదిలినట్టయినయ్.

ఒక్కడుగులో ఆమె భవంతి ప్రాంగణాన్ని అతిక్రమించి వెళ్ళిపోతుంది. అడగాలి!—

నారాయణరావు హృదయం ఉయ్యాలలూగింది. బలవంతంగా పొడిబారిపోయిన పెదవిని తెరవబోయేడు. పెదవులు వణికినయ్. పట్టుబట్టి హృదయోద్వేగాన్ని అణచుకోబోయేడు. స్వాధీనం అవడం కష్టంగా వుంది. అలానే 'అమ్మా!' అన్నాడు. ఆ రెండు అక్షరాలూ అతని పెదవులు దాటి రాలేదు. అందుకు సిగ్గుపడి ఆమెవంక చూశాడు. ఆమె అప్పుడే భవంతి ప్రాంగణాన్ని దాటేసింది!

ఆమెవైపు నారాయణరావు దృష్టి నిశ్చలంగా నియతమైపోయింది!

నిమిషాలు గడిచాయి.

పంతులమ్మ మలుపు తిరిగింది.

నారాయణరావు చూపులు నిస్పృహతో నీరసంగా గుడి కోటరం వయిపు ప్రసరించినయ్.

ఆడపావురం అలా దీనంగా నేవుంది!

మనస్సు వికలమయింది.

భావశకటం శకల శకల మయింది.

మనోభావ సకలం వికలశకల మయింది.

మర్నాడు కూడా నారాయణరావు స్వయంపాక ప్రయత్నం మాని వ్యధిత హృదయంతో శూన్యదృక్కులతో వీధిచావిడిలో కూర్చున్నాడు.

ఎదురుగా ఎప్పటిలా గుడివుంది. ఎవ్వరూ అక్కడికి వచ్చిన అలికిడి లేదు.

మధ్యాహ్నమయింది. గడియారం ఠంగ్ న రెండు కొట్టింది. కూర్చున్నవాడల్లా లేచి గదిలోకి వెళ్ళాడు. క్షణం గోడవయిపూ క్షణం డ్రాయరు వంక చూస్తూ కొన్ని క్షణాలు గడిపాడు.

మెల్లగా డ్రాయరుమీదున్న డైరీపుస్తకం అక్కడే కూర్చున్నాడు. కలం పుచ్చుకున్నాడు. అయిదారుపుటలదాకా వ్రాశాడు.

గడియారం అరగంట కొట్టింది. నారాయణ రావు చెవిని బడింది. వీథిచావిడిలోకి వచ్చి మళ్ళా పడకకుర్చీలో వాలిపోయేడు.

మూడు... మూడున్నర...

ఠంగ్! ఠంగ్! ఠంగ్! ఠంగ్!

గడియారం నాలుగు గంటలూ కొట్టింది. ప్రతి శబ్దానికీ నారాయణరావు మొహంమీద సమ్మెటదెబ్బ పడుతున్నట్టుగా ఉలికిపడుతూ ఉలికిపడుతూ ఉద్విగ్న హృదయంతో లేచేడు. అరుగుమీదికి వచ్చేడు.

నిమిషాలు నిర్జీవంగా గడుస్తున్నాయి. గుడి దగ్గర బడిపిలలు గుమిగూడేరు.

ఒక్కసారి వాళ్ళమీద పడింది నారాయణ రావు దృష్టి. అందులో ప్రత్యేకించి ఒక ఆరేళ్ళ కుర్రాడిమీద. గోడగడియారం లోపల అరగంట కూడా కొటింది. ఆలయంవంక చూశా నారాయణ రావు

ఆడపావురాయి కూడా అగుపించ లేదు.

అల్లాగే చూస్తున్నాడు.

ఠంగ్‌న మళ్ళీ లోపల అయిదుగంటలు విని పించాయి! నారాయణరావు చూపులు అటు ఆలయం మీదికీ ఇటు బాటవయిపూ తడబడుతూ ప్రసరి స్తున్నయ్.

అయిదున్నర! ఆరు! ఏడు!

బాటను ఒక్క పిట్టవచ్చిన జాడలేదు. నారా యణరావు మరింత బాధపడసాగేడు. అనేకవిధాలుగా అంతరాత్మ ఆక్రోశించింది. ఆక్రోశిస్తోంది! ఏముంది సమాధానం? ఎవరిస్తారు?—

ఒకొక్కరే ఇంటిమొహాలు పడుతున్న బడి పిల్లలవంక చూశాడు నారాయణరావు. సందడి సన్న గిల్లుతోంది. ఆడి ఆడి, పాడి పాడి, అలసి సొలసి ఆ బడిపిల్లలు నీరసంగా అడుగులు కదుపుతున్నారు!

'ఏయ్ అబ్బాయ్! మాట!'

అక్కడ మిగిలిన అయిదారుగుర్ని ఉద్దేశించి ఎవ్వరో ఒక్కరు పలుకుతారన్నట్టుగా నారాయణ రావు పిలిచాడు.

ఆ పిలుపుకి కుర్రాళ్లు తెల్లబోయేరు. 'అల్లరి చేస్తున్నారా? మీకు చదువూ పంధ్యా అక్కర లేదూ?' అని పెద్దాళ్లు తిట్టడం వాళ్ల చెవుల్లో గింగురు మంది. నారాయణరావూ అలాంటి పెద్దవాడే! అందుకే పిలుస్తున్నాడు కాబోలు! అని పిల్లలు వెర్రి మొహాలు వేసి చూడసాగేరు. ఒకడు మాత్రం తెగించి 'ఏమండీ!' అంటూ అరుగుదాకా వెళ్ళేడు!

'ఏం చదువుతున్నావు నాయనా!'

'మూడో కలాసండి!'

'అలాగా! మీ మేసారు ఎవరు?'

'మాకు మేసారు కాదండి. పంతులమ్మగారండి.' ఆ కుర్రాడి మాటలకి వచ్చిన నవ్వు వచ్చినట్లే లోపలే అంతరించిపోయి అదే నైఖరితో నారాయణరావు అడిగాడు.

'ఇవాళ మీకు ఏం పాఠం అయింది?'

'ఏమీ అవ్వలేదండి. ఇందుకేనా పిలిచారు. పొద్దుపోయింది. పోతాను.' అంటూ ఆ కుర్రాడు తోక ఝాడించబోయేడు. 'మాటబ్బాయ్! పనివుంది! ఇదిగో! నిన్నే. ఇలా చూడు.' అంటూ నారాయణ రావు బలవంతంగా ఆ కుర్రాణ్ణి ఆపుచేశాడు.

'ఎందుకండీ?'

పెద్ద చనువున్నవాడల్లే అమాయికుడా కుర్రాడు అడి గాడు. అందుకు సంతోషమే అయినా ఆ అనుభూతి కూడా కలుగుతూనే మాయమయింది నారాయణ రావులో!

'ఇవాళ మీకు పాఠాల్లేవా?'

'కాదండి. పంతులమ్మగారు రాలేదండీ!' అని సాగదీస్తూ నారాయణరావు అడిగిన ప్రశ్నకి ఏమి టెంత తెలివితక్కువతనంగా అడుగుతాడీయన అన్న అరింపాతనంకొద్దీ ఆ అబ్బాయి నవ్వేసి 'ఒరేయ్ ఒరేయ్!' అంటూ రోడ్డుమీదికివచ్చిన కుర్రాళ్ళలో కలిసిపోయేడు.

"పంతులమ్మకూడా పాఠశాలకు రాలేదూ? కారణం? " ప్రశ్నపాతం పాపపతంలా పని చేసింది. నారాయణరావు జారిపోతున్న నాడుల్ని చేదుకుంటూ గుడివంక చూశాడు.

సడి, సవ్వడి, లేని గుడికోటచుట్టూ, నడిరేయి నాట్యమాడినట్టయింది!

## 7

అరుగుమీద నారాయణరావు కనిపించక పోవ డంతో ఆదార్ని నీలాటిరేవుకి వెళ్ళే అమ్మలక్కల ముక్కులమీద మళ్ళీ వేళ్ళు మొలిచాయి!—

'మూడురోజులమట్టి బయటికే రాడేమో!—ఒకావిడ ప్రతిసవరించగానే 'మరేపాపం, ఇంట్లోవుంటేగా!" అంటూ అంతవరకల్లా లొలగే తొయ్యాలులలో ఒకర్తె అయినావిడ అందుకుంది. 'ఏమిటంటూవే కారణం?' మరోఆవిడ ముందు నడుస్తున్నావిణ్ణి అడిగింది. 'నాకేం తెలుసునమ్మ నాయకుడుగారి గొడవ!' అంటూ అసూర్యంపశ్యత్వాన్ని చాటుకొంది ఒక ఉవిద, నడి వీధిలో!—అలా వారు భవంతిని దాటి నీలాటిరేవుకి నడిచారు. కాస్సేపటికి వారి తిరుగుప్రయాణంకూడా అయింది!

మరో అరగంట కాలహరణమయింది.

నారాయణరావు వచ్చేడు. మెట్లమీదనుంచి వెనక్కి తిరిగి ఆలయంవంక చూచి అరుగుమీదికి వెళ్లేడు. అయిదునిమిషాలు అరుగుమీదే నిలబడ్డాడు.

"మూడురోజులయింది! గుడిమరమ్మత్తు పని మొదలుపెట్టలేదు. సాయంత్రం వస్తానన్న మున్సబు మళ్లీ కనిపించలేదు. వాకబు చేస్తే అర్జెంటుగా గ్రామాంతరం వెళ్లారని మాత్రం వర్తమానం వచ్చింది. కరణంగారు అంతకంటె కంటికి కరువైపోయేడు! ఒకవేళ ఇంటికి వచ్చి వెళ్ళిపోతున్నారేమో! నేనూ ఇంటిపట్టున ఉండటం లేదు సరిగా! ఆ మేష్టారికి రోగం ముదురుతుందే కాని నయమయ్యే దారి కనిపించడంలేదు. అసలే ఇది కుగ్రామం. గచ్చాకూ పచ్చాకూ వైద్యాలు కాదని ఆచారిగారిచేత ఆయుర్వేద ఔషధాలు ఇప్పిస్తే అవంతకంటే గుణమివ్వకండా వున్నై!

నారాయణరావు గుండె ద్రవించింది! తల తిప్పడంలో గుడి కనిపించింది. ఎప్పటిలానే వుంది!—

'పావురాలను చూచి మూడు రోజులయింది! అవెల్లా గువ్వయ్యో! ఇప్పుడవి బయటకు రానేరావు. అవి వచ్చే వేళకి రాడానికి పడటంలేదు. ప్రతి క్షణం మేష్టారి పరిస్థితి ప్రమాద మనిపిస్తోంది!'

అనుకొని నారాయణరావు వీధి తలుపు తాళం తీసికొని లోపలికి వెళ్లేడు. వీధిచావిడి విశాలంగా కుర్చీలతో వుంది! సమ్మార్జనం లేక దుమ్మూ ధూళీ ఫర్నిచర్ని కప్పివేస్తోంది!

నారాయణరావు మరో గుమ్మం దాటేడు.

నిశ్శబ్ద వాతావరణంలో గోడగడియారం టక్ టక్ మని కొట్టుకొంటోంది! గడియారంవంక చూశాడు నారాయణరావు. 'అబ్బా! అప్పుడే అరున్నర దాటిపోయింది!'—హడావిడిగా నారాయణరావు గదిలోకి వెళ్లేడు. డ్రాయరు సొరుగు తీశాడు. పై పుస్తకాలు చెదిరివుండటంవల్ల కెలికోబైండు కనిపించింది! నారాయణరావు దృష్టి గోడమీదికి ప్రసరించింది! చిత్రపటం వెలవెలబోతూ తోచింది. గుండె గతుక్కుమని నారాయణరావు కాలికోబైండు తెరవడానికని సొరుగులోకి చేయి సాచేడు. మనస్కరించలేదు. మానేశాడు. మానులా అలా కొంతసేపు నిలబడి క్రమంగా వసారాలోకి వెళ్ళేడు!

ప్రొద్దుటి పదార్థాలు! రసనకి రుచించలేదు. మనసుకే సహించలేదు. అటూ ఇటూ అన్నం కలిపి తినకుండానే లేచిపోయి నారాయణరావు చేయి కడుక్కున్నాడు. నిర్వికాస దృక్కులతో మెల్లగా వీధి చావిడిలోకి వచ్చేడు. పొగాకు గొట్టం తీశాడు. చూడకుండానే చుట్ట చుట్టడమయింది. అగ్గిపెట్టి గీచి అంటించాడు. అలవాటైన చుట్టకూడా కాల్చాలనిపించలేదు. కంటిముందు మంచంమీదున్న మేష్టారు మాత్రం కదులుతూ రొప్పుతూ రోజుతూ వున్నాడు.

ఎనిమిదయింది!

'నారాయణరావుగారూ!'

వీధిలో కేక వినబడింది.

'ఎవరు?' అంటూ నారాయణరావు వీధితలుపులు తెరిచాడు. మున్సబూ కరణంగారూ ఒకరిద్దరు గ్రామీణులూను, కూడా తాపీ మేస్త్రీలూను!

'లోపలికి రండి.' అన్నాడు నారాయణరావు.

కొందరు కుర్చీలు కొందరు బల్లలు సర్దుకొన్నారు. నాయణరావు మాత్రం నిలబడే వున్నాడు.

'నారాయణరావుగారూ! మనవాళ్ళంతా సిద్ధంగా వున్నారు.. డబ్బుగురించి మనం ఆలోచించనక్కరలేదు. పోతే ఏవిధంగా మనం గుడిని మరామత్తు చేయాలో మాత్రం ఆలోచించాలి.' అంటూ మున్సబు మొదలుపెట్టాడు.

'ఆ విషయం మనకంటె ఏ వాస్తు శాస్త్రజ్ఞుణ్ణో అడగటం శ్రేయస్సని నా యోచన. తర్వాత మీ యిష్టం.' అన్నాడు కరణం.

'శాస్త్రాన్ని బట్టి నిర్మించడానికేం?"

'అహఁ—అయినా మనమంతా ఏకస్థులమై అనుకోవడం ఉభయత్రా శ్రేయస్సని!' అని కరణమే అన్నాడు.

'అలాగే మీ యిష్టం!' అంటూ పక్కనున్న కుర్చీలో కూర్చున్నాడు నారాయణరావు.

'శాస్త్రాలదాకా ఎల్లడానికి ఇదేమంత పెద్ద గుడీ! ఉన్నపళంగానే అటో ఇటో కట్టించేస్తే సరి!' అన్నాడు ఆగంతుకులలో ఒకడయిన సర్రయ్య.

'అంతే. పెద్దంత ఎవ్వారమెందుకు?' అన్నారు తతిమా వాళ్లు.

'ఏ దెలావున్నా మనకి గుడి అందంగా చూడ ముచ్చటగా తయారవ్వాలి!' అంటూ మున్సబు నారాయణరావువంక చూశాడు.

నారాయణరావు సాభిప్రాయంగా తాపీమేస్త్రీల వంక చూశాడు.

'సాలా పనుందండి. కొత్తగోపరవేఁ కట్టించాలి మరి!' అన్నాడొక మేస్త్రీ.

'ఇంతా పనిచేసి అదట్లే పెడతామా?' అన్నాడు రెండో మేస్త్రీ.

'పాతరాజయినా కొ కిరీటం వుండాలి!' అన్నాడు కరణం.

'కొత్త గోపురమా?'

ఒక్కసారి ఉలిక్కిపడి చూశాడు, నారాయణరావు

అన్నితలలూ అవునంటూ ఆడాయి!

'బొమ్మలూ మెట్లు ఉన్నట్టే బాగుచేయిస్తే సరిపోదూ?' అందరివంకా చూస్తూ నారాయణరావు అడిగాడు.

'అచ్చే!' పెదవులు విరిచారు పెద్దలు. భీమశంకరం మున్సబువంక చూశాడు. మున్సబు సర్రయ్యవంక చూశాడు. సర్రయ్య మేస్త్రీవంక చూశాడు.

'అలాగేం బాగుంటాది బాబూ! మీరీ యింటికి ఈ హంగు ఎందుకన్నారు. సూడండి కట్టేక మీరే చాలా బాగుందోయ్ శరభయ్యా! అన్నారు. అల్లాంటి మాట రావాలని మా అఘోరం.' అన్నాడు మేస్త్రీ రెండోవాణ్ణి 'కదరా?' అన్నట్టు చూస్తూ.

'అయితే—'

హృదయం పగిలికూడా గొంతుక విడివడక నారాయణరావు అర్ధోక్తితో ఆలోచనగా అందర్నీ చూస్తూ కుర్చీలో ముందుకు వంగేడు. ఎలాంటి సమాధానం వస్తుందో అని అంతా నోళ్ళావలించి చూస్తున్నారు. ఎలాంటి మాటా మళ్లా నారాయణరావు అనలేదు. అంటాడనే అంతా ఆశగా చెవులు నిక్కించారు.

"బాబూ! బాబూ!"

గబగబా ఓ పదేళ్ల కుర్రాడు గదిలోకి వచ్చేడు.

'ఎవరికోసంరా?' అన్నాడు కరణం. ఆ మాట వినపడలేదు కుర్రాడికి. తిన్నగా బాబూ! బాబూ! అంటూ నారాయణరావుదగ్గరకు పరుగెత్తుకు వెళ్లేడు. ఆ కుర్రాణ్ణి చూడగానే నారాయణరావు కంగారుపడి లేచి, 'ఏం?' అన్నాడు.

'మేట్టారికి, మేట్టారికి!'

కుర్రాడు అదేపనిగా ఒగురుస్తూ మాటాడలేక పోతున్నాడు. సముదాయింపుస్వరంతో 'ఫర్వాలేదమ్మా. చెప్పు' అన్నాడు కుర్రాణ్ణి నారాయణరావు.

'బాగా ఎక్కువై—'

'ఊఁ?'—ఉలిక్కిపడ్డాడు నారాయణరావు.

'ఏదోలా వుందటండి.'

'ఆఁ!'— నారాయణరావు వ్యాకులాన్ని పొందేడు.

"అమ్మగోరు మిమ్మల్ని—" కుర్రాడు మాట పూర్తిచేయకండానే

'రమ్మన్నదా?' అంటూ నారాయణరావు గభాల్న ముందుకు కాలుసాచేడు. మున్సబు కనిపించాడు. అడుగువేయబోతూనే అందరివంకా చూశాడు. 'ఇప్పుడే వస్తా' అని నాలుగైదు అడుగులు వేశాడు. తాపీ మేస్త్రీ చెంపకట్టి నిలబడటాన్ని చూశాడు. మేస్త్రీని చూడగానే నారాయణరావు ఆగిపోయేడు. ఏదో చెప్పబోతాడు. ఎందుకో ఆరాటం. ముందు వెళ్లాలని కంగారు. వెళితే ఇక్కడ ఏమిటవుతుంది? అందర్నీ కాదని వెళ్ళడమా? అని అనుమానం. ఏం చెయ్యాలి? ఆలోచించడానిక్కూడా నారాయణరావుకి ఊపిరాడలేదు. ఎదురుగా మేస్త్రీ!

"పావురాలు! పావురాలు!"అంటూ నారాయణరావు గబగబా బైటికి నడిచాడు. మెట్లు దిగాడు. వెనకాల కుర్రాడు. ముందు నారాయణరావు. జోరుగా నడక. మధ్యమధ్య తూలిపడుతూ కూడా!

నారాయణరావుధోరణికి నలుగురూ ఆశ్చర్యపోయేరు. ప్రశ్నార్థక చిహ్నాముఖాలతో అరుగుమీ

దికి వచ్చేరు. కరణంలో మాత్రం ఎలాంటి విస్మయమూ పొడకట్టినట్టు స్పష్టంగా తెలుస్తోంది! మున్నబు ముక్కుపుటాలు ఎగురుతున్నాయి!

'ఏమిటండీ యిదీ?' సంబాళించుకొంటూ సర్రయ్య అన్నాడు.

'ఇంకేం వుంది?' అంటూ కరణం అందరి వంకా అదోలా చూశేడు.

'అంతేనంటారా?' మరొకడు అడిగాడు.

'కాక?' కరణం గద్దించి అన్నాడు.

'అరె! ఎంత దుర్మార్గం!' నోరు వెళ్ళబెట్టేడు సర్రయ్య!

'పావురాలని పలవరిస్తాడేమిటి?' మున్నబు గుంజుకున్నాడు.

మొహమూ అహమూ!' అన్నా కరణం.

'సరే!—'

పైక్కనిపించకండా పళ్ళు బిగించి కళ్ళు పెద్దవి చేస్తూ మున్నబు ముఖమాడించాడు. అప్పుడతన్ని చూస్తున్న సర్రయ్యకి భయం వేసింది. కాస్సేపు కిక్కురుమనలేకపోయి గుక్కతిప్పుకొని 'ఇక్కడెందుకు మనం ఇంటి కాపలా!' అన్నాడు.

'పనిలేక!' కరణం కాలు కదిపాడు.

'తలుపు గొళ్ళెమయినా పెట్టండి బాబూ!' అన్నాడు తాపీ మేస్త్రీల్లో ఒకడు!

'పదండి.' మున్నబు గర్జించాడు.

నారాయణరావు ఇంటికి వచ్చేసరికి తూరుపు తెల్లవారుతూవుంది. రాత్రల్లా నిద్రలేక మొహం వాడిపోయి నిద్ర ముద్ర వేసికొంటూవుంది. రెప్పలు మూసుకుపోతున్న కళ్ళు ఎరుపెక్కి నివురు గప్పుతున్న చింతనిప్పుల్లా అయినయ్.

ఆలయందగ్గర అప్పుడే తాపీ మేస్త్రీలు పని ముట్లతో వచ్చి గుడిని పరకాయిస్తున్నారు. వాళ్లని చూచి వాకిట్లోనె ఆగిపోయేడు నారాయణరావు. 'పని మొదలు పెడుతున్నారా?'—మేస్త్రీల వంక చూస్తూ ప్రశ్నించాడు.

'మరేనండి.' అంటూ శరభయ్య నారాయణరావు భవంతి వాకిట్లోకి వచ్చేడు.

'ముందు చీడీలు పడగొడతారా?'

'పైని గోపురం ముందు పడగొట్టాలండి!'

నారాయణరావు గోపురంవంక చూశాడు. సరిగ్గా కోటరం కనిపించింది. క్షణం నారాయణరావు స్తంభించిపోయేడు. గుండెలో రాయిపడినట్టు కుతికిల పడ్డాడు.

'శరభయ్యా!' హీనస్వరంతో తాపీమేస్త్రీని పలకరించాడు.

'అయ్యా!'

నారాయణరావు చూపుడువేలెత్తాడు. అది కంపించసాగింది. అలా వణకుతున్న తర్జనితోనే 'ఆ గూటిలో రెండు పావురాలు ఉన్నయ్. ముందు వాటిల్ని జాగ్రత్తగా బైటికి పోనివ్వండి—' అని రుద్ధకంఠంతో అని గిరుక్కున తిరిగి లోపలికి వెళ్ళిపోయేడు నారాయణరావు.

పడక కుర్చీమీద నారాయణరావు కూర్చున్నాడన్న మాటేగాని అతని మనసంతా పావురాలమీదే వుంది. ఒకవంక నిద్ర ముంచుకువస్తోంది. 'సరిగ్గా వాళ్ళు పావురాల్ని బైటికి పంపిస్తారో లేదో! వాళ్లికేం పట్టింది? అంతగా వస్తే వాటిని అమాంతం చంపి ఆరగించేందుకు సిద్ధపడే మనుషులు! ఎందుకైనా మంచిది! స్వయంగా వాటిని—'

నారాయణరావు కుర్చీలోంచి లేచేడు. అరుగుమీదికి వచ్చేడు. ఆలయగోపురంమీద తాపీ మేస్త్రీ ఆపసోపాలు పడుతున్నాడు.

'ఏమోయ్ శరభయ్యా!' అంటూ అరుగు దిగి నారాయణరావు ఆలయందగ్గరకువెళ్ళాడు. 'అయ్యా! ఒకటే పావురమండి. ఇలా నేను వచ్చి చప్పుడు చేయగానే తుర్రున ఎగిరెల్లిపోయింది. రెండో పావురాయి ఉన్నట్టు లేదండి' అన్నాడు శరభయ్య. 'సరిగా చూడవోయ్' హెచ్చరిక చేశాడు నారాయణరావు. 'లేదండి!—' అప్పు దిగే ప్రయత్ ంలో కనిపించాడు య్య. రాతిబొమ్మలా నిలబడి చూస్తున్నాడు నారాయణరావు. గాజుపలక మీద నీడలా శరభయ్య దిగిరావడం కనిపించింది. తర్వాత తాపీ మేస్త్రీలిద్దరూ ఏదో మాటాడుకున్నట్టు లీలగా మూగబొమ్మల పెదవులు కదిలినట్టుగామాత్రమే తోచింది నారాయణరావుకి.

ఖంగ్‌న శబ్దమయింది.

త్రుళ్ళిపడి చూశాడు నారాయణరావు. తెల్లగా మెరుస్తూ బలంగా గుడిగోపురంమీద గునపం పడింది. తన గుండెల్లోనే గునపం దిగబడినట్టు అణగిపోతూ మరి అక్కడ నిలబడలేక కాలు కదిపాడు నారాయణరావు.

'రెండో పావురం ఏమయింది? ఆ రెండో పావురం ఆడదా? మగదా?' అన్న ఒకటే ఆలోచనతో ఆందోళనతో తల దిమ్మెక్కిపోయి పడక కుర్చీలో కూలబడ్డాడు నారాయణరావు ముంచుకు వస్తున్న నిద్ర ఏమైపోయిందో పాడు కన్నులు పడ్డాయి! మరిచిపోగలుగుతామన్న భావం మనస్సు మధ్య కలిగి బలవంతంగా కళ్లు మూస్తున్నా నిద్ర రావటం లేదు. పరంపరగా గుడిమీద పడుతున్న గునపాల ధ్వని నారాయణరావు గుండెల్లో ఖంగ్ ఖంగ్ మంటోంది!

"ఆ పావురం గూటిలోనే వుండేమో! కొంప దీసి గునపం పోటు పావురం గుండెలో పడదుగదా? పడితే......ఇస్......పచ్చని ప్రాయం. మెత్తని మేను......చితికి చితికి...అబ్బ! పసి నెత్తురు..."

ఊహించలేకపోయేడు నారాయణరావు కళ్లు తిరిగాయ్. వమనం వచ్చినంత పనయింది. గభాల్న కుర్చీలోంచి లేచేడు. గదంతా కాలుగాలిన పిల్లిలా కలియదిరుగుతూ ఉన్నట్టుండి కిటికీదగ్గరకు వెళ్ళి బైటికి చూశాడు. ఓమూల గోపురం కూలగొట్టబడింది. కోటరం వున్నవయపుగాక అవలివైపు ప్రస్తుతం కూలగొడుతున్నారు. ఇప్పట్లో ఫర్వాలేదు. కాని కాస్సేపటికయినా తప్పదుగా ఆ కళ్యాణం!...పిలిచి వాళ్ళకి మళ్ళీ హెచ్చరిస్తే మంచిది—అనిపించి నారాయణరావు కిటికీదగ్గర్నుంచి వీధి గుమ్మంలోకి వచ్చి తలుపు తెరిచాడు.

మెట్లెక్కుతూ కరణంగారు కనిపించారు. 'నారాయణరావుగారూ!' ఆప్యాయంగా కంఠం ఆహ్వానించింది. 'రండి.' అన్నాడు నారాయణరావు. అరుగుమీదికి వచ్చి భీమశంకరం వెనక్కి తిరిగి 'నానుస్తూ చేయకండోయ్ పని. తొందరగా కానివ్వండి.' అని మళ్ళీ నారాయణరావువయపు తిరిగాడు.

భీమశంకరం ప్రవేశంతో నారాయణరావు లోపలికి దారితీశాడు. వీధి చావిడిలోనే ఇద్దరూ కూర్చున్నారు.

'అలా వున్నారేవండీ?' కుశలప్రశ్న వేశాడు భీమశంకరం.

'అబ్బే. ఎలా వున్నాను? బాగానే వున్నా' నన్న భావాన్ని ప్రకటించాడు నారాయణరావు.

'దేనికయినా నారాయణరావుగారూ! ఒక అవధి వుండటం మంచిది సుమండీ!' అన్నాడు కరణం.

'దేనికయినా అంటే?'

'దేనికయినాను.'

'మీరనే జీవింటో!—'

'అబ్బే! నేనుగా అనేది మీ విషయంలో ఎప్పుడూ ఏమీ వుండదు. కాని చూడండి వాళ్ళు ముక్కూ మొహం తెలీనివాళ్లని కాదు. మనవారా? మన మంచా? అని.'

'ఎవరిమాట!'

'ఆ మొగుడూ పెళ్ళాలే నండి'

'ఏ మొగుడూ పెళ్ళాలు?'

'సరే! ఏమీఁ తెలీనట్టు అంటారుగాని మీరు ప్రతిక్షణం అక్కడ జాగరం చేయటం లేదుటండీ?'

'ఎవరు ఆ మేస్త్రిమాటా?'

'మరేనండి.'

'వారు దంపతులు కారే!'

'ఏమిఁటే?' కరణం తెల్లఫ్రేము కళ్లజోడు తీస్తూ మొహం విప్పేడు.

'ప్రణయజీవులు!'

'ప్రణయజీవులా?' కొంప మునిగిపోయే ప్రమాదమన్నట్టుగా పలికాడు కరణం.

'ప్రేమ పక్షులంటే మరీ అర్థవంతం!' నింపుగా నిర్మలంగా అన్నాడు నారాయణరావు.

'పక్షులా?' ఈసారి కళ్ళీ ఊడదీసుకుంటూ ఉలిక్కిపడ్డాడు కరణం.

'ఆఁ!' నిర్ధారణగా నిష్కర్షగా తల ఆడించాడు నారాయణరావు.

'బాగానేవుంది. పనికిరాని పెధవని మనం పక్షే అంటాం.' అంటూ కుర్చీలోంచి ఎదటికి లేచిన భీమశంకరం వెనక్కి వాలసాగేడు.

'మనం అనే మమకారం అన్నివిధాల అతీతులమనుకొనే అహంకారం కల మానవులకంటె ఆపక్షులే నయం. నిష్కాపట్యం, స్వచ్ఛత, స్వచ్ఛందత అనే అంశాలు—వాటికి అవగాహన అయినట్టూ అనుక్షణం ఆచరణలో అచ్చొత్తించేటట్టూ మానవులకు అర్థం గానట్టే అందనటువంటి పదార్థాలు!'

నారాయణరావు గంభీరంగా అనేసరికి భీమశంకరం ఒక్కసారి ఒదిగిపోయేడు. కాని ఖరద పాములా బుసకొడుతూ పైకి లేచేడు.

'క్షుద్రాలయిన పసువులూ పక్షులే మనకి ఆదర్శాలంటారు?' అన్నాడు కొంచెం తీవ్రంగానూ తన ఆత్మకేదో అన్యాయం జరిగిపోయినట్టూను.

'నిజానికి తిర్యక్కులకంటె మనం అధికులమే! కాని అవలక్షణాలు బాగా అంటువ్యాధుల్లా వ్యాపించిపోతున్న మానవలోకంలో అవే నయమనిపిస్తాయి!'

'అలాగాండి?' అవహేళనాత్మకంగా అడిగాడు భీమశంకరం. అంత ఇంతలో చలించే మనిషి కాని నారాయణరావు మంచి గంభీరస్వరంతో ప్రారంభించేడు. 'కరణంగారూ! ఒక సంగతి చెబుతా వినండి. నేనీ భవంతిలో ఏకాంతవాసం మొదలుపెట్టినప్పట్నుంచి చూస్తున్నా. మన శిథిల దేవాలయం జీర్ణకోటరంలో రెండు పావురాలు కాపురముంటున్నయ్. వాటికి ఎంత సామరస్యం! ఎన్నో నేర్పిన మనకు మల్లే వాటికి సూత్రబంధాలూ కళ్యాణవేదికలూ లేవు. పైగా పక్షిజాలంలో ఫలానాదే భర్తృపక్షి. ఫలానిదే భార్యాపక్షి అన్న విచక్షణ ఉందని ఎలా చెప్పగలం? ఎక్కణ్ణుంచో వస్తాయి! మరెక్కడో ఆగుతయ్. అంతకు ముందా ఆడపావురం వివాహితేమో అని మగపావురానికిగాని— ఏమో మగపావురం దక్షిణనాయకుడవునో కాదో అని ఆడపావురానికి గాని ఆలోచనా పాలోచనా? కలుసుకున్నప్పటినుండి హాయిగా మాత్రం అవి జీవిస్తాయి. అలాంటి అనుబంధం మనలో ఎక్కడ వుంది? ఎన్నెన్ని అనుమానాలు? అసహనాలు? ఈర్ష్యలూ? ఉద్రేకాలూ ఉన్మాదాలూ? అవి మానవుల్ని ఆవరించుకున్న ఏ భూతప్రేత పిశాచాలో!—'

నారాయణరావు గడగడ చెప్పుకుపోతుంటే భీమశంకరంపని ఉక్కిరిబిక్కిరయింది. గుడిఇటుకల్ని బైట గునపాలు దొలుస్తున్నట్టే తన గుండెల్ని దొలుస్తున్నట్టయింది భీమశంకరానికీని!

'నారాయణరావుగారూ!' అని మధ్యలో జోరుగాపోతున్న బండికి బ్రేకు వేశాడు.

'మీవి పాశ్చాత్య భా: భీమశంకరమే న్నాడు.

'అయితే?'

'పారతంత్ర్యం పోయినా పరకీయమైన నాగరికతా వాసనా మీకు పోలేదు. ఆ సంస్కారాని మాకు అంటగడదామని ఆలోచిస్తున్నట్టున్నారు!'

'ఆ స్థాయి లేని ఈ కుగ్రామంలో నూతన సంస్కారం తీసుకురావడం సులభసాధ్యం కాదు.'

'అసాధ్యం కూడా!' బెబ్బులి గాండ్రించినంతగా గావుకేక పెట్టాడు భీమశంకరం.

నారాయణరావు చిన్నగా నవ్వేడు. చివాల్న లేచేడు భీమశంకరం. 'నారాయణరావుగారూ! మున్నబూ వాళ్ళూ మిమ్మల్ని కారణంగా అపార్థం చేసికొంటున్నారని మీకేదో చెబుదామని వచ్చేను. మీ తత్వం అర్థమయింది. సంతోషం. మరింక సెలవ్' అంటూ కాలు సాచేడు.

'ఆగండి కరణంగారూ!' అంటూ నారాయణరావు లేచేడు. అవతల గునపాలు రణగుణధ్వని చేస్తు నేవున్నై! భీమశంకరం ఆగేడు.

'మున్నటే కాదు. మీరూ నన్ను అపార్థమే చేసికొంటున్నారు.'

'నేనా?'

'కాదా?' నారాయణరావు మందహాసం చేస్తూ అన్నాడు. ఆనవ్వు రాయిరువ్వినట్టుగా భీమశంకరాన్ని గాయపరిచింది. నారాయణరావు అలా చిరునవ్వుతో కళ్లు చికిలిస్తున్న కరణంవంక చూస్తూ నేవున్నాడు.

కరణానికి ఒళ్లుమండింది. 'ఆ ముండదగ్గరికి వెళుతున్నాడు నారాయణరావు అని అంతా అంటే నమ్మలేకపోయేను అమాయకుణ్ణి.' అంటూ అడుగు వేశాడు కరణం.

'భీమశంకరంగారూ!' పెద్ద కేక వేశాడు నారాయణరావు. అమాంతంగా అతని నవ్వుమోములో విస్మయరేఖలు విరిశాయి. త్రుటిలోనే విస్మయముద్రల్లో విషాదరేఖలు ముసురుకున్నయ్. విసురుగా కరణం వీధి గుమ్మందాకా వెళ్లి ఆగి నారాయణరావు వంక చూశాడు. అసహ్యంగా తలదిప్పుతూ 'అలాంటి నక్కవినయాలూ శ్రీరంగనీతులూ ఎంతో కాలం సాగవ్. జింకచర్మం కప్పుకున్నా అది జింక కాదు,

సింహం అని తెలిస్తే ఎవ్వరూ ఊరుకోరు! నెత్తిన పెట్టుకుని ఊరేగించరు?" అంటూ మెట్లుదిగాడు భీమశంకరం!

'కరణం గారూ! కరణం గారూ!' అంటూ నారాయణరావు వీధి గుమ్మం దాకా వచ్చేశు. కాని వెనక్కి తలైనా తిప్పకుండా అదేపనిగా జోరుగా వెళ్ళిపోతున్నాడు భీమశంకరం!

అరచి అరచి నారాయణరావు పెదవులు పిడచ బారినయ్. ఆలయందగ్గర తాపీమేస్త్రీలు ఎత్తిన సున్నపాలు ఎత్తినట్టే ఆగిపోయి తెల్లబోయి చూస్తున్నారు. నారాయణరావు దృష్టి అటు ప్రసరించింది!

'అరే!'

నారాయణరావు గుండె ఆగిపోయింది. గుడి గోపురం పూర్తిగా కూలగొట్టేశారు! నిలబడ్డట్టే నిర్జీవప్రతిమైపోయి నిర్నిమేష నేత్రాలను నిబిడాంధకారమైపోయినట్టున్న నింగిలోకి నిమగ్నం చేశాడు నారాయణరావు!

గోడగడియారం నాలుగు గంటలు కొట్టింది. డ్రాయరుమీద తల ఆన్చుకొని కుర్చీలో కునుకుపాట్లు పడుతున్న నారాయణరావు చెవుల్లో ప్రతిధ్వనించాయ్. హృదయాంతరాళంలోనూ అదేపనిగా ప్రతిధ్వనులు కూలాలై మెదులుతూనే వున్నయ్.

మెలకువా నిద్రా మిళితమై కునుకువచ్చి కళ్ళు మూస్తూ, గుండెలో ములుకులా తగిలి కళ్ళు తెరుస్తూవున్న నారాయణరావు ఆ విలయ ప్రతిధ్వానాలకు చలించడంలేదు. కన్ను మూతపడుతున్నప్పుడు సర్వాన్నీ మరిచిపోగలగడం కనురెప్పలు కదులుతున్నప్పుడు డ్రాయరుమీద దృష్టి ప్రసరించగలగడం మాత్రం జరుగుతోంది.

అతని కనురెప్పల కదలికల్లానే ఆ డ్రాయరు మీది డెయిరీపుటలు మందుమందంగా గాలికి ఎగురుతున్నై. తెల్లటి పత్రంమీది నల్లటి అక్షరాలు మిలమిల లాడుతున్నయ్. ఒక పుటలో—

"నా జీవితం రాజకీయరంగంతో ప్రారంభమయింది. పాతికేళ్లవరకూ గాంధీగారి శంఖారవాలకు శ్రుతులు గలుపుతూ..."

రెండుమూడు పుటలు రెపరెపలాడినయ్.

"ఇరవైఆరో ఏట ... పెద్దల బలవంతంమీద వివాహమైంది. అంటే ఈనాటితో క్షత్రియ సమాజంలో నా జీవితయాత్ర ప్రారంభం...సంఘమనే మురికిగుంటలో కళ్యాణమనే కౌగితం పడవ కట్టుకుని చంటిపిల్లవాడిలా నానాలాట మొదలు పెట్టానన్నమాట!"

మరికొన్ని పుటలు వెనక్కి మడతలుపడ్డాయ్.

"జోడు గుర్రాల బండి ఈ సంసారం. ఒక గుర్రం ముందు నడక. మరొకటి వెనక నడక. దారి అంతకంటె గతుకులబతుకు. సాఫీగా బండి ఎలా సాగుతుంది? అయితే కర్తవ్యం?—మెదడులో ఆలోచన అంకురించింది!"

పది పదిహేను పుటలు లొక్కసారిగా పరవళ్ళు (

'పుట్టింటికి వెళ్ళింది మా ఆవిడ. ఆనాడో మర్నాడో వస్తుందని ఎదురుచూస్తున్నా. వచ్చింది: మా ఆవిడ కాదు. విడాకుల పత్రం......ఆడదాని కింత బరితెగించినతనమా? ఆవేశానికి ముంగు ఆహుతి అయ్యాను. క్రమంగా ఆలోచించాను. ఏమేమి సిద్ధాంతాలు విశ్వసించాను? స్త్రీకి స్వాతంత్ర్యార్హత సిద్ధించకూడదనా ఇప్పటి నా స్వార్థం?

మంచిపనే చేసింది మా ఆవిడ అనిపించింది... అనుకూల్యంలేని దాంపత్యంతో హృదయదౌర్బల్యం ముదిరిన అర్భకులెవరో అణగివుంటారు. ధైర్యవంతులు దైన్యాన్ని తీర్థప్రసాదంగా స్వీకరించరు!...అలా వాటితో నా కౌగితంపడవ మురికిగుంటలోని కుళ్లు నీటిలో నానిపోవడం మొదలయింది!"

అయిదారు పుటలు అధిగమించాయి.

"డైరీ అనేది సామాన్యవిషయం కాదు. తెలివైనవారు సంవత్సరానికో పుస్తకాన్ని డైరీగా చేయరు. అలా చేస్తే పాతసంవత్సరాల పుస్తకాలు పెంటలమీదికి పోయినా వారికి అభ్యంతరం లేదన్నమాట. కాని నాకు ఒక గ్రంథాన్ని జీవితగ్రంథం చేసుకోవాలని సంకల్పం..."

మరికొన్ని పుటలు గాలికి టపటప కొట్టుకుంటూ ఒక నిమిషానికి ఆగాయి!

"అమ్మాయి విమల అమ్మతో వెళ్లాలనే తీర్పు. నాకెందుకో విమలంటే ఎక్కడలేనీ ప్రేమ. పిల్లని వదిలిపెట్టలేక నాతో వుండమన్నా. ఎనిమిదేళ్ళ కుర్రది ఏమనగలదు? అదృష్టవశాత్తూ తల్లి అభ్యంతర

పెట్టలేదు. అందుచేత అమ్మాయి నాదగ్గరేవుంది. ఈనాటి శక్తితో అమ్మాయి ఒక నూతన తరగతికి వెళుతూంది పాఠశాలలో!"

గబగబా పాతికపుటలు గాలికి గిర్రున తిరిగిపోయినయ్.

"అమ్మాయికి పెళ్ళిచేశాను. అభ్యుదయ పథంలోనే అయిందా వివాహం. వరుడు ఆస్తిపరుడు కాదు విద్యావంతుడు! మా అమ్మాయికీ ఆ సంబంధం చక్కగా నచ్చింది. యథాశక్తిగా అందంగా ఆనందంతో జరిపించాను పెళ్ళి. ఆ సందర్భంలో ఎంతచెడ్డా కన్నతల్లి అని కబురంపించా. పిడుగులాంటి వార్త. నా రత్నం పుట్టింటిలోనే వుండిపోయిందట! అప్పటికి వారం క్రితమే కాలం చేసిందని ఆ వార్త! అభాగ్య మాతృమూర్తి! కన్న సంతానంయొక్క కళ్యాణఘడియలికి కాకుండా పోయింది! అనుకున్నా. కంటతడి మిగిలింది."

మళ్ళీ పదిపదిహేను పుటలు తిరిగాయ్!

"ఇంతకంటె దుర్దినం నా కుండదు. పందిట్లో పచ్చనితోరణం ఇంకా వాడనేలేదు. మా అమ్మాయి—చనిపోయింది—మురికిగుంటలో నా కాగితం పడవ పూర్తిగా మునిగిపోయింది—"

తర్వాత పుటంతా తడిసినట్టు ఆనవాలుగా అలుక్కుపోయిన కొన్ని అక్షరాలు! ఆఖర్న స్పష్టాస్పష్టంగా 'ఎందుకు నా శేషజీవితం?' అన్న ప్రశ్న

అతికష్టంమీద ఒకటి రెండు పుటలు కుర్చీలో కునుకుతున్న నారాయణరావుని చూచి జాలిగా కదిలాయి!

"అమ్మాయి లేని ఆ యింట్లో క్షణం వుండటం దుస్సాధ్యం. లేసులల్లిన గుమ్మం తెరలూ, పువ్వులతో చక్కగా దిద్దితీర్చిన టేబిల్ క్లాతూ, గోడబీరువాలో అమ్మాయి పుస్తకాలూ అద్దాల బీరువాలో అమ్మాయి బట్టలూ ప్రతిక్షణం నన్ను సూదులతో పొడుస్తున్నయ్. ఆఖరికి అమ్మాయి లేని ఇల్లు అంధకారబంధురమైన గుహలా అయి క్షణం ఇంట్లో వుండలేనంతస్థితికి వచ్చేను. ఎక్కడకు వెళితే మనశ్శాంతి?"

నారాయణరావు కళ్ళు తెరిచాడు. చాలావరకు నిద్రాజడ్డకం వదిలినట్టేవుంది. డ్రాయరుమీద ఎదురుగా డెయిరీలో "ఎక్కడికి వెళితే మనశ్శాంతి?" అన్న అక్షరాలు అతని కళ్లల్లో మెదిలాయి. అక్షరాలు మెదుల్తూనే అమాంతం అతని కన్నులు భూతద్దాలు అయినయ్.

నాడూ నేడూ అదే ప్రశ్న, విషదంష్ట్రావిలయ వికటాట్టహాసం! ఆపాదమస్తక కంపనమూ కంపరమూ కలిగింది నారాయణరావుకి. అలానే డైరీలెండు పుట త్రిప్పుదామని చేయి సాచబోయేడు. తిమ్మిరెక్కి కొంకరబోయినట్టు చేయి అస్వాధీనంలో వుండటాన్ని గమనించాడు. ఒక్క కుదుపు కుదుపి అటూ ఇటూ విదిపి చేతిని స్వాధీనంచెసుకోబోయేడు. ఇంతలోకే బయట "నారాయణరావుగారూ!" అని కేక. ఆ ప్రయత్నం మాని నారాయణరావు అడుగు కదిపి తలుపు బారుగా తెరిచాడు. ఒక్కసారి ఉద్ధృతంగా గదిలోకి వచ్చిన గాలికి డ్రాయరుమీద డెయిరీ టపటప కొట్టుకోసాగింది యజమాని గుండెకు సానుభూతిగా.

"ఈ వూరు వచ్చాను. ఇలా అవుతోంది!" అనుకోకండా పైకి అంటూ నారాయణరావు వీధితలుపు తీశాడు.

గుమ్మంలో మున్సబు!

మున్సబుకి నారాయణరావు అన్నది వినబడింది. కాని అర్థంకాలేదు. నారాయణరావుకీ ఆ మాటలు తన పెదాలు ఎందుకు ఉచ్చరించాయో అన్నది అజ్ఞాతమైన అంతశ్చేతనాబలవదావిష్కరణమే!

'రాత్రి మీరుపడిన శ్రమకి ఫలితంగా ఆ మేస్టారికి ప్రాణం లేచి వచ్చిందటండి! హాయిగా వున్నదట. అంతా మాయగావుందే రోగమని ఆశ్చర్యపడుతున్నారు. అదంతా మీచలవ అని వాళ్ళకేం తెలుసు?—' అంటూ మున్సబు ఏమేమో చెప్పుకుపోతూ లోపల ప్రవేశించి కుర్చీమీద ఆసీనుడయేడు.

"ఆ మేష్టారికి ప్రాణం లేచివచ్చిందటండి!" అన్న మాట నారాయణరావుహృదయంలో గాఢంగా హత్తుకుపోయింది. అన్యవిషయాన్ని గ్రహించే స్థితిలో లేకండా ఆనందం ఒక్కసారి ఉప్పొంగి ఉప్పెన అయి ఉజ్జృంభించింది నారాయణరావుహృదయం. కమిలిపోయిన అతని ముఖంలో కళాకాంతులు మొనలు నిలిపాయి! జీవరేఖలు ననలుతొడిగాయ్!

'మేస్టారికి నయమయిందా వ్యాధి?' ఆనందాన్ని ఆశ్చర్యాన్నీ అచ్చొత్తేలా నారాయణరావు అడిగాడు.

'ఆఁ. వ్యాధే!' అన్నాడు మున్సబు. ఆమాటలోనూ ఆ ఉచ్చారణలోనూ అర్థాంతరం, భిన్నధ్వనీ ఉన్నట్టు కనీసం శంకయినా కలగలేదు నారాయణరావుకి.

'తగ్గిపోయిందా?' అన్నాడు ఉత్సాహాధిక్యంతో తబ్బిబ్బు అవుతూ మళ్ళీ.

అదే వైఖరిలో తల ఆడించాడు మున్సబు.

'ఒక్కసారి వెళ్ళి చూచిరావాలి!'

ఆత్రుతా ఆదుర్దా పెనవేసుకుని అటు ఇటు అడుగులు వేయసాగాడు నారాయణరావు.

'నారాయణరావుగారూ!'

కొత్తగా వినిపించింది మున్సబు పిలుపు. అటూ ఇటూ అనంపసంచలితుడు అవుతున్న నారాయణరావు యథాతథంగా ఆగి పరిశీలనగా మున్సబు మొహంలోకి చూశేడు. అల్లల్లాడుతున్న మున్సబుకన్నులు చూస్తే రెక్కలాడిస్తున్న గబ్బిలాలు నారాయణరావు దృక్పథంలో కదిలాయి!'

'మున్సబుగారూ!' కృశీభూతమయ్యే కంఠంతో సంబోధించేడు.

'మీగురించి గ్రామంలో కలవరం ఎక్కువగా వుంది.'

'నా గురించా?'

తెల్లబోయి నారాయణరావు తేలకన్నులు వేశాడు.

"అవును. మీగురించే, ఇందాక రెండుగంటలకి కరణంగారూ నేను అలా మేష్టారింటికి వెళ్ళాం. ఎలా వుందో పాపం చూదామని..."

నారాయణరావు కళేబరం ఆలకిస్తోంది. మున్సబు రెప్పవాల్చని చూపుతో చెప్పుకుపోతున్నాడు.

"పదిగంటలకే మేష్టారికి తెలివి వచ్చిందట. మేం వెళ్ళేసరికి మామూలుగా వున్నాడు. అంతలో డాక్టరు వచ్చేడు. ఆయన పని ఆయన చూసుకొని "ఆ మహానుభావుడు అడుక్కోబట్టి పెద్ద ఖరీదయిన ఇంజక్షన్లు ఇచ్చిపోతేశా. ఇక నీకేం భయమక్కర్లేదు. రెండురోజుల్లో లేచితిరుగుతావ్.' అన్నాడు. 'ఏ మహానుభావుడని?" వింతగా చూశాడు మేష్టారు.

నారాయణరావుగారూ! మీకా మేష్టర్లు ఏమయితే ఏంకావాలి? మంచికి పోయి తలదూర్చేరు. కరణంగారు కొస్తా కలహాగ్ని రాజేసేడు. "ఇంకే మహానుభావుడు. మీ ఆవిడని ప్రతిరోజూ పవిగట్టుకు చూస్తూ మురిసిపోయే ఆ ముసలి పీనుగ! నారాయణరావట నారాయణరావు!" అన్నాడు కరణం. ఆ పుల్ల విరుగుడిమాటలకి మిడిగుడ్లు తేలవేశాడు మేష్టారు. డాక్టరు తలవంచుకుని దారితీశాడు. మధ్య స్నేను మంటలో పడ్డ మిడతలా మాడిపోయేను. ఇంకేవుంది. తడిసిన పుల్లలయినా అగ్గి రాజిందంటే ఆగుతుందా మహాశయా!" అన్నాడు మున్సబు.

నారాయణరావులో సగం చైతన్యం తప్పింది.

'ఇకనుంచయినా మీ రటు వెళ్ళకండి. ఆ కరణానికేం? నియోగిపిండం నియోగిపిండమే!" అంటూ మున్సబు లేచాడు. రాతిబొమ్మలా కనిపించాడు నారాయణరావు.

'వస్తాను సెలవండి.' మున్సబు మెల్లగా కదిలాడు.

నారాయణరావు గాజుకళ్ళు చూస్తున్నాయి.

మున్సబు మెట్లు దిగుతున్నాడు. పిలుద్దామనిపించింది నారాయణరావుకి. పొడిగొంతుక విడివడలేదు. కదలిక కలిగిన కొయ్యలా అరుగుమీదికి వచ్చేడు నారాయణరావు. మున్సబు నడక గుడివయిపు సాగుతుంటటం మసకగా కనబడుతోంది. అటే నారాయణరావు నిస్తేజమైన నేత్రాలు నిర్జీవంగా చూడసాగాయి!

నేలమీద కూలిపడిన గుడిగోపురం ఇటికల దొంతరమీద మున్సబు కాలు కదం తొక్కడం కనిపించింది. అపక్కనే—

నారాయణరావు కళ్ళు విప్పారినాయి. గుండెల్లో ముళ్ళు గుచ్చుకున్నయ్.

ఆ పక్కనే—ఇటికదిమ్మల ఇరుకున టపటప రెక్కలు కొట్టుకుంటున్నది—మగ పావురమే!

నారాయణరావు నరనరాల విద్యుద్ఘాతం కలిగింది! మరీ స్థాణువైపోతూ శూన్య దృక్కులతో చూస్తున్నాడు.

మున్సబు పావురాన్ని బైటికి లాగేడు. గాలిలోకి వదిలేడు.

నారాయణరావు చూశేడు.

'అరె! ఎగరలేక కింద పడిపోయిందే!'—

ముందుకు వంగబోయిన నారాయణరావు కూలి నిలదొక్కుకొంటూ చూశాడు.

"పాపం! రెక్కలికి దెబ్బ తగిలింది. అదిగో స్పష్టంగా గాయం నెత్తురు ముద్దకట్టి కనిపిస్తోంది.

'మున్నబు గారూ!' ఎల్లాగో నారాయణరావు గొంతుకముడి విడివడింది. మున్నబు తలదిప్పి చూశాడు.

అడుగు వేయబోయి నారాయణరావు ముందుకి తూకరిల్లాడు!

మొదట నవ్వూ తర్వాత ఒక వికారకవళిక మున్నబు కళ్ళల్లో ప్రతిఫలించినయ్.

కాళ్ళకు అడ్డుపడిన సుడిగాలిని తప్పించుకొంటూ నారాయణరావు అడుగులు ఎల్లాగెల్లాగో ముందుకు పడుతున్నయ్. కళ్ళు బయర్లు గ్రమ్ముతున్నయ్. చీకటి ఖావురుమంది.

## 10

కొన్ని రోజులు గడిచినయ్.

పునర్నిర్మాణ దశలో ఆలయం పులకరించింది. కొత్త సున్నం కమ్మదనంతో కూడిన ఘాటును వెలిగ్రక్కుతోంది. చతురస్రాకృతిపర్యంతం నల్ల సిమెంట్ పూత పెట్టబడింది. కొత్త గోపురం రేఖా మాత్రమైన ఆకృతి దాల్చింది.

నడంచావిడిలో గుమ్మానికిఎదురుగా నారాయణరావు కూర్చున్నాడు. నూతన శోభలు చిందుతున్న గుడి కన్నులను మిరుమిట్లు గొల్పుతోంది. కాని ఆ కన్నుల అంతఃకోణాలలో మసకదనమే! అది కుర్చీ చేతిమీదున్న పావురంమీద దృష్టి పడినప్పుడల్లా బాగా బహిర్గత మవుతోంది. బాధతోనే నారాయణరావు మనస్సు పక్కనున్న పావురాయిని ఓదారుస్తోంది.

అనునయంగా నారాయణరావు పట్టుకుచ్చుల వంటి రెక్కలని దువ్వుతూ పావురం కళ్ళల్లోకి చూశాడు. మెడకింద గాయం కనపడింది. నారాయణరావు బాధ భావనగా మారసాగింది.

'పాడులోకం!'

గుహాంతరంలోని కారుచీకటిలా నారాయణరావు గుండెలో మూలుగు నలుమూలలా ఎగబ్రాకింది. కాస్సేపటికి 'కాదు. లోకాన్నెందుకనాలి?' అన్న అభిప్రాయం కలిగింది. గుహాభ్యంతర తిమిరాంధకారంలోకి ఉషఃకాంతులు ప్రసరించినట్టే మెదడు మెరిపి నారాయణరావు తెలివి విరిసింది. 'కావలసి లోకం అపార్థం చేసుకోదు. ఒకళ్ళకి అకారణంగా అన్యాయమూ తలపెట్టదు. విషయాన్ని అర్థం చేసికొనేంత విపులజ్ఞానం వ్యక్తిగతంగా లేక ఈ దురవస్థ. మానవుడికి విజ్ఞాన వికాసం లేకపోవడం ఆ మానవుని స్వయంకృతాపరాధమూ కాదు. పూర్వజన్మ దుష్కృతిమూ కాదు. కాలవైపరీత్యమో! కాల నియంతృత్వమో! అనుకోవాలి. ఏమయితే నేం?— అనుకుంటూ నారాయణరావు తలదిప్పడంలో బల్ల మీద డైరీ కనిపించింది. ఒక్కసారి గుండె గతుక్కుమని కూడా నిబ్బరం వహించి నారాయణరావు చేతిలో జాలిగా దీనంగావున్న పావురాన్ని చూశాడు.

'తోటి పావురం లేదని ఎంతగా విలపిస్తున్నదో! ఈ మూగజీవాల వేదన బాధా ఎవరికి పడతాయి. ఒకవేళ సానుభూతిగలవారుంటే మాత్రం ఏం చేయగలరు? దీని బాధ నాకు తెలుసు. అందరికీ తెలుసు. తోటిపావురం లేదనే ఇంత దీనతా విచారాధీనతాను. అయితే నేం ఎలా ఆడపావురం దొరుకుతుంది? ఎక్కడికి పోయిందో! ఏ చెట్టో పుట్టో శరణ్యంగా అదెంత ఆవేదన పడుతుందో! దానికిమాత్రం ఈ మగపావురాని కున్నంత వియోగదుఃఖం వుండదూ? విడాకులిచ్చింది గనుకనా వినిర్భయుంగా స్వేచ్ఛా సంచారం చేయడానికి! నిజమే, రెంటికీ అన్యోన్యత వుంది. పరస్పరం సమాగమన ప్రయత్నంతో క్లేశాన్నే అనుభవిస్తున్నాయ్. ఎలా వాటికి సంధానం? ఏవిధంగా మధ్యవర్తి వాటిని ఒచోటికి చేర్చగలడు? ఆయితే అవి అలా వియుక్తజీవులు కావలసిందేనా?

ప్రేమజీవులల్లా—పాపం, అడివిలో మహాకారణ్యంలో ఎక్కడో ఆడపావురాయి మల్లేనే, ఈ కుగ్రామంలో ఊరిచివర పూరిగుడిశెలో హరిజనవాడలో ఇరవైయేళ్ళ పంతులమ్మకూడా ఎంతగా అవస్థపడుతుందో? ఎంతగా భర్తృతిరస్కారాన్ని భరించలేక బాధపడుతోందో? ఏవిధంగా ఆ అమ్మాయికి ఓదార్పు? మనశ్శాంతి?

అసలాత ఇబ్బంది కలిగించో లేదో! ఆ మేస్టారు అంతలోనే అపార్థం చేసుకొంటాడా? చేసుకోకపోతే అంతా ధన్యతే. చేసుకుంటే ఏవిటి గతి? మొన్నా అటుమొన్నా స్వస్థత చేకూరక ఊరుకోవచ్చు. ఇవాళో రేపో పూర్తిస్వాస్థ్యం చేకూరుతుంది. శంకితహృదయుడు! ఏమి అఘాయిత్యానికి ఒడగట్టుతాడో! కొంపదీసి ఆ పిల్లని అన్యాయంగా పొమ్మనడు గదా?—కొంతవరకూ భయమో భక్తో వుంటానికైనా అనూచానంగా వచ్చే ఆచారాల అడుగుజాడల్లో మంత్రోక్తంగా వివాహమైనా కాలేదు—! అయి

నంతలో అదొక స్థిరత్వసాధనం అని కాదు! ఏమిటో—

గాలిలోని జ్వాలికలవి! స్వేచ్ఛావిహాయసంలోని ప్రేమపక్షులు వారు!—

ఊహ సాగే కొలదీ నారాయణరావుకి భయాందోళనలు ద్విగుణీకృతాలయి బాధావిలమైన మనస్సుతో మథనపడిపోతున్నాడు.

ఉన్నట్టుండి చేతిలోని మగపావురం కీఁ కీఁ మంది. ఏమిటా అని నారాయణరావు పావురంవంక చూశాడు. పావురం ముక్కు పైకీ కిందికీ ఆడిస్తూ ఏదో చెబుతూన్నట్టు కనిపించింది?

ఏమిటా మూగభాషకి భాష్యం?

"ఓహో!—" జ్ఞాపకం వచ్చింది నారాయణరావుకి!

"హరి!"' విస్మయ ప్రకటన తెలీకుండానే జరిగిపోయింది.

"పక్షి అయితేమటుకు ఎంత వివేకం! మానవునిలోకంటె గొప్పగా జ్ఞానం వుంది. చ్! నిజంగా సృష్టిలో ప్రాణులన్నీ స్వతస్సిద్ధంగా స్వకీయమైన వివేక విజ్ఞానాలు కలవే కాబోలు!—

నాలుగు రోజుల్నుంచి సరిగ్గా ఇదేసమయానికి గాయానికి కట్టు మార్చి కొత్తగా మందు వేస్తున్నాను. పరధ్యానంలో పడి ఈ పూట మరిచిపోతే ఇదే ముక్కుతో మూగభాషతో జ్ఞాపకంచేసింది. మూగవుడైన రోగికి కూడా తన ఆరోగ్యంమీద ఇంతగా ఆసక్తి వుండదేమో! ఎంత తెలివిగా నా మందమరుపుకి మందు వేసింది! బలే!—"

ఎక్కడలేని సంతోషమూ కలిగింది నారాయణరావుకి. అంతవరకూ తలపోసిన ఆలోచనలు ఏ గాలిలో కలిసిపోయాయో! అనుకొన్న విషాద విచిత్రఘట్టాలు ఏ తెరచాటునకు పోయి కోటాలు కడుతున్నాయో!—ఉత్సాహంగా ఉప్పొంగిపోతూ పావురాన్ని అరచేతుల్లో వుంచుకొని ఆప్యాయంగా లేచేడు.

పసిబిడ్డను బాలింతరాలు నీళ్లు పోయడానికి తీసుకు వెళ్ళినట్టుగా అరచేతుల్లో స్పర్శాసహంగా పట్టుకొని నారాయణరావు వాకిట్లోని బావిదగ్గరకు వెళ్లేడు.

ఎక్కడ కొనగోరు పచ్చిగాయానికి గుచ్చుకుంటుందో! పావురం లేత హృదయం ఎక్కడ నొచ్చుకుంటుందో అని నారాయణరావు బాధ. నిజానికి పావురం గాయం చాలావరకు మానింది. కాని నారాయణరావుకి అంత ఆప్యాయత!

బహు భద్రంగా కట్టు విప్పేడు. మెలమెల్లగా ఒకే చుక్క చొప్పున నీటిబిందువులు జారవిడుస్తూ గాయాన్ని క్షాళన చేశాడు. తన చేయి ఆ గాయాన్ని తాకితే చాలు పావురం ఎంత విలవిలలాడిపోతుందో అనే భయం. తీరా పొరబాటున తగిత్తే తన ప్రాణాన్ని ఎవరో లాగుతున్నట్టూ హృదయాన్ని రంపంతో కోస్తున్నట్టూ బాధపడుతూ నారాయణరావు అతిజాగ్రత్తగా రెక్కల గూడుకూ మెడకూ నడిమి భాగానవున్న గాయాన్ని కడిగాడు.

పురిటి పాపను స్నానంచేయించి తల్లి ఏవిధంగా పట్టుపొత్తిళ్ళల్లో వేసికొని లోపలికి తీసుకువెళుతుందో అంత సుకుమారంగానూ ఆప్యాయంగానూ పావురాన్ని అరచేతుల్లో వేసికొని మెల్లగా నడుస్తూ ఎట్లాగో వసారా గదిలోకి వచ్చేడు. అతికోమలంగా పావురాన్ని పీటమీద ఉంచేడు. అలమారలోంచి మందుసీసా డాక్టరిచ్చిన మెత్తని దూదీ తీశాడు. వేయికళ్లతో చూస్తూ కట్టుకట్టడానికి ఉపక్రమించాడు నారాయణరావు.

అంతలో నడుం చావిడిలోకి ఎవరో వచ్చిన అలికిడి విస్పష్టంగా వినిపించింది 'ఎవరు?' అందామని తల యెత్తాడు. కాని అనలేదు. తీరా పలకరించిందాకా వుంటే ఫలానా అంటారు. కరణమో మున్సబో అయితే గమ్మున వెళ్ళాలి లేకపోతే ఆలస్యాన్ని అనేక విధాలుగా ఊహించి ఏమైనా అపనిందలు వేయగలరు. వేసినంతలో తనకేం పోదుగాని ఎవరైనా నష్టపడవలసివస్తే తనకి కాదా ఆ కష్టం. ఇప్పుడా అమ్మాయి ఎలాంటి అవస్థలో వుందో! అదిగాక వచ్చినవారికోసం తొందరపడి వెళితే ఇక్కడ చికిత్స అసంపూర్తిగా ఆగిపోతుంది. ఈ పావురం ఎంత బాధపడుతుందో!—అనుకొని నారాయణరావు లేచి వెళ్లడానికి అంటే పావురానికి చికిత్సమాని వెళ్లడానికి మనసొప్పక పావురాన్ని చూస్తూ 'సరే వచ్చినవాళ్ళు ఎలాగూ వుంటారు. ఏ బల్లమీదో కుర్చీమీదో కూర్చోగలరు. లేదా ఈలోగా పిలువనే పిలుస్తారు. అప్పుడా కంఠాన్ని బట్టి ఆలోచించవచ్చు." అని కూడా స్వగతించుకొని నారాయణరావు పావురానికి కట్టుకట్టడంలో నిమగ్నుడయ్యేడు!

ఆ చిన్ని గాయానికి—ఇంతాజేసి ఒక పక్షి గాయానికి—కట్టుకట్టడానికి నారాయణరావుకి అరగంట సుమారు పట్టింది. మందుసీసాలు అలమారలో

పదిలపరిచి మరీ ఆప్యాయంగా పావురాన్ని అరచేతుల్లో వుంచుకొని నడవ చావిడిలోకి వచ్చేశాడు నారాయణరావు.

ఎవ్వరూ లేరక్కడ. కళ్లు పెకలించుకు మరీ చూశాడు నారాయణరావు. ఎవరూ లేంది ఎంతగా చూస్తే మాత్రం ఎలా కనిపించగలరు?

“ఎవరో వచ్చేవుండాలి. స్పష్టంగా అడుగుల జాడా అలికిడీ వినిపించింది. వస్తే మరా వ్యక్తి ఎందుకు వెళ్ళిపోయినట్టు? అసలెందుకు వచ్చినట్టు? వచ్చిన పనేమిటో పరిష్కారం కానిదే కనీసం వ్యక్తినైనా కలిసికోనిదే ఎందుకు వెళ్ళిపోతాడు? వెళ్లడు. అంటే ఎవరూ రాలేదన్నమాట. రాకపోతే ఆ ధ్వని ఏమిటి? పోనీ వచ్చి వెళ్ళాడే అనుకుందాం. వచ్చినప్పుడు అయిన అలికిడి వెళ్ళినప్పుడు మాత్రం అవ్వదూ? అలాంటి అలికిడి తిరిగి వినబడలేదే! అంచేత రాలేదనుకోవచ్చా? ఒకవేళ ఆ రెండోసారి అలికిడి తన కార్యనిమగ్నతలో వినిపించలేదేమో! అలాగనుకున్నా వచ్చిన ఆ వ్యక్తి అప్పుడే ఎందుకు వెళ్ళిపోవాలి? అసలు ఇంతకీ ఆ వచ్చిందెవరో? కరణమా? మున్సబా? కాక మరెవరైనానా? మరెవరైనా అయితే ఎవరైవుంటారు? తరచు వచ్చేవారిలో ఒకరే అయివుండాలి. అంటే తరచురాని వ్యక్తిగాని అసలు రాని వ్యక్తిగాని రాకూడదని వుందా? ఎప్పుడూ రాని వారు ఎందుకు వస్తారు? వస్తేమాత్రం ఏం ఉద్ధరణ జరిగిందని వెళ్ళిపోవాలి? ఏం? ఎందుకు వెళ్లకూడదు? ఆయన లేరు కాబోలు మళ్ళీ రావచ్చు అని వెళ్ళినా వెళ్ళిపోడానికి సావకాశం వుంది. ఏమిటో ఇదంతా. ఎవరో ఇంతకీ వచ్చింది. ఇదంతా అనవసరమైన తర్కవితర్కమా?”

పరిపరివిధాలుగా ఊహలు సాగిన నారాయణరావు దృష్టి మగపావురంమీదుగా బల్లమీదికి ప్రసరించింది!

‘అరె!’ ఆశ్చర్యం ప్రకటితమయింది. అడుగు ముందుకు పడింది.

“బల్లమీది డైరీ అలావుందేం! ఎవరో పుటలు అటూ ఇటూ తిప్పినట్టు వుందే!—”

విస్మయపడుతూ నారాయణరావు బల్లదగ్గరకు వెళ్ళి తెరువబడిన పుటలోకి తొంగిచూశాడు.

“నిజంగా నాకు మనశ్శాంతి లభించింది. అచ్చంగా ఆమె నా కూతురే! అప్పుడప్పుడు మా అమ్మాయి చనిపోలేదనీ, నన్ను మోసం చేసి నా కంటి ముందో వెనుకో చాటుగా ఈ వూరు వచ్చేసిందేమో అనీ అనిపిస్తుంటుంది నాకు. అలా అమ్మాయి తటస్థపడగానే అనేక పర్యాయాలు తబ్బిబ్బుపడ్డాను. సరిగా ప్రతి సాయంకాలం నాలుగు గంటలయాక బడినుంచి వస్తున్న ఆమెను చూస్తుంటే నా కళ్లకి మా అమ్మాయి సాక్షాత్కారమే! మనస్సుకు ఆనందమవుతుంది నాకు. ఆమె బడిలో మేష్టారో! హరిజనవాడలో కాపురముంటున్న గృహిణియో! ఎవరయితేనేం నాకుమాత్రం అది అనవసరం. ఆమె నా దృష్టికి మా అమ్మాయే!

అదే వయస్సు. అలాంటి రూపురేఖలే! సరిగ్గా అలాంటి సరిగంచు చీరో వాయిలుచీరోగాని, వెడల్పాటి పువ్వుల అద్దకాలతో, ఇప్పటికీ మా అమ్మాయి పెళ్ళినాటి ఫొటో కాలికో బైండులో వుంది. నలుపైనా అలానే నవ్వుమొహం పక్కను మేష్టారుతో ఆమె కలకల కంఠంతో కిలకిల నవ్వుతో గలగల గాజులతో నడిచి వెళుతుంటే మా అమ్మాయి భర్తతో హాయిగా ఆనందంగా షికారు వెళుతున్నట్టే నా అనుభూతి! అందుకు సాయం గుడికోటరంలోని పావురాల జంట నా ఊహలకీ భావాలకీ ప్రాతిపదిక! ఇవాళ ఇదంతా ఎందుకు వ్రాస్తున్నానంటే ఒక ఆరేళ్ళబ్బాయిమీద నామనసు లగ్నమవ్వడమే!

అంత అబ్బాయి ఆ దంపతులకి—పంతులమ్మకీ మేష్టారికీ కాదు—మా అమ్మాయికీ అల్లుడికీ ఎప్పుడు కలుగుతాడో అని నాకు ఆవేదన! ఆరాటం! అంతర్మథనం!

అర్థరహితమే కావచ్చు అనుభవపూర్వకం! ఇది ఎవరైనా చదవడం సంభవమయితే వారు నన్ను పిచ్చివాడే అనుకుంటారో! ఏమైనా నిజానిజాలూ మానసిక మథనం అందులోని అంతరాలూ గ్రహిస్తారో మరి!—

ఆఖరివాక్యం చదువుతుండగా ఆనందబాష్పమో దుఃఖబాష్పమో, ఉభయసమ్మిశ్రితమో — నారాయణరావు అక్షిద్వయంలోంచి వెలువడి కఠినకపోలం మీదనుంచి జారి చుబుకాగ్రమందు ఒకసై ఆ పుట మీద ‘టప’ ధ్వని చేసింది. బరువుగా ఒక సుదీర్ఘమైన వేడి నిశ్వాసం నాసాగ్రాల్లోంచి వెలువడి, తేలికయిన తలను తిప్పి ఎందుకో అక్కణ్ణుంచే నారాయణరావు ఆలయంవంక చూశాడు.

మబ్బుల్లోంచి బయల్పడుతూన్న చంద్రబింబంలా మరామత్తులోంచి కొత్తగుడి ఆకృతిదాల్చింది!

చంద్రబింబం చుట్టూ పరివేష మండలమల్లే కాంతివలయాన్ని ధగధగచ్ఛటలతో కడుతున్న సరికొత్తలోహ శిఖరం!

ఆ శిఖరంమీద రెండు పావురాలు వాలి పరస్పరం కిలకిల ధ్వనులు చేస్తున్నయ్!

నారాయణరావుకి ఓ నూతన దృశ్యం దృగ్గోచరమయి కుతూహలంగా చూశాడు. "నిజంగా అది పావురాల జంటే! ఏ పావురాలో కావు. రోజూ కోటరంలో కనిపించేవే!—ఏమిటిది? ఎలా వచ్చేయి? మగపావురం నా చేతిలోనే వుండాలే!"

అంతా వింతగా విచిత్రంగా అనిపించి కళ్లు నులుముకుంటూ చేతుల్లోకి చూచుకున్నాడు నారాయణరావు. "అర చేతిలో మామూలుగానే వుంది మగ పావురం! అయితే ఆ దృశ్యం నా ఊహేనా? ఎందుకిప్పుడిలాంటి మంచి ఊహ కలిగింది! వెనకోసారి దురూహ కలిగింది! ఇప్పుడీ ఉత్సాహకరమైన ఆనందప్రదమైన ఊహ! అబ్బా! ఊహాలు ఎందుకు ఉత్పన్నమవుతుంటాయో! ఎలా ఉత్పన్నమవుతుంటాయో?."

అనుకొంటూ నారాయణరావు ఒక స్వచ్ఛ స్వచ్ఛందప్రవృత్తితో ఆలయంవంక మళ్ళీ చూశాడు. అటు చూస్తూనే మగపావురంవంక దృష్టి మళ్లించాడు.

కిలకిలమంటూ రెక్కలాడించి మగపావురం కాస్తా ఎగిరింది!

నిర్ఘాంతపోయి చూస్తున్నాడు నారాయణరావు. ఎగురుతూ ఎగురుతూ ఆ పావురం కొత్తగా ఎగురు పట్టిన గోరింకలా సరాసరి కిటికీవయిపు వెళ్ళి చటుక్కున చువ్వల్లోంచి బైటికి ఎగిరిపోయింది.

నారాయణరావు దిగ్భ్రాంతుడై జరుగుతున్నదంతా ఇంద్రజాలమనిపించి అలా పావురం నిర్గమించగానే కిటికీదగ్గరకు తనకు తెలీకండానే నడిచివచ్చేడు. కిటికిలోంచి బైటికి తొంగిచూశేడు. బైటికి ఎగిరిన పావురం తిన్నగా గుడిమీద వాలి అంతలోకి రెక్కలాడించి అంతరిక్షంలోకి పశ్చిమాభిముఖంగా పయనమయింది. అటే దృష్టి పోనిచ్చాడు నారాయణరావు. అప్రయత్నంగా బడినుంచి వచ్చే బాటవయిపు అధోవలోకనం చేశాడు అంతసేపూ ఆకాశంలోకి చూస్తున్నవాడల్లా.

సన్నమవుతూ చెట్లల్లో ఇరుక్కుపోయినట్టు వున్న బాటవెంబడి ఎవరో వెళ్లడం చూసి ఎవరా అని దృష్టిని తీక్ష్ణప్రసారం చేశాడు నారాయణరావు.

"బడికి అభిముఖంగా ఆ వెళుతున్నది ఆ మగ మేస్టారే! అదిగో! బడినుంచి ఎదురుగా వస్తున్నది పంతులమ్మ!"

నారాయణరావు కళ్ళల్లో ఒక్కసారిగా చిమ్మచీకట్లు చిందులాడి అంతలోనే వెలుగు వెల్లువ వెల్లుబికింది!

# బ్రౌనుదొర జీవిత విశేషములు

## వ్యాకరణ రచన

శ్రీ కొత్తపల్లి వీరభద్రరావు

తెలుగు నేర్చుకొనగోరు పాశ్చాత్యుల కొరకు బ్రౌనుదొర నిఘంటువులను సిద్ధముచేసెను. వ్యాకరణము రచించెను. వాచకములను వ్రాసెను. వీటిలో నిఘంటు నిర్మాణమునకును, వ్యాకరణ రచనకును అతడే మొట్టమొదటివాడు కాకపోయినను, అతని గ్రంథములు ప్రజలలో పొందిన వ్యాప్తిని తక్కిన గ్రంథములు పొందకుండుటచే, దొరలు వ్రాసిన గ్రంథములు అన్నవెంటనే బ్రౌనుదొరయే మనకందరకు జ్ఞాపకము వచ్చును. ఈతని గ్రంథముల వ్యాప్తికి రెండు ముఖ్యకారణములు గలవు: ఈతని రచనలన్నియు, తెలుగువారితో సానుభూతిగల రచనలగుట మొదటి కారణము. తెలుగు భాషకొరకు కృషి చేసిన పాశ్చాత్యులందరిలో నీతడే పాండిత్యమున మిన్నయగుట రెండవ కారణము. ఈతని కృషి గమ్యస్థానము లేనిది కాదు. అతని కనులయెదుట చేర వలసిన గమ్యస్థానము అనుక్షణము కాన్పించుచునే యుండెను. కనుకనే అతడు సిద్ధిపొందెను.

అప్పటికి పండితజనాంగీకారమును బొందిన పద్ధతి; నిఘంటువులను, వ్యాకరణమును, 'వల్లె' వేయు పద్ధతి. ఇది తెలుగు మాతృభాషగా గలవానికి ఉపయోగింపవచ్చునేమోగాని, పాశ్చాత్యునకు పనికివచ్చునది కాదు. వారి దృక్పథము, బోధనా పద్ధతి, ఆదర్శము—అన్నియు భిన్నములే. కనుక పాశ్చాత్యులెవరు భారతీయ భాషలను పఠించుట మొదలిడినను, ముందా భాష నేర్చుకొనుచునే, వారి పద్ధతి ననుసరించి వ్యాకరణమును వ్రాసికొనిపోవుచు వచ్చెడివారు. జీవద్భాషల విషయములో ఈ మార్గమే ఎల్లప్పుడును వారనుసరించి రనవచ్చును. వారు రచించిన వ్యాకరణాదులను తరువాత దేశీయ పండితుల ఎదుటపెట్టి, వారి సవరింపులనుగాని, మన్ననలనుగాని పొందెడివారు. బ్రౌనుదొరకూడ ఈ పద్ధతియే అవలంబించెను. కాని, కొన్నికొన్ని స్థలములందు దేశీయ పండితుల పద్ధతులు తనకు నచ్చనిచో, సోపపత్తికముగ తన పద్ధతుల వైశిష్ట్యమును స్థాపించుకొనెడివాడు. తెలుగు పాఠము చెప్పు పండితులను గూర్చి వ్రాయుచు, వారు అనావశ్యకములయిన పదజాలములను కంఠస్థము చేయింతురనియు, దానివలన ఉపయోగము లేదనియు, కవుల కావ్యములను చదివి, అందు వచ్చిన పదములను గ్రహించినచో చాలినంత పదజాలము లభించుననియు, వారు 'ధాన్యముతో బాటు గడ్డినికూడ తినమందురనియు; విమర్శించుచు వ్రాసెను.1

ఇంత నిష్కర్షగ అతని అభిప్రాయము చెప్పినందులకు మనకు కోపము గాకూడదు. తెలుగు రాని, తెలుగు నేర్చుకొన యత్నించుచున్న, పాశ్చాత్యులను మనస్సులో ఉంచుకొని ఈమాటలను వ్రాసినాడు. అంతే. కాని, వెంటనే తెలుగు పండితులపై ఆ పాశ్చాత్యులకు గౌరవభావము కుదురదను భయముతో; ఆ పండితులు మంచి ఉపాధ్యాయులనియు, వినయవిధేయతలు, ఓర్పు కలవారనియు, చక్కని నైపుణ్యము కలవారనియు, ఏడు సంవత్సరములు వారితో కలిసి చదివినప్పుడుగాని వారి పాండిత్య

---

1. "We ask for grain : they give it us on the condition that we will, with it, submit to eat the straw......they counsel us to learn, as they do, long vocabularies by rote, where as by reading the poets we can easily acquire an ample stock of all the words that are in use."

(A grammar of the Telugu Language-Preface; Page V.) 1840, 1857.

వైభవము తనకు గోచరము కాలేదనియు వ్రాసి; తన సత్యతత్పరతను, ధర్మదృష్టిని చూపెను.2

బ్రౌనుదొర రచించిన పుస్తకము లన్నియు, ఆనాడు తెలుగు నేర్చుకొన నెంచిన పాశ్చాత్యులు, తెలుగు నేర్చుకొనవలసివచ్చిన పాశ్చాత్యోద్యోగులు శ్రమపడి చదివిరి. చాల సంవత్సరములు బ్రౌను దొర ఇంగ్లండు పోయిన తరువాతకూడ—ఈ పుస్తకములే 'సివిల్ సర్వీస్' పరీక్షలలో పాఠ్య గ్రంథములు. 3

ఈ గ్రంథములన్నియు శ్రమపడి బ్రౌనుదొర వ్రాసినవి. అనేక వేళల కృషి వీటివెనుక కలదు. కనుకనే వాటికి, నాటికి నేటికి సాటి గ్రంథములలో అత్యున్నత స్థానము. ఇప్పటికిని, తెనుగు నేర్చుకొన గోరు విదేశస్థునకు వాటికంటె మంచి పుస్తకములు ఆంగ్లభాషలో లేవనుట అత్యుక్తి కాదు. కాని, కొందరకు 'తెనుగు మాతృభాష గా కలవారికి ఈపుస్తకము లెందులకు' అను ప్రశ్న పుట్టును. ఈ పుస్తకముల వైశిష్ట్యము—అవి వ్యావహారిక భాషకు విశేష ప్రాముఖ్యము నిచ్చిన వగుట యందే కలదు. వ్యావహారిక భాషకు నిఘంటువును, వ్యాకరణమును సమకూర్ప నెంచు నవీనులు, బ్రౌనుదొర గ్రంథములను పఠించితీరవలెను. ఇంతేగాక; అంతకు పూర్వము తెలుగులో కృషిచేసిన పాశ్చాత్యుల గ్రంథములలో గల తప్పులను, వారికి తెలుగువారిపై గల విచిత్రాభిప్రాయముల వలన వారి గ్రంథములలో వచ్చిన దోషములను, తన గ్రంథములద్వారమున సరిదిద్ది, తెలుగువారిని, తెలుగు సాహిత్యమును, తెలుగు సంస్కృతిని, విదేశప్రపంచమునకు సరియైన పద్ధతిలో చూపి, మనకు బ్రౌనుదొర మహోపకారము చేసెను. ఇందువలన, బ్రౌనుదొర గ్రంథములు తెలుగు మాతృభాష గా కలవారికికూడ ఉపాదేయములే.

బ్రౌణ్యనిఘంటువులు తరువాత, ఘనత కెక్కినది ఆతడు రచించిన తెలుగు వ్యాకరణము. ఇది 1840 లో మొదటిసారి ముద్రించెను. ఇది 1857 లో ఇంకొకసారి ముద్రింపబడెను. ఈ రెండు ముద్రణములకు నడుమగల కాలములో, విద్యార్థుల సలహాల ననుసరించి, గ్రంథమున మార్పుల నెన్నింటినో చేసి రెండవసారి ముద్రించెను. 4

అనేకులు అనేక విధములుగ ఆతనికి వ్యాకరణ రచన విషయమున సలహాలనిచ్చిరి. అన్నింటిని చెవియొగ్గి విని, తనకు తోచినట్లు తాను చేసెను. సాధారణముగా భాషలో ఉన్న 'అపవాదముల'ను మార్చి, క్రొత్తరూపములను సృష్టింపవలసినదిగా కూడ ఆతనికి సలహాల నిచ్చిరట. కాని ఆ ఉత్తమ పరిశోధకుడు ఆ వాక్యములను పెడచెవిని పెట్టి, భాషను మార్చుటకు కవులకేగాని తనకు అర్హత లేదనియు, వారు మార్చినవియు ప్రచారమునకు రాకపోవచ్చుననియు, ఉన్నది ఉన్నట్లు, కన్నది కన్నట్లు నిష్కర్షగ, నిశితముగ చెప్పుటయే తన పనియనియు, తాను చెప్పిన వాటి కన్నింటికి ఉదాహరణలు చూపించితిననియు వ్రాసి, ఉత్తమపరిశోధకుని కర్తవ్యమును తెలియజెప్పెను 5

---

2. "But the Bramhans are excellent Instructors, patient, humble, and admirably skilful. Until I had studied the poems with them for seven years, I did not perceive how perfect they are in learning."

(Ibidem - Preface; Page IV.)

3. "When the competitive examinations for the Civil Service Commenced I was asked to examine in Telugu: but I did not undertake this until 1869. The books used are my own publications alone."

(From 'Some Account of the Literary life of C. P. Brown'.)

"Since I returned to England my publications have become the sole text-books used by the Government examiners"

(Ibidem)

4. "Many years have passed since the first edition of the Grammar was printed. In that period I have re-composed nearly every page; particularly attending to the remarks made by students."

(A grammar of the Telugu Language preface; Page V.)

5. "Some have urged me to simplify the grammar by rectifying irregularities. But innovations can only be made by poets; and even such as they make do not always become current. My province was merely to observe, record, arrange, and explain facts, and to produce quotations in proof of my statements".

(Ibidem. preface; page-V)

అతని వ్యాకరణముయొక్క ముఖపత్ర మిట్లున్నది:.

A Grammer 6
of the
Telugu Language

---

By
Charles Philip Brown
of The Madras Civil Service.

Madras :
Printed by R. W- Thorpe,
At The Vepery Mission Press,
of the Society for promoting
Christian Knowledge.

---

1840

ఆరోజులలో పండితులు, తెలుగు బాగుగా మాటలాడుట రాకపూర్వమే పాశ్చాత్యవిద్యార్థిని, ఆంధ్రభాషా భూషణము, అప్పకవీయము, నన్నయ భట్టీయము మొదలగునవి చదువవలె నని ప్రోత్సహించెడివారట! అమరముకూడ చదువలెననెడివారట! కాని, బ్రౌనుదొరమాత్రము ఎటులనో తప్పించుకొని, తెలుగు బాగుగా మాటలాడగలిగినంతవరకు వీటిజోలికి పోలేదట.7.

ఇన్ని శ్రమలుపడి పాశ్చాత్యులు తెలుగు నేర్చుకొనవలసివచ్చుటచేత, తెలుగు నేర్చుకొనుట యందు వారికి ఉత్సాహము సన్నగిలుట చూచి, బ్రౌనుదొర తన వ్యాకరణ రచనకు పూనుకొనెను. బ్రౌనుదొర తెలుగు వ్యాకరణము రచించి ప్రచురించుటకు ముందే, పాశ్చాత్యులు వ్రాసిన తెలుగు వ్యాకరణములు కొన్ని కలవు. అందు ముఖ్యమైనవి రెండు. అవి 8

" (1) A grammar of the Telugu language, by A. D- Campbell. C. S. 1816 & 1820.

(2) A grammar of the Gentoo language, by william Brown, C-S., Composed at Masulipatam, with the help of Mamidi Venkayya 1817." అనునవి.

కాంబెల్ దొర వ్రాసిన వ్యాకరణము, ప్రచురింపబడిన క్రొత్తలో కొంతపేరు పొందినను, బ్రౌను దొర వ్యాకరణము ప్రచురింపబడిన తిరువాత, దాని వ్యాప్తి తగ్గుచువచ్చెను. ఇందులకు ముఖ్య కారణము గ్రంథములకుగల తారతమ్యమే, దేశీయ పండితుల మెప్పును మనసులో పెట్టుకొని 'కాంబెల్' దొర వ్రాసియున్నట్లు బ్రౌనుదొర అభిప్రాయపడెను. తానుమాత్ర మట్లుగాక, వారు ముఖ్యమనుకొన్న వాటిని తన వ్యాకరణములో వెనుకకు నెట్టెను 9. ఇది ఉభయుల దృక్పథములలోగల భేదము.

కాంబెల్ దొర, తన వ్యాకరణములో గ్రాంథిక భాషకు, వ్యావహారిక భాషకు సమమైన ప్రాధాన్య మిచ్చి వ్రాసితినన్నను, అతని వ్యాకరణములో గ్రాంథికభాషకే ప్రాధాన్యము కొంత హెచ్చుగా నున్నట్లు కన్పట్టును. తన వ్యాకరణము కావ్యములను చదువువారికిని, కేవలము మాటాడువారికిని కూడ ఉప

---

6. ఇది మొదటి ముద్రణమునకు సంబంధించినది. రెండవ ముద్రణము 1857 లో జరిగినది. అప్పటి కప్పుడే బ్రౌనుదొర భారతదేశమును విడిచి (1855) ఇంగ్లండునకు వెడలిపోయెను.

7. "Telugu assistans counsel us to read...the Sanscrit vocabulary by Amara, the versified set of Telugu synonymes called Andhra - Bhasha - Bhushanam, or the treatises on grammar written by Nannaiia Bhatta and Appa Cavi. Happily for me I never read one of these books until I had already (about the age of twenty-seven) acquired a command of the spoken Telugu."

(Ibidem. Preface; Page—III)

8. ఈ రెండు వ్యాకరణములు, బ్రౌనుదొర వ్యాకరణముతోబాటు తనకు వ్యాకరణ రచనయందు ఉపయుక్తములైనవని 1873 లో A Progressive Grammar of the Telugu Language వ్రాసిన A. H. Arden, తన వ్యాకరణము Preface VII పేజీ యందు చెప్పెను. ఆతడింకను కొన్ని వ్యాకరణములను పేర్కొనెనుగాని, బ్రౌనుదొరకు ముందు వ్రాయబడిన వాటిని మాత్రమే నేను ఉదహరించితిని.

9. Native tutors urge us first to learn the very subjects which I have placed at the end of the work. The native method is followed by Mr. A. D. Campbell in his "Teloogoo grammar", an accurate, though very imperfect work, too intricate to aid the beginner."

(A grammar of the Telugu Langnage Preface; Page-IV)

యోగపడుటకై, తాను కృషిచేసినట్లు అతడు వ్రాసికొనెను. అతడు తన వ్యాకరణమును దేశీయ పండితుల సలహాల ననుసరించి వ్రాసెను. 10

కాంబెల్ దొరకు వ్యాకరణరచనయందు శ్రీ ఉదయగిరి వెంకటనారాయణయ్యగారు సాయము చేసినట్లు, వ్యాకరణ గ్రంథోపోద్ఘాతములోనే చెప్పుకొనెను. ఈతడు కాంబెల్ దొరకు తెలుగు మున్షీ. ఈతడు చాల తెలివితేటలుగల యువకుడనియు, తరువాత తన ప్రతిభవలననే ఫోర్టు సెయింట్ జార్జిలోని కాలేజీలో ప్రధానాంగ్లోపాధ్యాయు డైనట్లును, కాంబెల్ దొరయే వ్రాసెను 11. ఈతనిదె కాక; వ్యాకరణములో క్లిష్టమయిన ఘట్టములు వచ్చినప్పుడు; కాలేజీలోని ప్రధాన సంస్కృతాంధ్ర పండితుడైన శ్రీ పట్టాభిరామశాస్త్రిగారి సాయమును కూడ, కాంబెల్ దొర పొందెను 12

ఈ వ్యాకరణము బ్రౌనుదొరవ్యాకరణము వచ్చిన తరువాత మూలబడెను. ఇందువలన కాంబెల్ దొరకు ఈర్ష్యకలిగి మొట్టమొదట బ్రౌనుదొర వ్యాకరణమును నిరసించెనట! కాని, సహృదయుడైన బ్రౌనుదొర, చక్కగా బైండు చేయబడిన తన వ్యాకరణ గ్రంథము నొకదానిని, మర్యాద ఉట్టిపడు చున్న ఒక జాబుతో కలిపి, కాంబెల్ నకు పంపి అతని ఈర్ష్యను పోగొట్టెను. కాలక్రమమున బ్రౌనుదొర వ్యాకరణము వ్యాప్తినిపొంది, కాంబెల్ వ్యాకరణము వెనుకపడినది. 13

కాంబెల్ దొర వ్యాకరణమునకు ఇంచుమించుగ సమకాలికమైన ఇంకొక తెలుగు వ్యాకరణము, విలియమ్ బ్రౌన్ (*William Brown*) అను నాతడు వ్రాసినది. ఈతనికిని మన బ్రౌనుదొరకును ఏవిధమైన చుట్టరికమును ఉన్నట్లు లేదు. ఈతని వ్యాకరణము పేరు 'జెంటూ భాషా వ్యాకరణము'. ఇది 1817 లో అచ్చయినది. (*A Grammar of the Gentoo Language - 1817.*) అంతకు పూర్వము ఎనిమిది సంవత్సరములక్రిందటనే దీనివిషయమై ప్రకటన జరిగినను, కారణాంతరములచేత ఇది 1817 వరకు అచ్చు కాలేదట 14 కాని, ఈ ఆలస్యము గ్రంథ

10. "An attentive examination of the two may possibly lead to a very different conclusion : at all events, as this work is intended as much to enable the student to understand the rules which regulate the classical compositions of the Natives, as to teach him to speak or write the common Teloogoo, I have deemed it my duty to follow the native grammarians by tracing the language to its original source in the superior dialect—at the same time, I have not neglected its more useful branches in the inferior dialect, which as being vulgar, Native authors have considered beneath the notice of the learned".

(A grammar of the Teloogoo language By A. D. Campbell-Introduction page-XIV)

11. "In examining the principles inculcated by the best native grammarians, I was assisted by my Teloogoo instructor Woodiagherry Vencatanarrain Ayah, a young bramin of superior intelligence and remarkable acquirements, who, by his own merit alone, subsequently rose to the situation of Head English master at the college of Fort St. George......".

(Ibidem: page XXI).

12. ".....that on all intricate points of grammar I have invariably consulted the learned Pundit Patabhi Rama Sastry Head Sanscrit and Teloogoo master at the college......"

(Ibidem; page XXI).

13. "My Telugu grammar appeared in the end of 1840, and at once became popular. In my grammar I had given Mr. Campbell due praise, and wishing to appease his jealousy, I sent him a splendidly bound copy, with a respectfull letter: thereupon he countenanced my book, which soon superseded his own."

(From 'Some Account of the Literary life of C. P. Brown'.)

14. "It is true, that nearly eight years have gone by since it was first ushered in to that notice, which was expected to have made it long since familiar to the student. But, although fortuitous circumstances have intervened to prevent this desirable event, there is no reason to suppose that the offer of it at this day is either out of place, or unimportant to the object it holds in view."

(A grammar of the Gentoo Language - preface; page I.)

పునఃపరిశీలనమునకు సదవకాశము కల్పించినవని, విలియమ్ బ్రౌన్ వ్రాసెను. 15 'ఆంధ్రదీపిక' ను వ్రాసిన మామిడి వెంకయ్య ఈ వ్యాకరణరచనలో, విలియమ్ బ్రౌన్‌నకు సాయపడెనట 16 దీని రచన మచిలీపట్టణములో జరిగినది. ఇది అచ్చగుటకు కొన్ని నెలలముందు మామిడి వెంకయ్య చనిపోయెను. ఈతడే కాక, గుండుమల్లె పురుషోత్తము అను నాతడును సాయము చేసెనట. 17

ఈ విలియమ్ బ్రౌన్‌ను, మన బ్రౌనుదొర ఎరుంగును. అతడు వ్రాసిన వ్యాకరణమును, పద జాలమును కూడ బ్రౌనుదొర చూచెను. చూచుటయే గాక, అవి "నిరుపయోగములని" కూడ వ్రాసెను. బ్రౌనుదొరకు అతడు, తెలుగునకు సాహిత్యమే లేదని చెప్పెనట! అతడు తెలుగుభాషను 'జెంటూ' అని వ్యవహరించెడివాడట! అతని వ్యాకరణమునకును 'జెంటూభాషావ్యాకరణము'నియే పేరు పెట్టెను18, ఇక్కడ 'జెంటూ' (*Gentoo*) అను శబ్దమును, తెలుగునకు పర్యాయపదముగ వాడుటను గూర్చి, కొంత చర్చింపవలసియున్నది.

ఆ రోజులలో, తెలుగునకు, తెలుగువారికి, తెలుగుదేశమునకు 'జెంటూ, అని పాశ్చాత్యులు వాడుచుండిరనుటకు నిదర్శనము లనేకములు గలవు. విలియమ్ బ్రౌన్ మాత్రమే కాక, కాంబెల్ కూడ తన తెలుగు వ్యాకరణముయొక్క ముఖపత్రమున 'జెంటు' అను శబ్దమును తెలుగునకు పర్యాయపదముగ వాడెను.19

'జెంటు' అనుమాట 'జెంటియో' (*Gentio*) అను పోర్చుగీసు మాటయొక్క భ్రష్టరూపము. దీని అర్థము 'క్రైస్తవేతరుడు' అని. కాని, పోర్చుగీసువారు క్రైస్తవేతరులైన హిందువులకే ఈపదమును వాడెడివారు. క్రైస్తవేతరులైనముస్లిములకు 'మూరు' (*Moor*) శబ్దమును ఉపయోగించెడివారు. ఈ రెండు శబ్దములను (జెంటు, మూరు) పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధములోనే ఆంగ్లభాషలో వాడుకనుండి తగ్గిపోవుచు వచ్చినవి. కాని, 'జెంటు' అను పదము ఆంగ్లభాషలో; తెలుగు ప్రజలకు, తెలుగుభాషకు 'అడప తడప' పందొమ్మిదవ శతాబ్దియందు వాడబడుచునే యుండెను. 20

విలియమ్ బ్రౌన్‌నకు 'తెనుగు' అను మాట తెలిసియున్నను తన వ్యాకరణమునకు 'జెంటు'భాషా వ్యాకరణము అని పేరు పెట్టుటనుబట్టి చూడగా అతని కాపదమే నచ్చినట్లు తోచుచున్నది. అంతేకాక, 'జెంటు' అను పదమునకు బదులుగా 'తెనుగు' అను శబ్దమును వాడినవారి నతడు విమర్శించెను. 21

15 "...the incidents......which have retarded the publication of this work, for so many years as have elapsed since the first introduction of the manuscript to official inspection, have afforded a desirable leisure for considering and revising the whole......" (Ibidem; page—XVII).

16. "There lived till within these few months past, a Banian in the Town of Masulipatam, where the present work was originally constructed, whose name was Maamedy Venkiah......The assistance of this man in the compilation of both grammar and vocabulary, has been of the greatest advantage". (Ibidem; page - XIII)

17. "A Bramin by name Goondmulla Poorshottum, now no more, who was Government pleader of the Provincial Court at Masulilpatam, also afforded very able aid." (Ibidem; page - XIII

18. A Grammar of the Gentoo Language—William Brown—1817. ఈ వ్యాకరణము మదరాసు గవర్నరు అయిన 'హ్యూగ్ ఎలియట్' (Hugh Elliot) నకు 28-3-1817 నాడు అంకితమీయబడినది.

19. A Grammar of the Telugoo Language, commonly termed the Gentoo, peculiar to the Hindoos inhabiting the North Eastern Provinces of the Indian Peninsula — A. D. Campbell — 1816. ఇది 1816, 1820, 1849 సంవత్సరములలో ముద్రణములను పొందినది ఇది నాటి గవర్నరు జెనరల్ అయిన 'ఎరల్ మ్వారా' కు అంకితమీయబడినది. (Earl of Moira, K. G.)

20. "I mean to amuse myself with learning Gentoo, and have brought a Moonshee with me. Gentoo is the language of this part of the Country (Godavery delta), and one of the prettiest of all the dialects" Letters from Madras during the years 1836—1839. By a Lady—1843. ఈ వాక్యములు 1837 లో వ్రాసిన ఒక జాబులోనివి; (Page - 281; A Glossary of Anglo - Indian colloquial words and phrases)

21. "And this leads us to notice the pertinacity of some writers who fix upon

మొట్టమొదట పోర్చుగీసువారిచే 'జెంటియో' (*Gentio*) అను పదము, ఏ దేశమునకు చెందినవానికైనను, క్రైస్తవేతరుడు (*Heathen*) అయినచో ఉపయోగింపబడినది. 22 కాలక్రమమున, ఈ పదము హిందువులకు పర్యాయపదముగ పాశ్చాత్యులలో రూఢమైనది. 'జెంటైల్' అను పదముకూడ దీనికి సమానార్థకముగనే ఉపయోగించుచుండిరి. పోర్చుగీసువారి వ్రాతలలో ఈ పదము విశేషముగ కన్పట్టును. వారి తరువాత భారతదేశమునకు వర్తకమునకై వచ్చిన పాశ్చాత్యులందరు, హిందువులకు పర్యాయపదముగ, నాడు విదేశస్థులలో బహుళప్రచారములోనున్న ఈ పదమునే, ఉపయోగించుచువచ్చి దీనిని రూఢము చేసిరి. ఈ పదము పదునారవ శతాబ్దియొక్క ఉత్తరార్ధమునుండి ఉపయోగింపబడుచుండినట్లు, విదేశయాత్రికుల వ్రాతలనుండి ఉదాహరణలు చాల కలవు. పోర్చుగీసు యాత్రికులలో ముఖ్యులైనవారందరు, హిందువులను వర్ణించి చెప్పునప్పుడు ఈ పదమునే వాడిరి. సిమో బొటెల్హో (*Simao Botelho*)23 గార్షియా (*Garcia*)24 కాస్టనీడ (*Castaneda*)25 మొదలగువారి గ్రంథములలో ఈ పదము విశేషముగ కన్పట్టుచున్నది.

17, 18 శతాబ్దులలో 'జెంటు' (*Gentoo*) అను పదము ఇంగ్లీషు భాషలో విశేషప్రచారమునకు వచ్చినది. జెంటైల్ (*Gentile*) జెంటియో (*Gentio*) అను పదములకు, 'జెంటు' అని ఇంగ్లీషులో రూపమేర్పడినది. తక్కిన పాశ్చాత్యులవలెనే ఇంగ్లీషువారును మొట్టమొదట ఈ పదమును, హిందువులకు పర్యాయపదముగ వాడుచువచ్చిరి. 26 కాని, క్రమముగ ఇది తెలుగువారికిని తెలుగుభాషకును పర్యాయపదముగ వాడుకలోనికి వచ్చినది 27

ఈ విధముగా జెంటు అనుపదము రెండు విధములైన అర్థములలో వాడుకలో నుండెను. 'హిందువు' అను అర్థమున ఈ పదమునకు ప్రయోగము కాలక్రమమున తగ్గిపోయినను; తెలుగువారు, తెలుగుభాష, అను అర్థమున ప్రయోగము మాత్రము పందొమ్మిదవ శతాబ్దిలోకూడ ఇంగ్లీషు భాషలో నుండెను. ఈ శబ్దము, ఎందులకు ఈ విధముగా తెలుగువారి విషయమున రూఢికెక్కినది, అనునది విమర్శించి నిర్ణయింపవలసి యున్నది

పోర్చుగీసువారు భారతదేశమునకు వచ్చినప్పుడు విజయనగర సామ్రాజ్యము ఉచ్ఛస్థితిలో నుండెను. ఇంచుమించుగ దక్షిణదేశమంతయు వారి యేలుబడియందుండెను. ఇది తెలుగు సామ్రాజ్యము గనుక ఉన్నతోద్యోగులందరు తెలుగువారే. వీరందరు హిందువులు. కనుక, హిందువులకు సామాన్యముగా

---

the word Tenoogoo, or Telinga as a more appropriate term than Gentoo. The word Gentoo is condemmed as beneath the notice of the learned......" (A Grammar of the Gentoo Language; preface· page—XVII.)

22. "A very famous Corsair who was called Hinimilau, a Chinese by nation, and who from a Gentio as he was, had a little time since turned Moor......" (The voyages and adventures of Fernand Mender Pinto; A Portugal; done into English by H. C. Gent, London. 1653 Folio. As quoted by Yule and Burnell.) దీని మాతృక, 1614 లో పోర్చుగీసు భాషలో, లిస్బన్ నగరమున ప్రచురింపబడెను.

(A Glossary of Anglo - Indian Colloquial words & phrases page—280.)

23. "...for there are some of them who often try to make christains by force, and worry the Gentoos (Jentios) to such a degree that it drives the population away" —Simao Botelho-1548, (Page-280-Ibidem).

24. "...This ambergris is not so highly valued among the Moors, but it is very highly prized among the Gentiles"—Garcia 1563; (Page-280 Ibidem).

25. "A Gentile·····...whose name was Canaca".

(Ibidem·page 210.)—Castaneda-1582.

26. 1776 లో లండనులో అచ్చయిన ఒక పుస్తకము యొక్క పేరు. "A code of Gentoo Laws or Ordinations of the Pundits. From a Persian Translation, made from the original written in the Shanskrit Language. London, Printed in the year 1776."

(Ibidem - page - 281·) By Nathaniel Brassey Halhed.

27. "The Heathens who inhabit the Kingdom of Golconda...are called Jentives"

Jehan Van Twist—1648; (page - 281 Ididem.)

"Their Language they call generally Gentu...the peculiar name of their speech is Telinga"—John Fryer, M. D. (A New Account of East India and persia, in letters from 1672—1681. London 1698.)

(Ibidem—page-281.)

వాడబడుచుండిన 'జెంటు' లేక 'జెంటైల్' లేక 'జెంటియో' శబ్దము తెలుగువారికి పర్యాయపదముగ వాడబడి రూఢమైనది.28

ఆ రోజులలో ఎక్కువ విమర్శ లేకుండ, పాశ్చాత్యులచే వాడబడుచుండిన ఇంకొక పదము 'మలబార్' అనునది. ఈ శబ్దమును, ఎప్పుడో ఒకప్పుడు, వివిధభాషలు మాటలాడు పాశ్చాత్యులందరును, తప్పుగనే ప్రయోగించిరనుట సత్యదూరము కాదు. దక్షిణదేశభాషల కన్నింటికి ఈ శబ్దము ఎప్పుడో ఒకప్పుడు వాడబడియేయుండెను. ముఖ్యముగా, తమిళమును 'మలబార్' అని వ్యవహరించుట ప్రసిద్ధముగా నుండెను. 29 మొట్టమొదట ఈ రెండుభాషలకును గల భేదమును పాశ్చాత్యులు— ముఖ్యముగా పోర్చుగీసువారు — గుర్తింపలేకున్నను, కాలక్రమమున ఈ భేదము గుర్తింపబడినను, తమిళమును 'మలబార్' అను పేరుతో వ్యవహరించుట లేకపోలేదు. ఈ పొరపాటు వచ్చుటకు కారణము; పడమటి కోస్తా భాషకును కోరమండల్ కోస్తా భాషకును పోలిక లుండుటయే. పోర్చుగీసువారు ఈ పోలికలనే గ్రహింపగలిగిరి కాని, ఆ భాషల భేదమును గుర్తింపలేకపోయిరి. 30

'మలబార్' అను పదమును క్వాచిత్కముగ తెలుగునకుకూడ వాడుట కలదు. 31 కాని ఇది అపవాదముగానే గ్రహింపవలెను. మద్రాసులోని తెలుగులో తమిళభాషా పదములు విశేషముగ నుండుటచే కాబోలు, దానిని 'దక్షిణజెంటు' లేక 'తెలింగతముళ' అని 'విలియమ్ బ్రౌన్' ప్రయోగించి, దానిని నిరసించి, తెలుగు నేర్చుకొనువారు పరిహరింపవలెనని వ్రాసెను. ఇంతేకాక దీనిని, నాడు భారతదేశములో వాడుకలోనున్న భ్రష్టమైన పోర్చుగీసుతో పోల్చినాడు.32 ఈతని దృష్టిలో; కృష్ణానదికి ఉత్తరమున గాని మంచి 'జెంటు' మాటలాడుట లేదనియు, కృష్ణానదికి దక్షిణమునందంతట 'మలబార్' పదజాలము కలిసిన భాషయేయనియు, కన్పట్టుచున్నది. 'జెంటు'

28. "For the terms Gentio and Gentoo were applied in two senses:

(a) To the Hindus generally,

(b) To the Telugu-speaking Hindus of the Peninsula specially, and to their language."

"The reason why the term became thus specifically applied to the Telugu people is probably because, when the Portuguese arrived, the Telugu Monarchy of Vijayanagara dominated over great part of the Peninsula. The officials were chiefly of Telugu race, and thus the people of this race, as the most important section of Hindus, were par excellence the Gentiles, and their language the Gentile language"—(A glossary of Anglo - Indian Colloqiual words and Phrases—H. Yule and A. C. Burnell—London 1886; page - 280).

29. "Two distinct languages are necessarily required; one is the Damulian, commonly called Malabarick (Propagation of the Gospel in the East, Part III; page-33; 3rd Edition. 1718. As quoted in A glossary of Anglo-Indian Colloquial words and phrases By H. Yule and A. C. Burnell London, 1886. page-413).

30. "The Portuguese......sailing from Malabar on voyages of exploration...made their acquaintance with various places on the Eastern or Coromandel coast......and finding the language spoken by the fishing and sea-faring classes on the Eastern coast similar to that spoken on the Western, they came to the conclusion that it was identical with it, and called it in consequence by the same name viz. Malabar......"

(A Comparative Grammar of the Dravidian Languages By Bishop Caldwell, 2nd. Edition; Pages 10-12; 1875.)

31. "The language spoken at Madras is the Talinga, here called Malabars." (Journal of a Residence in India By Maria Graham; 1812, Edinburgh - page - 128. As quoted in A glossary of Anglo - Indian Colloquial words and phrases; page-413)

32. "The Language these people now speak is a perfect jargon; which in Europe, the people of Portugal would scarcely comprehend.........In the same manner, or somewhat similar. may the Gentoo spoken at Madras and in the South of the Peninsula be considered; and it would be perfectly justifiable to designate it by the appellation of Southern Gentoo; or the Telinga Tamula of Madras."

(A grammar of the Gentoo language - By William Brown; 1817. preface-page-IX)

నేర్చుకొనునప్పుడు 'మున్షీ'ని ఏ ప్రాంతమునుండి తీసికొనవలయుననునది చెప్పుచు ఈ వాక్యములు వ్రాసెను.33

కాని, విలియమ్ బ్రౌనునకు సమకాలికుడగు కాంబెల్, తన తెలుగు వ్యాకరణముయొక్క ముఖపత్రమున 'జెంటు' శబ్దమును వాడినను, తెలుగు నిట్లు పిలుచుట పాశ్చాత్యులకు తగదనియే పీఠికలో వ్రాసెను.34. బ్రౌనుదొర తరువాత, 1873లో తెలుగు వ్యాకరణమును రచించిన ఎ. హెచ్. ఆర్డెన్ కూడ ఇటులనే వ్రాసెను.35 బ్రౌనుదొర తన తెలుగు వ్యాకరణములో దీనికి ప్రాముఖ్యమే ఈయలేదు. 'జెంటు' అను పదమును, తెలుగునకు పర్యాయపదముగ వాడుటను అపహసించి, పోర్చుగీసువారు ప్రవేశపెట్టిన ఈపేరు పరిహరించుట ఉత్తమమని వ్రాసెను.36 ఈ వాక్యమును వ్రాయునప్పుడు బ్రౌనుదొర మనస్సులో ఈ ఇరువురును (కాంబెల్, విలియమ్ బ్రౌన్) కలరేమో!

ఈ రెండు వ్యాకరణములేగాక, బ్రౌనుదొర వ్యాకరణమునకు ముందు, మరి రెండు వ్యాకరణములున్నటుల; కాంబెల్, విలియమ్ బ్రౌనుల వాక్యములు తెలుపుచున్నవి. ఈ రెండు వ్యాకరణములలో, వీరిరువురును పేర్కొని విమర్శించినది 'డాక్టరు కరే యొక్క వ్యాకరణము' డాక్టరు విలియమ్ కరే, *Dr. William Carey, D. D. 1761 - 1834*) వంగదేశమునకు 1794 లో వచ్చెను. క్రైస్తవమతవ్యాప్తికై కృషిచేసినవారిలో ప్రముఖుడు. ఈతడు అనేకములైన భారతీయ భాషలకు వ్యాకరణములను నిర్మించెను.37 ఈతడు ఆ కాలములో ప్రాచ్యభాషాకోవిదునిగ పేరుపొందెను. ఈతని సంస్కృత వ్యాకరణము ప్రసిద్ధికెక్కినది. ఈతడు 1814 లో 'తెలింగ వ్యాకరణము' ను (*Telinga Grammar*) ప్రకటించెను. ఈతడు తెలుగు సంస్కృతభాషాజన్యమన్నట్లు వ్రాయగా, కాంబెల్లును 38 విలియమ్ బ్రౌనును ఆతనిని విమర్శించిరి 39

33. "......let him be assisted in his studies by a Tutor from the Northern side of the Kistnah so that the barbarous incrustations of a Malabar diction may be avoided...Ibidem - page - VIII).

34. "The language of which a Grammar is now offered to the public is commonly, but improperly, termed by Europeans the Gentoo".

(A grammer of the Teloogoo Language by A. D. Campbell. 1816. Introduction; page - I)

35. "The language now under consideration is called Telugu or Tenugu. The Sanscrit name is Andhra. It has also sometimes, though improperly, been called by Europeans Gentoo".

(A progressive grammar of the Telugu Language By A. H. Arden 1873. Chapter I; page - 1.)

36. "It is high time to abolish the absurd name Gentoo which was introduced by the Portuguese, and is ignorantly used by some persons for the name Telugu.

(A Grammer of the Telugu Language by C. P. Brown; 2nd Edition. 1157. Book First; page - 13.)

37. మహారాష్ట్రి (1805); సంస్కృతము (1806); పంజాబి (1812); తెలుగు (1814).

38. "It has been very generally asserted, and indeed believed, that the Teloogoo has its origin in the language of the Vedams, and many of the most eminent Oriental scholars have given their authority in support of this opinion ......on this, and on several other material points eonected with the structure of the Teloogoo, I regret that my sentiments should be entirely at variance with those of so celebrated an Orientalist as Dr. Carey, one of the learned professors in the college of Fort William, to whom the public are indebted for a very copious Grammar of the Sanscrit language, and for a series of works on the elements of the spoken dialects of India."

(A Grammar of the Teloogoo Language By A. D. Campbell. 1816, 1820, 1849. Introduction. page - XV)

39. "And this leads to the mention of a Grammar of the gentoo Language more recently published in Bengal, by an English Missionary of considerable repute in the Philological world, whose name has already been quoted as the framer of a Shanscrit Grammer (Dr. William Carey, D. D.)...,when the compiler of that small tract on another occasion asserts, that the Shanscrit "is the immediate parent of the

ఈ వ్యాకరణమునే గాక, విలియమ్ బ్రౌన్ ఇంకొక వ్యాకరణమును గూడ తన 'జెంటు భాషా వ్యాకరణము' నందు పేర్కొనెను. అది ఒక ఫ్రెంచి దేశస్థుడు వ్రాసినది. దానిని విశేషప్రయత్నము మీద, గుంటూరులో నున్న ఒక మిషనరీద్వారా విలియమ్ బ్రౌన్ తెప్పించి చూచెనట! అది అతనికి నచ్చలేదు. దానియందు; అనావశ్యకములగు విషయములు చాలగలవనియు, విషయవిభాగమునందును, విషయమునందును, రచనాపద్ధతియందును, దోషములు చాలగలవనియు; తన వ్యాకరణమును తొందరగా ప్రకటించి, 'జెంటు' భాషావిషయమై, ఆ ఫ్రెంచిదేశస్థుని వ్యాకరణములో గల దోషములను, తొలగింపవలెనను కోరికను అధికము చేయుటకు మాత్రమే, ఆ వ్యాకరణమును చూచుట ఉపయోగపడెననియు, విలియమ్ బ్రౌన్ వ్రాసెను. ఈ వ్యాకరణ మంత ప్రచారమునకు వచ్చినట్లు లేదు.

తన వ్యాకరణమునకు (1840) ముందే ప్రచురింపబడిన ఈ వ్యాకరణముల నన్నింటిని బ్రౌనుదొర చూచినాడని చెప్పవచ్చును. కాంబెల్, విలియమ్ బ్రౌనుల వ్యాకరణములు చూచినాడనుటకు ప్రత్యక్ష నిదర్శనములను పరిశీలించితిమిగదా! కాని, వీటియందు అతనికి అంత ఆదరము గాని, గౌరవభావము గాని ఉన్నట్లు లేదు. ఇవన్నియు రచయితల భాషాభేషజమును చూపుటకు పనికివచ్చునవి గాని, విద్యార్థులు తెలుగు నేర్చుకొనుటకు ఎక్కువగా సాయపడునవి కావని; బ్రౌనుదొర అభిప్రాయపడినా డనవచ్చును. 'కాంబెల్ వ్యాకరణము'పై బ్రౌనుదొర వెలిబుచ్చిన అభిప్రాయమే, పై ఊహకు ఆధారముగా గ్రహింపవచ్చును.

హిందూవైయాకరణులు వ్యావహారికభాష నుపేక్షింతురనియు, ఈవిషయమున చైనాదేశపు పండితులు వీరికి పోలిక వత్తురనియు అతడు వ్రాసెను.41 వ్యావహారిక భాషకుగల ప్రాముఖ్యమును గూర్చి చెప్పుటయందు బ్రౌనుదొరకు విసుగు లేదు.

సంస్కృతమునకు తెలుగునకుగల సంబంధమును గూర్చి బ్రౌనుదొర చక్కగా చెప్పెను. మొట్టమొదటి ఆంగ్లవ్యాకరణములు, లాటిన్ పద్ధతిపై రచింపబడినట్లే, తెలుగు వ్యాకరణములు కూడ సంస్కృత వ్యాకరణపద్ధతులపై రచింపబడినవనియు, దేశీయవిద్వాంసులు 'సంస్కృతము తెలుగునకు తల్లి' అన్నప్పుడు, దీనిని జన్యజనక సంబంధముగ గ్రహింపక, సంస్కృతపదజాలముపై తెలుగు ఎంత ఆధారపడియున్నదో తెలియజేయు భావముగా గ్రహింపవలెననియు, సంస్కృతపదము లుపయోగించకుండ తెలుగు మనము మాటాడలేకపోవుట ఇందుకు నిదర్శనమనియును వ్రాసెను.42

---

Mahratta, the Orissa, the Telenga, the Carnatic, the Gujurat, and the Malabar and Tamul Languages; and that the knowledge of the Shanscrit places all those in our power, as it will generally furnish four words out of five of them all;" We cannot help smiling at the gross mistakes exhibited in a grammar of the Gentoo, compiled as it has been by one who is so professedly competent in the Shanscrit Language."

(A Grammar of the Gentoo Language By william Brown - 1817. preface; page XII—XIII.)

40 "A reference in the first instance was made to a Gentoo Grammar, published a series of years ago by a Frenchman, of which an imperfect copy was procured from a Missionary then residing at Guntoor—But, though ample in the materials it was found to be superfluously minute and perplexing in the detail; and so extremely incorrect in doctrine as well as matter, that little other use was derived from it, except that of prompting the formation of the present Grammar with the greater alacrity; if for no other reason than that of rescuing the proper Gentoo from the perversion and mis-contructions, with which this French production so amply teemed." (Ibedem. page—XII).

41. "Hindu Grammarians, like those of China, neglect the colloquial dialect, which they suppose is already known to the student, and teach only the poetical peculiarities. They are willing to aid our studies, either in Telugu poetry or in Sanscrit: they are reluctant to teach us the language of common business."

(A Grammar of the Telugu Language By C. P. Brown. 2nd Edition 1857. preface page—II).

42. "Our earliest English grammars were arranged on the Latin system; and the oldest grammatical treatises on Telugu were constructed on the Sanscrit plan, though the two languages are radically

బ్రౌనుదొర తన తెలుగు వ్యాకరణములో, విద్యార్థిని భ్రమింపజేయు పాండిత్యప్రకర్షకై, పాటుపడలేదు. సంప్రదాయసిద్ధములుగదా యని కఠినమైన, నిరుపయోగమైన మార్గములను అనుసరింపలేదు. అటులని వ్యాకరణమును పేలవముగ చేయలేదు. అంతకు పూర్వము సర్వత్ర వ్యాపించియున్న 'భాషాభేషజము'ను మాత్రము తొలగించెను.43

ఇంక, అతని వ్యాకరణ రచనాపద్ధతిని కొంత పరిశీలింపవలసి యున్నది. ఈ వ్యాకరణము పండ్రెండు భాగములుగ విభజింపబడినది. ఇందులో మొదటి పదిభాగములలో వ్యాకరణభాగమంతయు పూర్తియగును. పదునొకండవ భాగము ఛందస్సునకు సంబంధించినది. పండ్రెండవ భాగము 'ద్రుత ప్రకృతికములు, కళలు' మొదలగువానికి సంబంధించినది. ఈ భాగములకు వెనుక అనుబంధముగ 'లెక్కలకు సంబంధించిన మానములు' మొదలగునవి ఈయబడినవి 'ద్రుత ప్రకృతికములు, కళలు' మొదలగునవి గ్రంథముయొక్క చివరిభాగమందుంచుటకు ముఖ్యకారణముగా ఈ క్రింది వాక్యములను—పాశ్చాత్యులకు పాఠము చెప్ప 'తెలుగు మున్షీ'ల ఉపయోగార్థము—బ్రౌనుదొర తన వ్యాకరణములో వ్రాసెను. ఉపాధ్యాయులు, ప్రారంభకులైన విద్యార్థులకు అనావశ్యకములగు విషయములను, వర్ణసమామ్నాయము తరువాతనే మొదలుపెట్టిన, వారిచే ఈ క్రింది వాక్యములను, విద్యార్థులు చదివింపవలెననియు, వ్రాసెను.44

"ఇంగిలీషువారు ఆంధ్రము చదువ నారంభించేటప్పుడు కేవలం సంస్కారదూరులైవున్నారు గనుక శబ్దపరిచ్ఛేదం, క్రియాపరిచ్ఛేదం, మాత్రము తొలుత నేర్చుకోవలశినదే గాని కళ—ద్రుతం—సంధి—సరళాదేశం—తద్భవం—తత్సమం—దేశ్యం—యిత్యాది ప్రమేయములను గురించి ప్రస్తుతం తలపెట్టపనేలేదు—యీ హేతువల్లనే యీ ప్రమేయములు యీ వ్యాకరణములో ఆదిభాగములో వ్రాయక అంత్యభాగములో వ్రాయడమైనది. పైగా ఆరంభములో పద్యాలు చదవడము అన్నివిధాలా నిష్ఫలము గనక తొలుత ఆర్జీలు—జాబులు—వాఙ్మూలములు—గాక మరి యేదిన్ని చదవ నగత్యము లేదు."

ఈ వ్యాకరణమును సూక్ష్మముగ పరిశీలించినచో, బ్రౌనుదొరయొక్క పాండిత్యవైశిష్ట్యము గోచరమగును. ఏది ఎక్కడ ఎంత చెప్పవలెనో బ్రౌనుదొరకు తెలిసినట్లు చాల తక్కువమంది పండితులకు తెలియును. అనుగుణమున, ఆంధ్రసంప్రదాయములు తెలియని పాశ్చాత్యులకు అతడిచ్చు సలహాలు, ఆంధ్ర సంప్రదాయముల విషయమున నాతనికి గల విజ్ఞానమునకు, సానుభూతికి తార్కాణములు. 'ఎంగిలి మాటలు' అను ప్రయోగమును గూర్చి 'విశేషణ పరిచ్ఛేదము'నందు చెప్పుచు, 'ఫుట్‌నోట్' (*Foot-note*)లో, "హిందువులు ఎంగిలిని అసహ్యించుకొందురు గనుక పెన్సిల్ గాని, పెన్ గాని నోటికి తగులనీయరా"దని వ్రాసిన బ్రౌనుదొరయొక్క ఔదార్యమును ఏమని కొనియాడగలము!45 వ్రాయునది వ్యాకరణగ్రంథమైనను, అవకాశము దొరికినప్పుడెల్ల, హిందువుల సంప్రదాయములను గూర్చి చెప్పుచు, పాశ్చాత్యులకు, హిందువుల విషయమున ఎట్లు మర్యాదగా వ్యవహరింపవలెనో నేర్పుచువచ్చెను.

బ్రౌనుదొర అనేక పాశ్చాత్యభాషలలో పండితుడు గనుక, వీలున్నప్పుడెల తెలుగుభాషను, తెలుగుపలుకుబడిని ఆయా భాషలతో పోల్చి వ్రాయుచువచ్చెను ముఖ్యముగా తెలుగును 'ఇటాలియన్' భాషతో చాలసార్లు పోల్చెను. ఈ పోలిక కేవలము భాషయొక్క మాధుర్యమువిషయముననే

---

different. The native grammarians of the present day are fond of the expression that "Sanscrit is the mother"; but this does not allude to its origin; it merely denotes dependance, because we cannot speak Telugu without using Sanscrit words." (Ibidem; page—VI).

43. "Hitherto every path was over grown with gay weeds of pedantry which I have cleared away". (Ibidem; page—VI).

44. "The ordinary teachers are apt to speak to student on some learned subjects which are ill suited to beginners. The tutor should on such occasions be desired to read the following caution".

(Ibidem.' Book First; page—32).

ఈ ఇంగ్లీషు వాక్యముల క్రింద పైని ఉదాహరింపబడిన తెలుగు వాక్యములు గలవు.

45. "The Hindus look upon spittle with disgust and are mnch gratified if we so far respect their feelings as to avoid touching our mouths in their presence with either the hand, a pen or pencil."

(Ibidem; page—182.)

గాక, షష్ఠముల కూర్పు విషయమునను కలదని నిరూపించెను. 46

క్రియయొక్క పురుషలను గూర్చి చెప్పుచు; సాధారణముగా ఇంగ్లీషువారు చెప్పెడి—ఫస్ట్ పర్సన్ అనగా ప్రథమ పురుష, అని అనుకొను దోషమునుగూర్చి వ్రాసెను. 47 ఈ దోషము, ఇంగ్లీషు చదువుకొన్న మనవారిలోకూడ తరుచుగ కన్పట్టుచుండునుగదా! ఇది స్వల్పవిషయముని వ్రాయుట మానలేదు.

ఈ వ్యాకరణములో 'నామవాచకము'లనుగూర్చి చెప్పు భాగమును చదువుట, 'నవల' లోని భాగమును చదువుటవలె నుండును. మన ఇంటిపేరులు, మొదలగువాటినిగూర్చిన విషయ మెంతయో గలదు అన్నింటికంటె ముఖ్యమైనది—పాశ్చాత్య నామములకును, భారతీయనామములకును గల పోలికలు, తేడాలు మొదలగువాటిని చర్చించు భాగము. మనలో క్షత్రియస్త్రీలు మొదలగువారు, 'అమ్మ' అని పేరున నుంచుకొనుటకు బదులుగా 'అయ్య' అని, పేరుచివర ఉంచుకొనుట తెలిసినవిషయమేగదా! దీనినిగురించి వ్రాయుచు బ్రౌనుదొర స్కాట్లండు దేశములో గొప్పయింటి స్త్రీలకు 'సర్' (*Sir*) అని వాడుట కలదని ఉదాహరణ మూపెను. 48

ఈ వ్యాకరణములో పదునొకండవ భాగము ఛందస్సునుగూర్చి చెప్పునదని ముందు వ్రాసితిని. ఈ భాగముకూడ, బ్రౌనుదొరయొక్క పాండిత్యమునకు నికషోపలము. ఇందు తెలుగు ఛందస్సునకు కావలసిన సమస్తవిషయములు ఆంగ్లభాషలో ఉదాహరణములతోకూడ ఈయబడినవి. అటులని మారు మూలసూత్రములుకూడ ఇందున్నవని తలంపరాదు. అట్లిమ్పట బ్రౌనుదొరయొక్క సిద్ధాంతమునకే భిన్నముగదా! మొట్టమొదట ఛందశ్శాస్త్రము నేర్చుకొనుటకు బ్రౌనుదొర సుముఖుడు కాడట! కాని, దానివలన ఇతరులకు అర్థమగునట్లు సరియైన తావులలో ఆపి చదువగలుగుట వచ్చునని విని, దానిని నేర్చుకొనెనట. 49

పద్యములు చదువుటయందు కూడ తెలుగువారికిని, ఇటలీదేశస్థులకును పోలిక కలదట! బిగ్గరగా, నొక్కి చదువుటయందు ఈ యిరువురకు పోలిక కలదట! 50 ఇన్ని పోలికలుండుటచేతనే గాబోలు తెలుగునకు తూర్పుదేశములలోని ఇటలీభాష లేక 'భారతదేశములోని ఇటలీభాష'51 అని పేరువచ్చినది.

ఈ భాగములో లాటిన్, గ్రీక్ భాషల ఛందస్సులతో, తెలుగు ఛందస్సులను పోల్చి చూపుచు తన పాండిత్యమును ప్రదర్శించినాడు. లాటిన్, గ్రీక్ భాషలతో సంబంధముగల ఏ పాశ్చాత్యుడైనను, దీనివలన తెలుగు ఛందస్సును సులభముగ నేర్చుకొనగలడు. మనకు దీనివలన పాశ్చాత్య ఛందస్సుల

---

46. "The Telugus are a people quite as highly civilized as any in Europe: occasionally their modes of speech resemble those of Italy. Thus instead of 'Sir you told me to do so' the phrase is ఇది చేయుమని దొరగారు శెలవు యిచ్చినారు."

(Ibidem; page—165.)

నల్లవారిని పరిపాలించుటకు వచ్చిన తెల్లవాని మాటలా? ఇవి. కావు. ఒక సహృదయుని అభిప్రాయము! జనన్నాంతర సహృదయూ!

47. "When we converse with a native who knows Sanscrit but not English we must remember that I, we, are called ఉత్తమపురుష; Thou, you, are called మధ్యమ పురుష; and He, she, it, they, are called ప్రథమ పురుష the first person."

(Ibidem - page—83.)

48. "But Telugu ladies of rank use the masculine affix; and sign their names as సీతయ్య or రంగయ్య; instead of సీతమ్మ or రంగమ్మ."

"Thus Mariamur pro rege nostro Maria Theresa. The Highland Scotch use the word Sir respectfully to ladies."

(Ibidem. page—212.)

49. "I acknowledge that I was reluctant to study the art, and was persuaded to do so only because I was shewn its utility in understanding the proper stops; and in reading so as to be intelligible to others." (Ibidem. page—293.)

50. "It is the Custom to read verse in a loud tone with strong intonation: and regardless of the subject: for everything is read alike. This is also the custom in Italy." (Ibidem. page—295.)

51. "Telugu has been called the Italian of India". (Ibidem. preface; page-V.)

తత్త్వము కొంత బోధపడును. ఈవిధముగా నిది 'ఏక క్రియాద్వ్యర్థికరీ.'

నిసర్గ గణములను జ్ఞాపకముంచుకొనుటకై, అతడు ప్రతిగణమునకు ఎదుట ఒక సంస్కృతశబ్దమును, ఒక లాటిన్‌పదమును ఉంచి ఒక పట్టిక సిద్ధము చేసెను. ఆ పట్టికను—కుతూహలమువలన—యథాతథముగ నిచ్చుచున్నాను.52

టికి లక్ష్యలక్షణములను చూపెను. సామాన్యముగా, తెలుగులో లక్ష్యలక్షణము లిచ్చుటతో తృప్తిపడక, పాశ్చాత్య భాషలలో వీటికి పోలికలుగల ఛందము లున్నచో వాటిని కూడ చూపెను. బ్రౌనుదొర యొక్క రచనలోని వైశిష్ట్యమిదియే.

ఇంత శ్రమపడి తన వ్యాకరణమును పాండిత్య స్ఫోరకముగ బ్రౌనుదొర రచించెను ఈ వ్యాకర

| Sanscrit Name and Marks | Memorial words | | Latin Marks and Name |
|---|---|---|---|
| M ◡ ◡ ◡ | మంత్రాణాం | Moecenas | — — Molossus. |
| Y \| ◡ ◡ | యతిస్తే | Ymetto | ◡ — — Bacchic, |
| R ◡ \| ◡ | రక్షయా | Reddidi | ◡ — Cretic. |
| S \| \| ◡ | స్వరసాం | Similes | ◡ ◡ — Anapoest. |
| T ◡ ◡ \| | తింపశ్యే | Tentare | ◡ Antibacchic. |
| J \| ◡ \| | జజాప | Juvabit | ◡ ◡ Amphibrach |
| B ◡ \| \| | భక్తప | Bucula | ◡ ◡ Dactyl. |
| N \| \| \| | నమహి | Nivea | ◡ ◡ ◡ Tribrach. |

ఇందు గణములోని మొదటి అక్షరము వచ్చునట్లును, గణలక్షణము సరిపోవునట్లుగను; సంస్కృతము లాటిన్ భాషలలో నుండి మాటలు లక్ష్యములుగ కూర్పబడినవి.

ఉత్పలమాల, చంపకమాల, శార్దూలవిక్రీడితము, మత్తేభవిక్రీడితములకు లక్షణములను లక్ష్యములను చూపెను. కందపద్యమునకు లక్ష్యలక్షణ సమన్వయము చేసి చూపి, అది సంస్కృతములోని 'ఆర్యా' భేదములలో నొకటి53 యనియు, మధురమైనదనియు వ్రాసి, 'ఆర్యా'కు లక్ష్యముగా, 'ఆంధ్రశబ్ద చింతామణి'లోని, "స్వస్థాన వేషభాషాభిమతా స్సంతో రసప్రలుబ్ధధియః" అను శ్లోకమును ఇచ్చెను. ఇంతేకాక, హోరేస్ (*Horace*) అను పాశ్చాత్య కవి రచించిన మధురకావ్యములలో, 'ఆర్యా'యొక్క భేదములలో నొకటి ఉపయోగింపబడినదని లక్ష్యమును చూపెను.54

యతిప్రాసలనుగురించి వ్రాయుచు ఇట్టివి ప్రాచీనాంగ్లకవుల రచనలో కలవనియు, గోథిక్ (*Gothic*) భాషలలో కనబడుననియు వ్రాసెను. ఇంగ్లీషుకవులు, రచనలకు శబ్దసౌందర్యము వచ్చుటకై ఇవి అచ్చటచ్చట వాడుట కలదనియు వ్రాసి, ఉదాహరణ లిచ్చెను.55 తెలుగు 'యతి' వంటిది, స్పెయిను భాషలో కలదనికూడ వ్రాసెను.

లయగ్రాహి, లయవిభాతి, రగడ, దండకము, తరువోజ, ఉత్సాహ, అక్కర మొదలగువాని కన్నిం

ణము వచ్చినవెంటనే 'కాంబెల్' మొదలగువారి వ్యాకరణములు వెనుకబడినవనుటలో ఆశ్చర్యమేమియు

52. "To facilitate recollection, I have in the following table placed opposite each Ganam a Sanscrit and a Latin word containing the requisite syllables and beginning with the letter that denotes the foot." (Ibidem. page—296.)

53. "The Canda verse is a veriety of the Sanscrit Arya a very melodious metre constantly used in poems and plays; it is the metre. employed by Nannaya Bhatta in his Chintamani......".

(Ibiddem. page—304).

54. "It will be perceived that the Arya in one of its varieties is the harmonious rhythm used by Horace".

Ibidem. page—305).

55. "Such rhymes were used in Saxon and our oldest English poet Spenser says:" (FQ 1. XII. 23.)

The blazing brightness of her beauty's beam".

లేదు. ఈ వ్యాకరణముయొక్క మొదటి ముద్రణము 1840 లో జరిగినదని తెలిసికొంటిమి. దీని రెండవ ముద్రణము బ్రౌనుదొర భారతదేశమును విడిచి (1855) పోయిన తరువాత జరిగినది. 1857 లో అచ్చయిన దీనికి 'పీఠిక' వ్రాయుచు, ఈ ముద్రణము జరుగుచుండగనే, తాను అనారోగ్యమువలన భారతదేశమును వదలిపోవలసివచ్చెననియు, అందువలన వ్యాకరణముయొక్క చివరిభాగములో కొన్ని పొరపాట్లుండవచ్చుననియు, కాని అవి విద్యార్థియొక్క 'చదువు'నకు అంతరాయము కలిగించునవి కావనియు వ్రాసెను.56

తన వ్యాకరణముతరువాత, ముఖ్యముగా తెలుగులో బయలుజేరిన వ్యాకరణములనుగూర్చి వ్రాయుచు—ఆ వ్యాకరణములు చిన్నవి, సులభములు అని చెప్పుకొన్నను; విషయ బాహుళ్యమును విడిచి సౌలభ్యమును సంపాదించినవనియు; ఆ పద్ధతి, భూగోళ శాస్త్రజ్ఞుడు, పట్టణములను, నదులను, సరిహద్దులను విడిచిపెట్టి, తన పటమునకు సౌలభ్యము సంపాదించినట్లున్నదనియు—నిశితముగ విమర్శించెను.57

"Such alliteration is used in Icelandic and indeed throughout the Gothic Languages."

"Gray uses it. 'Ruin seize thee ruthless king'; and Byron, 'so darkly deeply, beautifully blue." The yati 'Asonancia is used in Spanish verse".

(Ibidem. pages—314—315).

56. "Failing health having obliged me to return to England while this work was in the press, the latter pages contain some errors; but there are none which will impede the progress of the student.";

(Ibidem. preface; page—VI)..

57. "In the later years some grammars of the language, chiefly written in Telugu have appeared, professing to be shorter and more simple than mine; but they obtain simplicity by sacrificing knowledge of detail, as a geographer might simplify his maps by omittirg towns, rivers, and boundaries of countries."

ఇంగ్లీషువారు, హిందువులు పరస్పరము అర్థము చేసికొనుటకు ఒకరిభాష నింకొకరు నేర్చుటకంటె గత్యంతరములేదనియు, ఆ గమ్యస్థానమును చేర్చుటకు తన వ్యాకరణము ఏమాత్రము సాయపడినను తాను కృతార్థత చెందినట్లేయనియు బ్రౌనుదొర భావించెను. హిందువుల మనస్సును గ్రహించుటకు వారి పుస్తక పఠనముకంటె సులభమార్గము లేదనియు; అటులనే ఆంగ్లేయులనుగూర్చి తెలిసికొనుటకు హిందువులకు 58 ఆంగ్లభాషాపఠన మావశ్యకమనియు వ్రాసి తన దృక్పథమునకు గల వైశాల్యమును ప్రకటించెను.

ఇంత మహత్తరమైన కృషి చేసినాడు గనుకనే, ఆర్డెన్ (*A. H. Arden*) తన తెలుగు వ్యాకరణము యొక్క పీఠికలో; తెలుగు చదువుకొను ప్రతి విద్యార్థియు బ్రౌనుదొరకు ప్రత్యేకముగ కృతజ్ఞుడై యుండవలెనని వ్రాసి, అతనియందు తనకు గల గౌరవభావమును వ్యక్తీకరించెను.

పరిస్థితులు అనుకూలముగ లేకున్నను, అవకాశములు తక్కువగనున్నను; బ్రౌనుదొర వీటినన్నింటిని జయించి తన కార్యమును కొనసాగించుకొనెను. దీనియందే అతని ఘనత కలదు. "క్రియాసిద్ధి స్సత్త్వేభవతి మహతాం నోపకరణే"

(From 'Some Account of the Leiterary life of C. P. Brown).

58. "Unless we read their books, and have daily communications with the Hindus, what insight can we obtain into the minds of the people?"

"In like manner the prejudices of Hindus regarding ourselves, can only be removed by a course of English reading.

(A Grammar of the Telugu Language By C. P. Brown. 2nd Edition. 1857' preface; page—VII)

59. "The student of Telugu must ever feel specially grateful to Mr. C. P. Brown by whose efforts so much has been done to bring the language into its present position, and to render it accessible to Europeans."

(A progressive grammar of the Telugu Language By A. H. Arden. 1873. preface; page—III).



# సాహిత్యములో జ్యోతిషము

శ్రీ విశ్వనాథ నరసింహము

మహాకావ్య నిర్మాతలగు కవీంద్రు లనేక శాస్త్రములలో నారితేరినవా రనుట విస్పష్ట విషయమగుచుండ వారికి జ్యోతిషములో గల వైదుష్య విశేషములఁ బరిశీలింపనగును.

ఆది కవియగు వాల్మీకి మొట్టమొదట శ్రీరాముఁ డవతరించు సందర్భమున గ్రహగతుల వివరించి యున్నాఁడు.

"నక్షత్రే దితి దైవత్యే
స్వోచ్ఛసంస్థేషు పంచసు
గ్రహేషు కర్కటే లగ్నే
వాక్పతావిందునా సహ
ప్రోద్యమానే జగన్నాథం
సర్వలోక నమస్కృతమ్."

కర్కాటక లగ్నమున నుచ్ఛస్థులై యయిదు గ్రహములుండ లగ్నమందు గురు చంద్రులుండ జగన్నాథుఁడైన శ్రీరాముఁ డుదయించెను. ఇందు పేర్కొనఁబడిన ముఖ్యవిషయము లేమన నయిదు గ్రహము లుచ్చనుబొందుట యొకటి.

'పంచోచ్ఛే లోకనాయకః' అను జ్యోతిష శాస్త్రప్రమాణము ననుసరించి యెవరి జననకాలమునందు బంచగ్రహము లుచ్ఛస్థులైయుండునో ఆ జాతకులు లోకనాయకు లగుచున్నారు. మఱియు కర్కాటకమున గురు చంద్రుల సంయోగము చెప్పఁబడినది కటకరాశి గురున కుచ్ఛస్థానమును చంద్రునకు స్వక్షేత్రమునై యుండె గురుఁడు కటకలగ్నమునకు భాగ్యాధిపతి యగును. లగ్నాధిపతి యగు చంద్రుఁడు భాగ్యాధిపతి యగు గురునితోఁ జేరియుండు టత్యంత శుభదాయకము. "దుర్లభః కర్కటే జీవః" అను ప్రమాణము ననుసరించి కటకరాశిలో బృహస్పతి సాధారణముగా నుండుట తటస్థింపదు. అటు లుండినచో విశేష శుభదాయకము. ఇట్టి సంయోగమును గజకేసరీయోగ మందురు.

ఇట్టి యోగమునే మహానాయకులు జన్మించు నవసరంబుల నాంధ్రకవులు పేర్కొని యున్నారు. పిల్లలమఱ్ఱి పినవీరన శృంగార శాకుంతలములో శకుంతలకు పుత్రుఁడు జన్మించునపుడు వర్ణించిన సంప్రదాయ మిట్టిదియే.

"భానునిఁ బొందక యుచ్చ
స్థానంబున గ్రహము లయిదు దనరఁగ ఫలదం
బైన శుభ యోగమునఁ దే
జోనిధి భాగ్యోన్నతుండు సుతుఁడుద
యించెన్"

ఇంగు వర్ణితమయిన విషయ మొండు విశేషముగా నున్నది. రవితో నెట్టి గ్రహము—బుధునకు వలిగా—సంపర్కము నొందినను నా గ్రహమునకస్తంగత దోషమొదవును. ఆంధ్రకవితాపితామహుఁ డగు నల్లసాని పెద్దన

"తేజం బజ్జభవాండ గేహమునకున్
దీపాంకురచ్ఛాయమై
రాజిల్లన్ గ్రహపంచకంబు రవిచే
రంబోని లగ్నంబునన్
రాజీవాక్షి కుమారుఁ గాంచె..."

అని వర్ణించినాఁడు.

శ్రీ మహాభారతము నాదిపర్వంబున నన్నయ భట్టారకుఁడు కుమారాస్త్రవిద్యాసందర్శన కథా సందర్భమునఁ బంచాంగ శుద్ధి దిన శుభముహూర్తంబున నని పేర్కొనినాఁడు. తిథివార నక్షత్ర యోగకరణము లనఁ బ్రసిద్ధములగు పంచాంగ శుద్ధ దినమున నా రాజకుమారుల విద్యాప్రదర్శనమును విదురు డేర్పాటు చేసినట్లు విశదమగుచున్నది.

తిక్కన సోమయాజిచే రచింపఁబడిన భారతము నందలి యుద్యోగపర్వమున శ్రీకృష్ణరాయబారము నందు ధర్మరాజు శ్రీకృష్ణునితో

"అని కార్యంబు నిశ్చయించి దినశుద్ధి నిరూపించి నారాయణుం జూచి నీ నక్షత్రంబు రోహిణి గదా యెల్లి రేవతి నీకుఁ జంద్ర తారాబలంబులు గలవు గమనంబునకు రేపకడయ మేలు పయనంబగుట లెస్స..." యని నుడివెను.

జ్యోతిశ్శాస్త్రమున జాతకముహూర్త భాగంబులు గలవు. అందు ముహూర్తభాగంబున యాత్రాదుల కనువగు దినశుద్ధియును చంద్రతారాబలంబులును చూచుకొనవలెను. జన్మనక్షత్రమును పురస్కరించుకొని తారాబలనిర్ణయము చేయవలెను. శ్రీకృష్ణుని జన్మనక్షత్రము రోహిణియగుట రేవతి సాధన తార యగుటచే

'సాధనం కార్య సాధనమ్' అను ప్రమాణము ననుసరించి యయ్యది శుభప్రదము. మఱి రోహిణీ నక్షత్రము వృషభరాశి యగును. రేవతి మీనరాశి యగుటచే నేకాదశ చంద్రబలము

"దశమైకాదశే శుభః అను కారిక చొప్పున శుభము గను.

మఱియు శ్రీనాథకవిసార్వభౌముని రచన యని వక్కాణింపఁబడు 'క్రీడాభిరామము'నందు నుషఃకాలంబు సర్వప్రయోజనారంభంబులకుఁ బ్రశస్తమను సందర్భమున

"గార్గ్యసిద్ధాంతమత ముషఃకాలకలన
శకున మూనుట యది బృహస్పతి మతంబు
వ్యాసమతము మనః ప్రసాదాతిశయము
విప్రజనవాక్యమరయంగ విష్ణుమతము"

అని వచియింపఁబడినది. అనఁగా వివిధ విధములుగా ఋషీశ్వరులు కార్యారంభంబు లొనరించుటకు, శుభసమయంబుల నిరూపించి చెప్పిరని తెలియ నగును. శ్రీనాథుని భీమఖండము మున్నగు కావ్యములలో నిట్టి యుదాహరణములు గలవు.

శ్రీకృష్ణదేవరాయలు ఆముక్తమాల్యదలో వర్షాకాల వర్ణనము నారంభించుతఱి నిట్లు వర్ణించెను.

"వనతతి వరాహ వాహోరి వాయుభుగ్వి
రోధి వారణ వర్షాభు లాధిఁ దొఱఁగ
నెండ్రి రవి చేర మూఁడవయెడకుఁ జేరు
తరణి ధరణిం బ్రమోదసంధాయి గాఁడె"

ఇందు మొదటి రెండు పాదములలోఁ జెప్పఁబడిన వనతతి వరాహాదు లాఱింటికిని కటకరాశిం బ్రవేశించిన రవి ప్రమోదమును చేకూర్చునని వచింపఁబడినది. జన్మనక్షత్రము లేనివారలకు నామనక్షత్రములు

"యాచేచోలాస్తు చాశ్వినో్య
లీలూలేలో భరణ్యపి."

ఇత్యాదిగా నిర్దేశింపఁబడినవి. తత్ప్రకారము వనతతి వరాహాదుల నామనక్షత్రము రోహిణి యగుట వృషభరాశి యగుచున్నది. "షట్త్రిదశస్థో భానుః" అను కారికచే జన్మరాశికి తృతీయరాశియం దున్న రవి—వృషభరాశికి కర్కాటకము తృతీయరాశి—శుభఫలప్రదుఁడగును. ఆషాఢమాసములో రవి కర్కాటకరాశిలోఁ బ్రవేశించినంత వర్షము లారంభమగుట యనుభవసిద్ధమగుచున్నది గదా.

తరువాత శ్లేషకవితాచక్రవర్తియగు రామరాజభూషణుఁడు హరిశ్చంద్ర నలోపాఖ్యానమునందు

"పంచమశుద్ధి గల్గనెడ
భాపి ఫలోదయ ధన్యలై లతా
చంచలలోచనల్ ప్రసవసంపద పెంపు
వహింపఁగా విజృం
భించు తదీయలక్ష్మిఁ దెలి
పెన్ సకలాగమపారగద్విజా
భ్యంచిత పక్షపాత కలి
తాతి వినూతనజాతపత్రముల్"

అని వర్ణించినాఁడు. ఇచట పంచమశుద్ధి యనుటలో పంచమభావశుద్ధియును పంచమస్వరశుద్ధియును శ్లేషించినాఁడు. "పుత్రబుద్ధి హర్షజ్ఞాన వాగ్విద్యా సాచివ్య ప్రాధాన్య కౌశల్య పాండిత్య శిల్పాదికారకం పంచమమ్" అని పంచమభావనిరూపణము విశదమగుచున్నది. లతాచంచలలోచనలకు పంచమరాశి క్రూరగ్రహవీక్షణాదులు లేక పరిశుద్ధముగా నున్నయెడల పుత్రభావము శుభఫలదమగుననియును, కోకిలలకు పంచమస్వరశుద్ధియు నిందుఁ జెప్పఁబడినవి.

అడిదము సూరకవి కవిజనరంజన మనఁబఱగు చంద్రమతీ పరిణయ ప్రబంధములో వివాహ సందర్భమున దంపతుల పేరం బంచాంగశుద్ధియు సూర్య సంక్రమ సగ్రహపాప షడ్వర్గ భృగుషట్క దంపత్యష్టమ కుజాష్టమ కుజ నవాంశ క్రూరర్క్ష చంద్రషష్ఠాష్టమ వ్యయస్థితి ప్రభృతి దోషరహితంబగు నొక్క కల్యాణ లగ్నంబు సిద్ధాంతీకరించినట్లు రచియించెను. వివాహసందర్భములలో నేటికిని భృగుషట్క కుజాష్టమ దోషములు మిక్కిలి ప్రబలముగా నెన్నఁబడు చున్నవి. కుజదోష మనునది "ధనే వ్యయేచ పాతాళే..." అను కారిక ననుసరించి యంగారకుఁడు ద్వితీయ చతుర్థ సప్తమాష్టమ వ్యయస్థానములలో నెచటనున్నను దోషముకాన నట్టి జాతకులకు కన్య నీయ సమ్మతింపరు. పైని పేర్కొనఁబడిన దుఃస్థానములలో నంగారకస్థితి ద్వికళత్రయోగమనుట విశదమగు విషయము.

ఇంక నాధునిక కాలములో శ్రీ॥ శే॥ తిరుపతి వెంకటకవులు జాతకచర్యను ప్రత్యేకముగా రచియించుటయేకాక వారి ప్రబంధములలో నత్యుత్తమముగా నెంచఁబడు బుద్ధచరిత్రమునందు పెక్కుతావుల జ్యోతిష వైదుష్యము విశదీకరించిరి. పునరాగతుఁడగు బుద్ధునింగాంచిన శుద్ధోధనుఁడు పుత్రమమకారమునం జేసి

అకట యింతటి రాజ్యంబు నడవిపాలు
చేసి సన్యాసివైతి కాశ్మీర గర్ద
భము విధమ్మున నీజాతకము వృథావి
శేషభాజన మింకేమి సేయగలదు"

అని నుడివెను. ఇందలి సంప్రదాయ మేమనఁ గొందఱి జాతకములలో రాజయోగము లుండును. అయినను అట్టి రాజయోగకారక గ్రహదశలు సంభవింపక పూర్వమే గోచార దోషాద్యరిష్టములచే వారు మరణింతురు. అట్టివారిని కాశ్మీరగార్దభములని 'జాతకచంద్రిక'లో పేర్కొనినారు. ఈ దిగువశ్లోక మా యర్థమును విశదపఱచును.

"యోగేషు కేచి జ్జాయంతే
మూఢాః కాశ్మీరగార్దభాః
యోగాస్తే కిం కరిష్యంతి
స్వదశానా మనాగమే"

మహాకవు లీరీతి జ్యోతిష సంప్రదాయములం దమ రచనలలో ననుసరించిరి.

# భాస్కర మంత్రి వంశము

శ్రీ దేరవపల్లి వెంకటకృష్ణారెడ్డి

ఆంధ్రభారత పీఠికలో తిక్కన తన వంశము నీ క్రింది సీసములో వివరించియున్నాడు.

'మజ్జనకుండు స - న్మాన్య గౌతమగోత్ర
మహితుండు భాస్కర-మంత్రితనయుఁ
డన్నమాంబాపతి - యనఘులు కేతన
మల్లన సిద్ధనా - మాత్యవరుల
కూరిమి తమ్ముండు-గుంటూరి విభుఁడు కొ
మ్మన దండనాథుండు...'

ఈ వంశీయు లే ప్రదేశముల నివసించిరో? కనుగొందము.

క్రీ. శ 1230-31 తేది నెల్లూరుజిల్లా, ముసునూరు శిలాశాసనములో 'గంపె గోపాలుండు...తిరుకాల్తి దేవభూవరుని రాజ్యంబున..... మంత్రి కేతనుండు'1 దాతగా పేర్కొనబడియున్నాడు. ఇతడు కవి యనుటకు కొన్ని పద్యాధారము లున్నవి కాని, ఇతని కాదంబరీ గ్రంథము లభింపలేదు. అయినను, ఈ కేతనమంత్రి మల్లనమంత్రికి అన్న కాకపోడు.

క్రీ. శ. 1252—53 తేది నెల్లూరుజిల్లా శిలాశాసనములో 'తిక్కయదేవ మహారాజులు...ప్రధానులైన సిద్ధన పెగడ'2 సమకాలికులుగా కనబడుచున్నారు. ఇందలి సిద్ధన ప్రెగడకూడ భాస్కరమంత్రి పుత్రుడనియుఁ కేతన-మల్లనమంత్రుల తమ్ముడనియు గుర్తింప వీలున్నది. కాని, కవి తిక్కన తండ్రి కొమ్మన తన యన్నలవలె మంత్రిగా ఉన్నట్లు కనబడలేదు. పై నెల్లూరుజిల్లా శాసనములు రెంటిలో పేర్కొన్న చోడరాజు పేరు 'తిరుకాల్తి దేవ—తిక్కయదేవ' మహారాజులుగా మారు పేర్లతో పేర్కొన్నను, ఇవి వ్యక్తిభేదమును సూచింపవు. కాళహస్తిలో ఉన్న తిరుకాళత్తి స్వామి యే తెనుగులో తిక్కయైనాడు.

1. తె. క. చరిత్ర, భా. *I*, పు. [illegible]20.
2. ఆం. క. తరంగిణి, భా *II*, పు. 211. (నెల్లూరు శాసనములు, పు. 1394)

ఇతని కుమారు డగు చోడ మనుమసిద్ధికి కవి తిక్కన నిర్వచనోత్తర రామాయణమును కృతి యిచ్చి నందువల్ల కవి తిక్కనతండ్రి కొమ్మనకూడ తిక్కయ దేవచోడరాజుదగ్గర మంత్రిగనో? దండనాథుడుగనో యుండియుండును. ఇట్లగుచో కవి తిక్కనతండ్రియు, పెదతండ్రులు కేతన—సిద్ధన లిద్దరును నెల్లూరు చోడ రాజుల నాశ్రయించినట్లు చెప్పక తప్పదు. పోతే, కవి తిక్కన పెదతండ్రి మల్లనమంత్రి, తాత భాస్కర మంత్రి3 కాక[ ] రాజ్యము నాశ్రయించినటు కన బడుచున్నది

తెలంగాణమందలి వరంగల్ జిల్లా ధర్మసాగ రము శిలాశాసనములో 'కాకతీయాన్వయమ్ * * * గణపత్యే (ధీ) శః * * తకతోల భాస్కరమంత్రి వర్యాః * * తత్పుత్రోయమ్ * * మంత్రి మల్ల (శ్చ) 4 వ్యక్తుల ప్రస్తాపన కలదు. ఈ శిలా శాసనములో దానకాలము లేకపోయినను, ఇందలి క్రీ. శ. 1199-1261 మధ్య రాజ్యము నేలిన కాకతీయ గణపతిని బట్టి, శాసనకాలము క్రీ. శ. 1230-31 ప్రాంతప్రుదిగా నిర్ణయింప వీలున్నది.

ఇట్లే మంత్రి వంశ సంబంధమునుబట్టి చూచి చినచో క్రీ. శ. 1230-31 ప్రాంతమునాటికే నెల్లూరు చోడరాజ్యమునకును, కాకతీయ రాజ్యమున కును మైత్రియో? సంధియో? కలదన వీలున్నది.

చోడమనుమసిద్ధి దాయాదులచేత కోలుపోయిన నెల్లూరు చోడరాజ్యమును కాకతీయ గణపతిసాయ ముతో కవితిక్కన మరల స్థాపించెనను. చరిత్ర కీమంత్రివంశ సంబంధము తోడ్పడుచున్నది.

కాకతీయ గణపతి కార్యకర్తగా5 ఉన్న పెద తండ్రి మల్లన సాయముతోను, తన పాండిత్యప్రతిభ తోను తిక్కనకవి తన ప్రభురాజ్యస్థాపనాచార్యు డైనాడన్న మంత్రివంశసంబంధము బోధపడును.

ఈ శిలాశాసనములలోని వ్య[ ]ల కులగోత్రా దులు స్పష్టముగా తెలియకపోయినను, వంశానుక్రమ ణిక సుబోధకముగుచున్నది. అన్నిటను 'మంత్రి' వంశము సూచితమై యున్నది. కాని, 'తకతోల'6 ఇంటిపేరు క్రమముగా నివాసస్థానములనుబట్టి; గుంటూరు, కొట్టరువు, పాటూరు, ఇంటిపేర్లుగా మారి నట్లు కనబడుచున్నది. ఇతరాధారములతో ఈ విషయ మింకను చర్చించుట వాంఛనీయము.

భాస్కరమంత్రి
- కేతనమంత్రి (చోడతిక్కయ. క్రీ. శ. 1230-31)
- మంత్రి మల్లన (కాకతీయ గణపతి క్రీ. శ. 1199-1261)
- సిద్ధన ప్రెగడ (చోడతిక్కయ క్రీ. శ. 1252-53)
  - ఖడ్గతిక్కన
- కొమ్మనదండనాథ
  - కవి తిక్కన (చోడ మనుమసిద్ధి క్రీ. శ. 1257-60)

3. 'సవాజహృదంకలయతికలానా'

4. తెలంగానా శాసనములు, సం. 56. పు. 97 - 98.

5. 'సకల స్వామి (కా) ర్యాణమపి లక్ష్మీ వాసః * * తత్పుత్రోయమ్.'

6. 'తస్మింనాసీద్గతీ (?) తకతోల భాస్కర మంత్రివర్యాః'

# సద్విమర్శనము

## రత్నగీత

ఖండకావ్య సంపుటి; రచన: కీ. శే. చదలవాడ నాగరత్నమ్మగారు. ప్రాప్తిస్థానం, సరస్వతీ బుక్ డిపో విజయవాడ; వెల తెలియదు.

"తెలుగు భాష" "తెలుగు జాతీయత" అని పెద్దపెద్ద పలుకులు పలుకుతూ వుండేవారు, ఈ సంపుటిలోని పద్యాల నన్నిటినీ పరిశీలన చేయటం అవసరం. ఈమాటలు కొందరికి కంటకంగా విను పించితే వినుపించవచ్చును గాని ఇది ముమ్మాటికీ సత్యం: ఈ పద్యాలను కొన్నిటిని చిత్తగించితే విషయం తనంతదా బోధపడుతుంది.

ఇల్లు వెండికొండ విల్లు బంగరుకొండ
సంగడీడు నిధు లొసంగువాడు.
మూడుకన్నులుండు మొనగాడు మావాడు
శంకరుండు మమ్ము సాకుచుండు.'

*　　*　　*　　*

తిన గూడుం, ధరియింప వస్త్రమును, లే
దే యంచు రోదించు వా
రిని వీక్షించి, యథార్థఘట్టమును వ
ర్ణింపంగ జంకేల? దు
ర్జన ధిక్కారము, నజ్జనస్తవ మొన
ర్పం జెల్లు మోమోటముం
గన నేలా? లిఖియింపు పద్యముల, శి
క్షా యుక్తముల్ లేఖినీ!

*　　*　　*　　*

రూక లేనివాడు పోక చేయగ లేడు
రూక గల్గునతడు లోకకర్త
ప్రాలు సరిగ జేయజాలని యాతని
ఆనమాలువారు గానరారు.

మంచి చెడ్డ లాతడెంచిన ట్లే యగు
'చిత్త' మంచు సంతసింపవలయు
నందిబందియన్న, బందిని నందన
ఎదురుమాటయున్న బ్రదుకుసున్న.

కడుపుచిచ్చు నార్ప గాల్పట్టు బీదకు
చిల్లి కానియేని చేతనిడడు
పచ్చనోట్లొసంగి బ్రతిమాలు నుద్యోగి
దప్పమాన్ప గొప్పతనమునిల.

*

అప్పొసంగి, పెంచి, చిప్ప జేతికొసంగి
ఎన్ని ప్రొయ్యి లాఱిపించినాడొ!
చిత్రగుప్తునొద్ద చిట్టాను విన్పింప
'ఆఱునొక్కరాగ' మపుడదీయు.

*　　*　　*　　*

నోరుగలవానికే గల యూరు గలదు
ఊరుగలవానికేగద యునికి గలదు!
ఉనికిగలవానికేగద మనికి గలదు
మనికిగలవానికేగద మహిత గతులు.

ఈ పరిమితావకాశంలో, ఇలా ఎన్ని పద్యాలు ఎత్తిచూప వీలౌతుంది. మహాకవి "గ్రే" ఒకేఒక్క ఖండకృతి రచించి దివంగతుడు కావటం ఆంగ్ల వాఙ్మయానికి దురదృష్టమని ఆంగ్లేయులు ఈనాటికీ విచారించుతారు. ఈ తల్లిని కోల్పోయిన మనం? ఈ తల్లి జీవితచరిత్రను ఇంచుక స్మరించవలసి ఉన్నది. ఇవి శ్రీ మిన్నికంటె గురునాథ శర్మగారి వాక్యాలు:

'నాగరత్న మొరంగలు జిల్లా మధురలో బుట్టినది; తండ్రి బండి నరసింహముగారు; తల్లి లింగమ్మగారు. ఈమె సరస కవీశ్వరుడు హిందీ భాషా పారంగతుడునగు కోటి నరసింహముగారిని జెట్టబట్టినది.

ఈమెకు సంగీతము, సాహిత్యమూ, సౌజన్యమూ, సారసగర్భుడు సంతరించి సంతతి నొసంగలేదు; అక్క తన నీమె భర్తకు మఱొక పెండ్లి తన చేతులతో చేసినది.

'భర్తకు స్ఫోటకము పోయగా నొద్ద సేవజేయుచుండి యొకనాటి రేపకడ 'తల్లీ! నా భర్తను విడిచి నన్ను గైకొనుమని మ్రొక్కినదట. ఆ యపరాహ్ణమున కామెకు స్ఫోటకము పోసినది. భర్తకు నెమ్మదించినది.

"అంబ పిల్పును విన్నయప్పుడే దీని — జెఱపి మృత్తికయందు వేయుగును — నామరూప క్రియాంతకురాల నగుదు — శాశ్వతానంద వాసస్థలంబందు' అని కన్నులు మూసినదట" — (18-4-1951 తేదిన.)

ఆ తల్లి, శాశ్వతానందవాసస్థలం చేరుకోబోతూ ఇలా పాడుకొన్నది:

[నేనూ - నా బొమ్మరిల్లు]

దూల మొక్కటి లేని యాలయంబిద్ది
ద్వారంబులందు మూడారు చెన్నారు
దినదినం బభివృద్ధి గనిపించుచుండు
బహుకాలమునకు నిల్వదు బొమ్మరిల్లు

ప్రహ్లాద నారద వ్యాసాంబరీష
భాగవతోత్తమ ప్రముఖులు మున్ను
శైశవం బిచ్చట జరుపుకొన్నారు
పురుషార్థముల నిందు బొందగావిందు

... డే దీని
జెఱపి మృత్తిక ..ందు జేర్చి వేయుదును
నామరూప క్రియాంతకురాల నగుదు
శాశ్వతానంద వాసస్థలంబందు'

ప్రాజ్ఞురాలైన ఇట్టి ఇల్లాలిని గోల్పోయిన కోటి నరసింహముగారు ఎంత దురదృష్టవంతుడు! ఆయనను ఏమని అనునయింపగలం?

## ప్రత్యూషము

ఖండకావ్య సంపుటి: రచన: యువ కవిత్రయము, రాయలసీమ (శ్రీయుతులు కె. సుబ్బయ్య, యస్. రాజన్న, జి. గోపాలకృష్ణయ్య. వెల: 0 8-0. ఈ కవులకు తెలుగు జాతీయతను ప్రతిబింబించాలనే ఆవేశం వుంది. అందుచేత 'తెలుగు గుండెలు' 'తెలుగు జిహ్వాలు', 'తెలుగు కన్నులు' ఇత్యాది విశేషంగా వాడుతూవుంటారు. కాని 'ఆ తెలుగు తనం' అనేది యేమిటో అవగతం చేసుకుని దాన్ని ప్రతిపాదించటానికి పూనుకోవటం లేదు. అది అంత తేలికగా అవగతం అయేది కాకపోయినా సాహసులైన యువకులు కృషి చేసి సాధింపదగ్గది. అలాంటిది యేమీ లేకుండా 'తెలుగు గుండెల బండు తియ్యనూమిటితోట' ఇత్యాది భావాలేవో గుతప్పితే అపహాస్యంగా వుంటుంది. భాషలో కూడా తెలుగుతనం లేదు. ప్రాప్తిస్థానం: ప్రకాశ్ ముద్రాక్షరశాల, ప్రొద్దుటూరు, వెల ఎనిమిది అణాలు.

## కుమార కథామంజరి

మహాకవి దండి రచనకు అనువాదం. అనువాదకులు శ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు. ప్రాప్తిస్థానము: శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు, నెల్లూరు;

వెల 2-0-0. సంస్కృత మాతృక సమాసభూయిష్టంగా వుండి అతిక్లిష్టంగా వుంటుంది. అలాంటి గ్రంథాన్ని అనువాదం చేసేటప్పుడు, అదేక్లిష్టత అనువాదంలోకి కూడా వ్యాపించటానికి చాలా అవకాశం వుంది. ఇలాంటి బాధ రాకుండా శ్రీ పిచ్చయ్యశాస్త్రిగారు తెలుగువచనాన్ని ధారావాహినిగా రచించి విజయాన్ని చేపట్టగలిగారు. ఇందుకు అనువాదకులను అభినందించవలసి వుంది. రచన సరళమైన గ్రాంధిక భాషలో హృద్యంగా వుంది.

## నాగానందము

హర్షకృతికి తెలుగుసేత: అనువాదకులు: కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు. సంస్కృత నాటక రచయితలలో హర్షవర్ధనునకు ప్రఖ్యాతమైన స్థానంవుంది. ఆయన రచించిన మూడు నాటకములలో (రత్నావళి, ప్రియదర్శిక, నాగానందము) నాగనందాన్ని మహోత్కృష్టమైన రచనగా చెబుతారు. ఇందు ప్రతిపాదింపబడిన ఉదాత్తమైన కథావస్తువే యిందుకు కారణం కావచ్చు. కి. శే. ప్రభాకరశాస్త్రిగారు ఈ అనువాదానికి పూనుకోవటానికి కూడా యిదే కారణమై ఉండవచ్చు. ప్రభాకరశాస్త్రిగారు దీట్లో రెండు అంకములను మాత్రం అనువాదం చేసి దివంగతులైనారు. అనంతరం శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు మిగతా మూడు అంకాలనూ అనువాదం చేసి దీనికి కలిపి గ్రంథాన్ని సంపూర్తిచేశారు. శ్రీ అవధానిగారు గద్య పద్యాలను ప్రభాకరశాస్త్రిగారి రచనకు దగ్గరగావుండేలాగు సంతరించి, వ్యత్యాసం కనుపించకుండా సమర్థించారు. ప్రాప్తిస్థానం మానేజరు, మణిమంజరి, ముక్త్యాల. వెల 2-0-0.

## దివ్యదర్శనము

పద్యరచన: పద్యకృతి: రచన: శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. ఇది లోగడ 'భారతి' యందు ప్రకటితమైనది. సాధకుడైన యొక వృద్ధబ్రాహ్మణునకు కనకదుర్గ సాక్షాత్కరించి యొక తాళపత్ర గ్రంథమునొసంగుట యిందలి ఇతివృత్తము. ప్రాప్తిస్థానం: మేనేజరు మణిమంజరి, ముక్త్యాల వెల 1-0-0.

## శ్రీ అరవిందుల సందేశమువారి ఆశ్రమము

రచన: శ్రీ గడియారము వేంకటశేష శాస్త్రిగారు; ప్రకాశకులు అరవిందాశ్రమ తెలుగు ప్రచురణశాఖ, పుదుచ్చేరీ: వెల 0 8 0.

## నేటి చైనా

రచన: విజయకుమార్; విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ - 2.

## ప్రతాపసింహము

రాణాప్రతాప్ చరిత్ర: వచన రచన: రచయిత శ్రీ కొత్త సత్యనారాయణ చౌదరి; ప్రకాశకులు: విజయ పబ్లిషింగ్ కంపెనీ, గుంటూరు వెల రు. 1-2-0.

## గతితార్కిక భౌతికవాదం

రచన: శ్రీ కంభంపాటి సత్యనారాయణ (సీనియర్): విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ - 2. వెల 1 0 0.

## గండిపడ్డ జీవితాలు

కథల సంపుటి; రచన: శ్రీ పి. యస్. ఆర్. ఆంజనేయశాస్త్రి: జనపద ప్రచురణలు 1-8-452 చిక్కడ్‌పల్లి; హైదరాబాదు. వెల 0 10-0.

## కవితా మంజరి

పద్యరచన: రచయిత శ్రీ చొల్లేటి నృసింహశర్మ, ఉపాధ్యాయుడు: గవర్నమెంటు మిడిల్ స్కూలు, హనుమకొండ. వెల 0-8 0.

## శ్రీ స్వామి

భక్తిరసపద్యసంపుటి; రచన: శ్రీ యం. వి. ఆర్. కృష్ణశర్మ; ప్రసూనా పబ్లికేషన్సు, గుంటూరు వెల 0-6 0.

## జానపద ప్రతిబింబములు

సహకార నాటిక; రచన: శ్రీ కోదాటి వెంకటేశ్వరరావు; ప్రాప్తిస్థానం: కోదాటి వెంకటేశ్వరరావు, బి. ఎ. సూర్యాపేట (వయా) ఖమ్మంమెట్టు. వెల 0-6-0.

## రాధ

పద్యకావ్యం; రచన: శ్రీ పోడూరి భోగరాజు: ప్రచురణ: శ్రీ వి. ఆర్. కె. పబ్లికేషన్సు, ఏలూరు. వంగవైష్ణవ సంప్రదాయము ఆధారముగా రాధా మాధవుల విరహాసంయోగములు అభివర్ణితములు. వెల 1-8-0.

Printed & published by S. Sambhu Prasad at the Andhra Patrika Press No. 7. Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad.







# లైఫ్ బాయ్ సబ్బు

ప్రతిదిన మలినములోని క్రిములనుండి
మిమ్ములను కాపాడును






